# భాగవతకథ

## షోడశ భాగము

గ్రంథకర్త - శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి

అనువాదం - శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య

శ్రీ

# భాగవత కథ

( శ్రీ మద్భాగవత దర్శనము )

## షోడశ భాగము


హిందీ మూలము

శ్రీ౧౦౮ ప్రభు దత్త బ్రహ్మచారి మహారాజ్

ఆంధ్రానువాదకులు, శ్రీరామ శరణ్

శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య



శ్రీ వేంకటేశ్వరార్ష భారతీ ధర్మసంస్థ

హైదరాబాదు.

# తొలి పలుకు

బ్రహ్మ సృష్టిలో మానవుఁ డుత్తమోత్తముఁడుగా పరిగణింపఁ బడుచున్నాఁడు. అందు కితర జీవజంతువులకు లేని జ్ఞాన మతని కుండుటయే కారణము. భగవంతుఁడు కరుణాళువై ప్రసాదించిన యీ జ్ఞానము సాహాయ్యమున మానవుఁడు తురీయ పురుషార్థమైన మోక్షమును బొందుటకు యత్నింప వలయును. అతఁడట్లు చేయనిచో నాహారభయ నిద్రాదులతోఁ గాలము పుచ్చుచుండు నితర జీవులకును అతనికిని ఆకారమున మాత్రమే భేదముండును. మోక్షప్రాప్తికి మన పూర్వులు మూఁడు మార్గములను నిర్దేశించి యుండిరి. అవి జ్ఞాన, కర్మ భక్తి మార్గములు. ఈ కలియుగమున వీనిలో మొదటి రెండు మార్గము లను అవలంబింపఁ జాలువా రరుదుగా నుందురు. ఇంక మూఁడవదైన భక్తి మార్గమును స్త్రీలనక, పురుషులనక, బాలురనక, వృద్ధులనక, పండితులనక, పామరులనక అందఱు ననుసరించి మోక్షసౌధమును జేరవచ్చును.

వేదార్థోపబృంహణార్థమై భగవంతుఁడగు కృష్ణద్వైపాయనుఁడు బ్రహ్మసూత్ర శ్రీ మద్భాగవతములతోపాటు పదునెనిమిది మహాపురాణ ములను ఉపపురాణములను కూడ రచించియుండెను. ఇవి కథోపాఖ్యాన పూర్వకముగా **వేదవిశి**ష్టములైన ధర్మ నీతితత్త్వములను జిజ్ఞాసువు లంద ఱికిని సుబోధ మొనరించును. పదునెనిమిది పురాణములలో భాగవత మొకటి. ఇది శ్రీమద్భాగవతమా, దేవీ భాగవతమా, అను విషయమున పండితులలో వివాదమున్నది. కాని పలువురది శ్రీ మద్భాగవతమేయని

భావించుచున్నారు. ఇది యెంత మనోహరమో, భాషాభావము లందంత క్లిష్టమైనది. అందుచేతనే "విద్యావతాం భాగవతే పరీక్షా" అను నానుడి యేర్పడుటయు, పోతరాజు "భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు శూలి కైనఁ దమ్మిచూలికైన" నని చెప్పుటయు సంభవించినది. "భగవతః ఇదమ్" (భగవంతునికి సంబంధించునది) అని భాగవత శబ్దమునకు వ్యుత్పత్తి. ఇందు భగవన్మాహాత్మ్య బోధకములైన విషయములు కథలు అనేకములుండును.

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశాను చరితము అను పంచలక్షణములు పురాణమునందుండును. శ్రీ మద్భాగవతము పురాణమగుటచే నిందా పంచలక్షణములును కలవు. వీనితో పాటిందు శ్రీమన్నారాయణునికి సంబంధించిన ఏక వింశత్యవతారము లును (21) వర్ణింపఁబడియున్నవి. "యదాయదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత" "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం, ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే" అని శ్రీ మద్భగవద్గీతలో భగవంతుఁడు చెప్పినట్లాతఁడు ధర్మ సంస్థాపనము కొఱకును, సాధురక్షణ, దుష్టశిక్షణముల కొఱకును భూమిపై నవతరించుచుండును. ఆ యవతారముల విషయమే శ్రీమద్భాగవతము నందు ప్రపంచింపఁబడి నది. మత్స్యకూర్మాద్యవతారములన్నియు నవతార ప్రయోజనములను నిర్వహించినమాట వాస్తవమేయైనను "కృష్ణస్తు భగవాన్ స్వయ" మ్మను సూక్తి ననుసరించి యిందు దశమస్కంధమున శ్రీ కృష్ణుని జన్మాది వృత్తాంతములు విపుల తరముగా వివరింపఁబడినవి. భాగవత తారహార మునకు దశమస్కంధము తరళ ప్రాయము.

శ్రీ మద్భాగవతమున కర్మజ్ఞాన విషయములు కూడ ప్రతిపా దింపఁబడినను భక్తికే అందు ప్రాధాన్యము. మోక్షప్రాప్తి కదియే పరమసాధనమని యది బోధించును. అందలి కథోపాఖ్యానములన్నియు భక్తిమహత్త్వ ప్రతిపాదనము నందే పర్యవసించును. జగద్గురు శ్రీ శంకరాచార్యులవారు కూడ భక్తిని నిరసింప లేదనుటకు "మోక్ష సాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అని వివేకచూడామణిలో చెప్పియుండుట నిదర్శనము. సత్యముకూడనంతే. కలియుగము నందలి జనులు కర్మజ్ఞాన మార్గముల నవలంబింపఁజాలని వారగుటచే భక్తినే ఆశ్రయింపవలయును. సంసార సాగరతరణమున భక్తియే నిరపాయ మైన నౌక. వ్యాసభగవానుఁడు భాగవతము నిగమ కల్పతరువు నుండి జాఱిన ఫలమని చెప్పియుండెను. అది కల్పతరువువలె భక్తులకు సర్వాభీష్టములను సిద్ధింపఁజేయును.

వ్యాసుఁడు సంస్కృతమున రచించిన శ్రీ మద్భాగవతమును మహాభక్తుఁడును, కవిపుంగవుఁడునైన బమ్మెర పోతరాజు గద్య పద్యాత్మకముగా తెలుఁగున ననువదించెను. అతఁడు రచించిన భాగవతము నందలి కొన్ని భాగము లేకారణము చేతనో శిథిలమగుటచే వాని నతని మిత్రులో శిష్యులోయైన గంగన, సింగన, నారయ యను వారు పూరించిరి. అయినను తెలుఁగున భాగవతము మాట విన్నంతనే పోతరాజే తలంపునకు వచ్చును. ఆంధ్ర దేశమున నతని భాగవతమున కున్నంత ప్రచారము మఱే గ్రంథమునకును లేదనుటలో నతిశయోక్తి లేదు. అందుకతని పద్యములందలి ధారాశుద్ధియు నాన్యతో దృశ్యమైన మాధుర్యమును కారణములు. అందలి పద్యము లొండో, రెండో

నోటికి రాని అక్షరాస్యుఁడు మొన్నమొన్నటి వఱకు ఆంధ్ర దేశమున నుండెడివాఁడుకాదు. కాలవైపరీత్యముచే నిప్పుడందలి పద్యములను కంఠగతము లొనరించుకొనువారి సంఖ్య చదువుకొన్న వారిలోనే చాల తక్కువైనది. పోతరాజు సంస్కృత భాగవతమును యథాతథముగా నాంధ్రీకరించియుండలేదు. భక్తిభావ భరితమైన భాగముల నాతఁడు పెంపొందించి యుండెను. అది గాక పద్యకావ్యముల నర్థము చేసికొనఁ గలవా రిప్పుడెందరో యుండరు. అందుచే సంస్కృత భాగవతమునకు రెండు మూడు వచనానువాదములు కూడ వెలసినవి. భాగవతమువంటి ఉత్తమ గ్రంథమెంత అధికముగా ప్రచారము పొందిన లోకమున కంత మేలు కలుగును.

తపోనిష్ఠాగరిష్ఠులు, యోగిపుంగవులు, భక్తశిఖామణులునైన శ్రీశ్రీశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు జగద్ధితార్థమై శ్రీ భాగవతము నందలి విషయములను కథాదృష్టాంతానుభవపూర్వకముగా సరళసుందరమైన హిందీభాషలో నఱువది సంపుటములుగా వచన రూపమున రచించి యుండిరి. అది హిందీ భాషాభిజ్ఞుల అదృష్టము. వానిని భక్తవరేణ్యులు శ్రీ రామశరణ్ కుందుర్తి వేంకటనర్సయ్య గురుపుంగవులు సర్వసుబోధమైన భాషలో తెలిఁగించి యుండిరి. భక్తిప్రధానమైన శ్రీ మద్భాగవతమును భక్తవరేణ్యుఁడైన పోతరాజాంధ్రీకరించుటవలన నాంధ్ర లోకమున కెంత మహోపకారము జరిగినదో భక్తచూడామణులైన శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి గారి హిందీ గ్రంథమును భక్తిసముద్రులైన శ్రీ కుందుర్తి గురుపుంగవు లాంధ్రీకరించుట వలన నంతమహోపకారము జరిగినది. ఆ గ్రంథమునకు శ్రీ మద్భాగవతదర్శనమను పేరు

సార్థకము. అది రెండుసార్లు ముద్రితమైనది. కాని ప్రతులిప్పుడు లభ్యములగుటలేదు. అది చూచి నిత్యధర్మకార్యపరాయణులును వదాన్య శేఖరులునైన భక్తులొకరు రా సంపుటములను పునర్ముద్రించుట వలన లోకమునకు మేలు కలుగునని అందుకు సంకల్పించిరి. వారు సిద్ధ సంకల్పులు. వారి సంకల్ప బీజము వృక్షమై యిప్పుడీ గ్రంథముల రూపమున ఫలించినది. ఆంధ్రులా ఫలమును ఆస్వాదించి ఆనందపారవశ్యము పొందుదు రనుటలో సందేహము లేదు.

ఆ భక్తులే శ్రీ వేంకటేశ్వరార్షధర్మ భారతీధర్మ సంస్థను స్థాపించి దాని పక్షమున అష్టాదశ మహా పురాణములను తెలుగు లిపిలో తాత్పర్య సహితముగ ముద్రించి ఆంధ్రులకు మహోపకారము చేయుచున్నారు. ఈ భాగవతకథా సంపుటములు కూడ, శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతీ ధర్మ సంస్థ పక్షముననే ముద్రింపబడుచున్నవి.

శ్రీ వేంకటేశ నామ్నా
భారత సంస్కృతి ప్రవర్ధనార్థాయ
సంస్థాపితేయం ధర్మ
సంస్థార్షా జయతు భగవతః కృపయా,

—దివాకర్ల వేంకటావధాని

నిగమకల్పతరో ర్గళితం ఫలం
శుకముఖాదమృతద్రవ సంయుతం
పిబత భాగవతం రస మాలయం
ముహురహో రసికా భువి భావుకాః

—సంస్కృత భాగవతము

లలితస్కంధము కృష్ణ మూలము శుకా
లాపాభిరామమ్ము మం

జులతాశోభితమున్ సువర్ణ సుమన
స్సుజ్ఞేయమున్ సుందరో

జ్జ్వల వృత్తమ్ము మహాఫలమ్ము విమల
వ్యాసాలవాలమ్ము నై

వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వు
ర్విన్ సద్ద్విజశ్రేయమై

—శ్రీ మదాంధ్ర మహాభాగవతము



శ్రీ రా మ

# అ జా మి ళో పా ఖ్యా న ము

## [హరినామ మహిమ]

## నరక మేది?

# 345

శ్లో॥ న చేదిహైవాపచితి యథాం హసః
కృతస్య కుర్యాన్మన ఉక్తిపాణి భిః
ధ్రువం నవై ప్రపేత్య నరకానుపైతి
యే కీర్తితా మే భవతస్తిగ్మ యాతనాః॥

శ్రీ భాగ. ౬ స్కం. ౧౬ అ. ౧౭ శ్లో.

దృష్ట సుఖమనియు, శ్రుత సుఖమనియు సుఖము రెండు విధములు. మన యింద్రియములతో నీలోకమున ననుభవించు సుఖమునకు దృష్టసుఖమనిపేరు. మెత్తని గద్దెపైఁ గూర్చుండుటచే స్పర్శేంద్రియ సుఖమబ్బినట్లును, అత్యంత సుందరవస్తువులను జూచుటచే నేత్రములకు సుఖము కలిగినట్లును, అత్యంత స్వాదిష్ట పదార్థములను దినుటచే నాలుక కదలించుచుఁ బెదవులను దడుపుచు, నోటనీరూరినట్లును, తాళస్వరసహిత

మగు సుందరగానము వినఁబడినప్పుడేమియును దెలియకున్నను మనః ప్రసన్నత కలిగినట్లును సమస్తేంద్రియముల విషయమునను అట్లేమిగిలిన విషయమునను సుఖమిట్లుండునని గ్రహింపవలయును. ఇంద్రియానుభవ సుఖమునే దృష్టసుఖమందురు. మన మనుభవింపక వినినమాత్రముచేతనే కలుగుదానిని శ్రుతసుఖమందురు. విమానమునెక్కి తిరిగివచ్చినవాఁడిట్లనును. "వాయుయానము నెక్కుటచే మిక్కిలి యానందము కలుగును. బుఱ్ఱుబుఱ్ఱుమని వాయుయానముపై నెగురుచున్నప్పుడు కడుపులోని నీరును గదలదు. పైమండి యిండ్లన్నియును పంక్తులవలెఁ జిన్న చిన్నవిగ గోచరించును. వృక్షములన్నియును జిన్నమొక్కలవలెఁ గనఁబడును. మార్గములన్నియును గీతలుగఁ గనఁబడును. వంకర టింకరగఁ బ్రవహించుచున్న నదులు పొడుగుపాటి పాములవలె గోచరించును. పైని ధూళియును లేదు, అదురునులేదు, ఆనందముతో దృశ్యమును జూచుకొనుచు నెగిరిపోవచ్చును." ఈః వర్ణనమునఁగలుగు సుఖముచే నేర్పడు స్పృహకే శ్రుతసుఖమందురు. స్వర్గము నెవరుచూచినారు ? స్వర్గమును జూచి కలియుగమందెవరు తిరిగివచ్చిరి? కాని శాస్త్రమును, ఆప్తవాక్యమును దాని యస్తిత్వమునకుఁ బ్రమాణములు. అచ్చట విమానములున్నవి, అప్సరసలున్నారు, గంధర్వులున్నారు, కల్పవృక్షమున్నది, కామధేనువు కలదు, నందనవనమున్నది, అమృతమున్నది, ఇంకేమేమో ఉన్నవి. వానిలోభముచే వానిని బొందు కోరికతో మనము సత్కర్మ లొనర్చుచున్నాము, వానిని బొందుచున్నాము.

దృష్ట, శ్రుత భేదములచే సుఖమెట్లు రెండు విధములో అట్లే దుఃఖమును రెండువిధములు. దృష్టదుఃఖము శరీరమందు నానారోగము లేర్పడినప్పుడు కలుగు దుఃఖము. తలనొప్పి వచ్చుట, జంతువులుపడుట, ఒంటి కణతనొప్పి, వ్రణము, కన్నుపోటు, కురుపులకుఁ జీముపట్టి పురు

గులుపడుట, పిప్పిపన్ను, పండ్లూడుట, నోటిపూఁత, దుర్గంధము వెలువడుట, ఉదర వికారము, వీర్యవికారము, కురుపులు మొదలగునవి శరీరమందనేకములగు రోగములు కలుగుట, వానివలన దుఃఖపడుట. వీనినన్నిటిని వ్యాధులందురు. అపకీర్తికలుగుట, యువకుఁడగుఁ బుత్రుఁడు మరణించుట, కుమార్తె పెండ్లాడఁగానే విధవయగుటయు, వ్యాజ్యమునోడిపోవుటయును, నెవఁడైనఁ గటుశబ్దములనుబలికి యవమానించుటయును, వీనినన్నిటిని దృష్ట దుఃఖములందురు. నరకములో నానాయాతనములను గుఱించి శాస్త్రములలో నానాబాధలను వర్ణింపఁబడినవి. ఇవి శ్రుత దుఃఖములు. జీవుఁడీలోకమునఁ గర్మల నొనర్చి పరలోకమున దుఃఖములను భోగించును. కర్మానుసారముగ జీవులు నానాయోనులందుఁ బుట్టుట సంభవించుచున్నది.

పరీక్షిన్మహారాజు శుకదేవ మహాముని నిట్లడిగెను :— "ప్రభూ! పుణ్యముచే జీవుఁడు స్వర్గమునకు వెళ్ళి సుఖమనుభవించుననియుఁ బాపముచే నరకమునకుఁ బోవుననియుఁ జెప్పితిరి. ఇదియేమి? చాలమంది పుణ్యాత్ములు దుఃఖములను భోగించుటయును, పాపులు పాపమొనర్చియు నానందముతో విషయోపభోగము లనుభవించుటయునుఁ జూచుచున్నాము. ఇదియేల? ఉచ్చనీచత్వములకును లఘుగురుత్వములకును గారణమేమి"?

అంత శుకుఁ డిట్లనెను :— "రాజా! ఇది కర్మగతి పూర్వజన్మమునఁ జేసిన పాపముదయించినచోఁ బుణ్యాత్ములకైనను దుఃఖము ననుభవింపక తప్పదు. పూర్వజన్మమున నొనర్చిన పుణ్యోదయమైనచో బాపకర్మ లొనర్చుచుండియును బూర్వ పుణ్యప్రభావముచే సుఖోపభోగ సామగ్రి ప్రాప్తించును; కాని పుణ్యాత్ముఁడు దుఃఖమనుభవించుచు దానిని ధైర్యముతో సహించును. వాని కంతగాఁ గ్లేశముండదు. మన ప్రారబ్ధము నశించుచున్నది. ఇది మన మంచికేనని అతఁడు తలంచును. దీనికి విప

రీతముగాఁ బాపాత్ముఁడు విషయోపభోగ మొనర్చుచు నశాంతుఁడుగను దుఃఖియునగును. అతఁడయ్యో! ఈ విషయోపభోగములు నశించుచున్నవే, ఇవి పోఁగూడదు" అని విలపించుచుండును. మహారాజా! సత్త్వరజస్తమోగుణాధీనుఁడై మానవుఁడు కర్మలొనర్చును. ఆ కర్మ సంస్కారములంతఃకరణమందుఁబడును. ఆ కారణమున నానాయోనులందీ పృథ్వియందు జన్మించును. మరణించి కర్మానుసారముగ స్వర్గనరకములందు సుఖోపభోగములనో లేక యాతనలనో ననుభవించును."

పరీక్షిన్మహారాజిట్లడిగెను :— "స్వామీ! స్వర్గ విషయములను నేను చాల వింటిని; కాని నరకమననేమియో, ఇది లోక విశేషమో లేక మనము శ్వాన సూకరయోనులందు ప్రాణులు నానాక్లేశములను బడుటను జూచుచున్నాము, అది యేనరకమో అడుగఁదలచితిని."

శ్రీ శుకుఁడిట్లనెను :— "మహారాజా! పృథివియందు భౌమ స్వర్గ మెటున్నదో, అట్లే యిచ్చటను భౌమ నరకము కలదు; కాని నరకమనుపేరఁ బాతాళముక్రింద నొక యంధకారమయమగు దేశము కలదు. పాపుల నచ్చటికి యమధర్మరాజుయొక్క ఆజ్ఞచేఁ దీసికొనిపోవుదురు. వారి పాపముల ననుసరించి దండింపబడుదురు."

అంత రాజిట్లడిగెను :— "స్వామీ! పాపము శరీరముతోఁ జేయఁబడినది. ఈ శరీరము మరణించిన మీఁదట నిచ్చటనే యుండిపోవును. దేనితోఁ బాపకర్మ నొనర్పబడినదో అది యిచ్చటనే నిలిచిపోయినది. ఇఁక నరకములో దుఃఖము లొసంగునది ఎవరికి? ఇంకొక శరీరముచే యాతనల ననుభవింపవలసి యుండుననుట ఇది అన్యాయము. ఒక దేహముతోఁ జేయుటయును నింకొక దేహముతో ననుభవించుటయునా? ఇది యుచితము కాదు. ఒకానొకఁడు పరస్త్రీగమన మొనర్చిన బరిణామ

స్వరూపమునఁ బాపము సంతానమునకుఁ గలిగినది. చచ్చిన తర్వాత నా పురుషుని శరీరము యిచ్చటనే యుండును. ఆ స్త్రీ శరీరమును నిచ్చటనే యుండినది. ఆపాప పరిణామ స్వరూపమునఁ గలిగిన పాపజనిత సంతానమును నిచ్చటనే యుండిరి. ఇప్పుడు నరకమందు దుఃఖమును భోగించునదెవరు ?"

అంత శ్రీశుకుఁ డిట్లనెను — "మహారాజా ! ఈ ప్రశ్నకు ప్రత్యుత్తరము నేను నారద ప్రాచీన బర్హిసంవాదమున నిదివఱకే చెప్పియున్న సంగతి జ్ఞప్తియందుంచవచ్చును. మరల వినుము. పాపపుణ్యములు రెండును మనఃప్రవృత్తులు. ఈ కర్మలందు మనఃప్రవృత్తి లేనంతవఱకు శరీరము పాపమును జేయఁజాలదు. పుణ్యమును జేయఁజాలదు ఒక మానవుని పాదములకు పాదుకలున్నవి. అతఁడు వాటిని ధరించి పూజామందిరమునకుఁ బోయెను. బుద్ధిమంతులగువారు ఆ పోవువానినే. మంచి చెడు పలికెదరు. నీవు లోపలికి వచ్చినావని కఱ్ఱను బట్టుకొని పాదుకల నెవ్వరును గొట్టరు. పాపము పాదుకలు స్వయముగఁ బోఁజాలవు. తొడిగిన వాఁడెచ్చటికిఁ గొనిపోయిన నేయభ్యంతరమును బెట్టక అవి పోవును. ఫలభోక్త వాటిని ధరించినవాఁడు కాఁగలడు. ఇదే విధముగ శరీరము సాధన మాత్రమే. భోక్తమనస్సు మాయా మోహితుఁడగు జీవుఁడు మనోవ్యాపారములను దనపై నారోపించుకొని, తానే కర్తయనుకొనును. కావున శుద్ధ, బుద్ధ, ముక్తుఁడైనను భావనాను సారముగ మనః కారణమున నాతఁడు సుఖదుఃఖము లనుభవింపవలెను. బ్రహ్మహత్య, పరస్త్రీ గమనములందు మనఃప్రవృత్తియే లేకున్నచో శరీర సంసర్గమే యుండదు సంసర్గమున్నను మనోభావము దూషితము కానిచోఁ బాపమే జరుగదు. ఏ గుణమున కధీనమై మనస్సెట్టి కర్మ నొనర్చునో దానికట్టి

సంస్కారమే యేర్పడుపు. దానికి తగిన క్లేశములనే అనుభవించును. దృష్టాంతమును గ్రహింపుఁడు. స్వప్నమున నొకఁడు మన శిరస్సును నఱకినాఁ డనుకొనుఁడు. ఎంతో కష్టము ననుభవించెదము. అచ్చట కత్తి యును లేదు, నఱకువాఁడును లేఁడు, శిరస్సును లేదు. అయినను నిద్ర మెలఁకువ రానంతవఱకు క్లేశానుభవము మనస్సు చేయుచునే యుండును. అదే విధముగఁ గర్త యొక్క సూక్ష్మశరీరము యాతనామయ దేహమును బ్రాప్తించునప్పుడు నరక దుఃఖములను సహించును- పూర్వవాసనాస్మృతిచే స్థూలశరీరముతో నెట్లనుభవించినాఁడో అట్లే అనుభవించును.

రాజిట్లడిగెను :— "స్వామీ! ఇన్ని వేదనల ననుభవించినను అతఁడు మరణింపఁడేల ?

శీఘ్రముగ శ్రీశుకుఁ డిట్లనెను :— "రాజా! చనిపోవునదేది చచ్చునదీ స్థూలశరీరమే. సూక్ష్మము మరణించుటేమిటి? స్వప్నమందు శిరస్సు తెగిపోయినప్పుడు స్వప్నద్రష్ట తన శరీరము మొండెము నుండి వేఱుపడినట్లు స్వప్నములోఁ జూచినాఁడు గదా? మొండెమునుండి శిరస్సు వేఱుపడుటయే జీవునకు మృత్యువు గదా! దాని ననుభవించినదెవరు? నా శిరస్సు తెగినదని దెవఁడు? ఇదేవిధముగ యాతనా శరీరమున కెన్ని క్లేశములను గలిగించినను వాని ముక్కలు ముక్కలుగఁ గోసినను నాతఁడు మరణింపఁడు కాని యా దుఃఖానుభవమును మాత్రము చేయును. (ఇవన్నియును సంస్కారమయ దేహమునకు సంస్కారమయ యాతనల ననుభవించును.) కావున రాజా! నిషిద్ధకర్మ కర్తలకు వారివారి శ్రద్ధలోఁ గల అసమానతా కారణమున వారికర్మ ననుసరించి ఫలము లభించుట స్వాభావికమే ఎవఁడెట్లు చేయునో అతఁడు పరలోక మందట్టి సుఖదుఃఖములనే యనుభవించును."

రాజాశ్చర్యముతో నిట్లనెను :— "స్వామీ ! దీనివలన నా రోమములు నిక్కబొడుచుచున్నవి. ఏయే పాపములచే జీవుఁ డేయే నరకములకుఁ బోవునదియు, నేకర్మలచే నెట్టియాతనల ననుభవింపవలసియుండునో దయయుంచి తెలుపుఁడు."

రాజడిగిన ప్రశ్నను విని శుకదేవుఁ డిట్లనెను :— "మంచిది రాజా ! వినుము. నేను సంక్షేపముగ నంతయును జెప్పెదను."

## ఏయే పాపముల నెవరెవరు నరకమును బొందెదరు ?

## 346

శ్లో. తస్మాత్ పురైవాశ్విహ పాపనిష్కృతౌ
యతేత మృత్యోరవి పద్యతాత్మనా,
దోషస్య దృష్ట్వా గురు లాఘవం యథా
భిషక్చికిత్సేత రుజాం నిదాన విత్ ॥

శ్రీ భాగ. ౬ స్కం. ౧ అధ్యా. ౮ శ్లో.

పాపమొనర్చుటచేఁ దప్పక నరకము ప్రాప్తించును. పుణ్యపాపముల నొనర్చినవాఁడీ లోకమునందును, జచ్చి పరలోకమందును ననుభవింపవలయును. కావున ముందుగాఁ బాపము చేయకుండవలయును. ఒక్కవేళఁ బొరపాటునను, అసావధానమునను బాపమొనర్చినచో నాతఁడు శరీర

ముందుగనే ప్రాయశ్చిత్త మొనర్చుకొనవలయును. కావున నేపాపమెట్టిదో దాని నొనర్చుటచే నే నరకము ప్రాప్తించునో, ఏయే యాతనల ననుభవింపవలసి వచ్చునో ఇట్లు పాపస్వరూపము నెఱుఁగవలెను.

శుకదేవుఁ డిట్లనెను :— "రాజా ! నరకము దక్షిణదిశయందున్నది. సప్తపాతాళములకుఁ గ్రింద, యెచ్చట జలమేయున్నదో ఆజలమునకుఁ బైనను భూమికి క్రిందనున్నది. స్వర్గమునకువలె నిదియు నొక సూక్ష్మభావమయ దేశవిశేషము. అవి స్థూలదృష్టి గలవారికి చర్మచక్షువులకుఁ గనఁబడదు. స్వప్నపదార్థములు భావమయములును సూక్ష్మములై యుండును. జీవుఁడు మనస్సుద్వారా వానివలన సుఖదుఃఖానుభవములను జెందును. అట్లే నరకములన్నియు దుఃఖదాయకములగు పదార్థములు—నారకీయ జీవుఁడే యాతనాశరీరముచే వాని ననుభవించును. అచ్చట సూర్యపుత్రుఁడును పితృరాజునగు యముఁడొక రూపముతోఁదనభృత్యులకు దుఃఖసహిత నివాసమునొనర్చును. పాపులకు దుఃఖమును గలిగించుటకు సమస్త వ్యవస్థనొనర్చును. ఆ దిశయందే అగ్నిష్వాత్తాది నిత్యపితరులు సమస్త యోనులలోని పితరులకు వారివంశము వారొసంగిన శ్రాద్ధాన్నమును వారి కనురూపముగ నేర్పఱచి యొసంగును. పాపములకు లెక్కలేదు. అసంఖ్యాకములుగ నున్నవి. ఎన్నిరకముల జీవులున్నారో అన్నిపాపములున్నవి. అన్నినరకములున్నవి. అయినను సామాన్యముగ ముఖ్యముగ నిరువదొక్క నరకములున్నవి. కొందఱింకనేఁడింటిని జేర్చి యిరువదెనిమిది యందురు. ఇప్పుడు వాటిపేర్లనువినుము. మొదటిది తామిస్రనరకము. అది యెల్లప్పుడును దమముతో వ్యాపించి యుండును. అచ్చటఁ దినుటకు దెబ్బలు లభించును. దినమంతయును వీఁపున దడదడ దెబ్బలు పడుచుండును. నిరంతర మాఁకలిదప్పులు బాధించుచుండును. తినుట కేమియును దొఱకదు. సూక్ష్మదేహమగుటచే

మృత్యువును లభించదు. దెబ్బలు తినుటయును, ఆఁకలిదప్పులచే వ్యాకు లము చెందుటయును ఇదియే అచ్చటి వ్యాపారము."

రెండవది అంధతామిస్ర నరకము. తామిస్రనరకమందు యాతన ననుభవించుచు నేడ్చుచుందురు. కాని అంధతా మిస్రమందు యమదూతలు స్పృహతప్పి పడిపోవువఱకుఁ గొట్టెదరు. చేతనా శూన్యులగుదురు. చైత న్యము వచ్చెనా మరల స్పృహతప్పువఱకును గొట్టెదరు.

మూఁడవది రౌరవనరకము, అచ్చట రురు అను జంతువు సర్పము కంటెఁ గ్రూరమైనది కాటువేయుచుండును. అందువలన నదిరౌరవమని పిలువబడినది. రాజా ! నేను ముందుగా నీకన్నిటి నామములనుజెప్పి తర్వాత నచ్చటగల దుఃఖాదులను వర్ణించెదను. తామిస్రము, అంధతామి స్రము, రౌరవము, కుంభీపాకము, కాలసూత్రము, అసిపత్రవనము, శూకరముఖము, అంధకూపము, కృమిభోజన సందంశము, తప్తభూమి వజ్రకంటకము, శాల్మలీ, వైతరణి, పూయోదము, ప్రాణరోధము, విశ సనము, లాలభక్షణము, సారమేయాదనము, అవీచి, అయాపానమును నీ యేకవింశతి నరకములు కలవు. ఇవిగాక క్షారకర్దమము, రక్షోగణ భోజనము, శూలప్రోతము, దందశూకము, వటరోధనము, పర్యావర్త నము, సూచీముఖమనునవి యివి యేడు. ఈవిధముగ నివి యిరువదెని మిది నరకములైనవి. అట్లే అసంఖ్యాకములుగ నున్నవి. ఎవఁడెట్టి పాప మొనర్చినాఁరో వారట్టి నరకమును బొందుదురు.

మహారాజా ! అన్నిటికంటె గొప్ప పాపము హింస. ప్రాణి జీవింపఁగోరును. మృత్యువు రాకముందే చావవలెనని యెవ్వఁడునుగోరరు.

జీవితేచ్ఛ గలవారు ఉదరపోషణమునకై లేక ద్వేషాహంకారవశమునఁ జంపువాఁడు నానానరకములందు భిన్నభిన్న యాతనల ననుభవింపవల యును. జీవహింసకుమించిన పాపములేదు. తన కష్టమెట్లో అందఱకును నంతే కష్టముకదా ! కావున వీలైనంతవఱ కేజీవికిని హింసయొనర్పరాదు.

అంత రాజిట్లడిగెను :— "స్వామీ ! జీవహింస యింతపాప మగుచో మనుష్యజీవనము జరుగుటెట్లు ? జీవములవలననే జీవికనడుచును తిత్తిరి రోజు ఎన్నో కీటకములను దినుచున్నది. కప్ప ఈఁగలను దినియే బ్రదుకుచున్నది. బల్లి రాత్రింబవళ్ళు ఘాతమీఁదనే నివసించును. జల జంతువులు పెద్దవి చిన్నవాటినిఁదిని జీవించును. సింహవ్యాఘ్రములు మాంసమును దప్ప మరేమియును దినవు. ఇవన్నియును హింసనెట్లు వదలఁగలవు ?"

శుకుఁ డిట్లనెను :— "మహారాజా ! పశువులకును మానవులకును భేదమిదియే. అవి వాటి సహజ స్వభావమును మార్చుకొనఁజాలవు. మాన వుఁడు తలఁచుకొనిన మార్చుకొనఁగలడు. అందువలననే మానవుని "సాధకుఁడనిరి."

అంతఁబరీక్షిన్మహారా జిట్లనెను :— "సాధకుఁడనఁ బడినచోఁ బ్రాణము నీయవలయునా ? హింసచేయకున్న నొక్కదినమైనను జీవింప లేము. ప్రతిఅన్నకణములోను జీవమున్నది ? కూరగాయలలోను, ఫలాదు లందును జీవముకలదు. అన్నియును వృద్ధిపొందవలెను. అన్నియును జీవింపగోరును. ఒక దోసకాయ పెరుగుచుండును. మనము దానినిఁ గోసి కొని తినుచున్నాము. అది హింసకాదా ? ఇదియే హింసయగుచోఁ గొందరు పావురములను, మేఁకలను, కోళ్ళను దిందురు. ఒక్కవిషయము. మీరు

జీవహింసనుగూర్చి యింతగా నిందింపనేల? రెండు కాళ్ళవారికి నాలుగు కాళ్ళుగలవి భక్ష్యములే. పాదచారులకు అపదజంతువులు భక్ష్యములు. పెద్దవాటికి చిన్నవి భక్ష్యములు ఒక జంతువు మఱియొక జంతువును దినియే జీవించుచున్నది. అట్టియెడ హింసను దప్పించుకొనఁగల వాఁడెవఁడు?

ఇది విని శుకుఁ డిట్లనెను :— "రాజా! నీవు చెప్పునది నిజమే. ప్రపంచములో నన్నిటియందును జీవముకలదు. జీవములేకున్న నస్తిత్వమే లేదు. అయినను జీవులలోఁ దారతమ్యము కలదు. జీవునిలోఁ జైతన్య మెంతయధికముగఁ బ్రకాశించిన నాజీవి అంత అధికశ్రేష్ఠమైనది మహారాజా! ఱాళ్ళలోఁగూడ జీవమున్నది. బావి త్రవ్వునపుడు మట్టిలోనుండు రాళ్ళను జాగ్రత్తగఁ బరిశీలించినచో నవి పెరుగుచున్నట్లు కనుఁగొనఁగలము. వృద్ధిక్షయములు జీవనమందే యుండును. కాని ఈ ఱాళ్ళలోఁ జైతన్యతత్త్వ మత్యంతాల్పము. కావున నిల్లు, మార్గము వీటిని నిర్మింపకయే పనిజరుగుచో వ్యర్థముగ ఱాళ్ళనుగొట్టి త్రవ్వవలసిన పనిలేదు. కొట్టుట, త్రవ్వుటవలననే పనిజరిగినచో నంతయే కొట్టవలెను. ఱాళ్ళలోఁగంటె గడ్డియందు చైతన్యప్రకాశ మెక్కువగ గోచరించుచున్నది. గడ్డి తరుగుచుండును, బెరుగుచుండును. నీరు పడఁగానే పచ్చనగును. ఱాళ్ళను గొట్టుటకంటె గడ్డిగాదమును గోయుట యెక్కువ హింస. గడ్డికంటే నెక్కువ చైతన్యము లతాభూరుహములందు గనఁబడుచున్నది. లతావృక్షములు ఫలవృక్షముల నొసంగును. ఇవి కన్నులతోఁజూచి అల్లుకొనును. సుఖదుఃఖాను భవమును జెందును. శీతోష్ణములను దెలిసికొనఁగలవు కావున గడ్డికంటె వీనినిఁ గోసిన నధికహింస. లతావృక్షములకంటె నధికచైతన్యము చేఁవలు, గ్రుడ్లు, కీటకములు,

పత్రములందు గలవు. కావున వీనిలో జీవము ప్రత్యక్షముగఁ గోచరించును. కోడిమెడఁ గోసినచో నెంతగాఁ దపతపలాడునో, మేఁకను గోసినచో చావఁబోవునపు డెంతగాఁ దన్నుకొనునో చూడుము. రాజా! ఈ నోరులేని పశువులను అవిధిగా హత్యగావించుట కేవల స్వార్థమునఁ బొట్టనింపుకొనుటకు గదా? ఈ ప్రాణములకు ఘాతమొనర్చుట ఘోరపాపము ఇంతకంటే నధిక చైతన్యము హయ, గజ, మర్కట, గో, మహిషాది బుద్ధజీవులగు పశువులందు గలదు. వీనికంటె నధికముగ మానవులందును, మానవులకంటె నధికముగ బ్రాహ్మణులయందును, బ్రాహ్మణులకంటెను సర్వశ్రేష్ఠులు జ్ఞానులును, విద్వాంసులును, శాస్త్రపారంగతులు నైయున్నారు కావున నిన్నిటికంటెఁ బెద్దపాపము బ్రహ్మహత్య. బ్రహ్మహత్యకు మించిన పాపములేదు.

రాజిట్లడిగెను :- "మనకుఁ దెలియకుండఁగనే నిత్యము ఈఁగలు, చీమలు, దోమలు, పురుగులు చచ్చుచున్నవి. ఇవి చచ్చినఁ బాపము కలుగదను కొందును."

శుకుఁడిట్లనెను :- "ఏల కలుగదు రాజా! పాపమును దెలిసిచేసినను దెలియక చేసినను ఫలము నందఱు ననుభవించి తీరవలసిందే కాని తెలియక పొరబాటునఁ ననిచ్ఛాభావముతో జేసిన పాపమునకు అపరాధము తక్కువ ఇట్టి పాపమును శుష్కపాపమందురు. దీనికిఁ బ్రాయశ్చిత్తమేమనఁగా గృహస్థు నిత్యము అతిథియజ్ఞము, పితృయజ్ఞము, దేవయజ్ఞము, ఋషియజ్ఞము, బలివైశ్వదేవ యజ్ఞము జేయవలయును. వీని నొనర్చుటచే నీ యజ్ఞాత పాపములకుఁ బ్రాయశ్చిత్తమగును, పంచయజ్ఞముల నొనర్పకయే భోజనము చేయువాఁడును, అతిథి వచ్చినపుడు వానిని

విచారించనివాఁడును నన్నమును దినుటలేదు. పుసుగులనే తినుచున్నాడు. మహారాజా! ప్రత్యక్షముగఁ జూచితిని ఒక గృహస్థుకడ నొక సాధువుండెను. గృహస్థు యెచ్చటికో బయటకు వెళ్లెను. ఇంతలోనే ఇంకొక గొప్ప సిద్ధపురుషుఁడు వచ్చెను. మొదటినుండియున్న సాధువు చాల మంచి పాయసమును వండుచుండెను. ఈ క్రొత్తసాధువును జూడగానే అతఁడు మండిపడెను. ఇటనుకొనెను :— "ఈతనికిని భాగమీయవలసి యుండును. క్షీరాన్నము నేఁడు బాగుగాఁ గుదిరినది. ఇతరులకుఁ గొంచెమైన నీయగూడదు." అట్లనుకొని అతఁడు తలుపును వేసెను. గృహస్థుని ధర్మపత్నివచ్చి యిట్లు ప్రార్థించెను :— "స్వామీ! ఇంకొక నూతన సాధువు విజయముచేసినారు. వారికినిఁ బ్రసాదమును దయాటచేయవలెను" ఇది విని ఆ సాధువు మండిపడిపోయి ఆ స్త్రీని గద్దించి యిట్లనెను :— "ఇచ్చట వంటగింట లేదు పోండి" పాపమా స్త్రీ వెడలిపోయెను. నూతన సాదువునకు తొందఱగుటచే వారికి పాలనిచ్చిపంపివేసెను. నూతనసాధువు వెడలిపోయిన తర్వాత నా క్షీరాన్నము నాశించిన సాదువు పళ్లెములోఁ బాయసమును బోసికొనఁగానే దానిలో బియ్యం మెతుకులు లేవు. తెల్లని పురుగులు పళ్లెరములో నటునిటుఁ బారకాడుచుండెను. ఇప్పుడా సాధువునకు జ్ఞానోదయమయ్యెను. అతఁడు పరువిడి యా సిద్ధ సాధువుకడకుఁ బోయి, అతనినిఁ దన యపరాధమును క్షమింపుమని వేఁడుకొనెను."

సిద్ధసాధు విట్లనెను :— "సోదరా! నీవు నాకేమియు నపరాధ మొనర్పలేదు. భగవంతున కపరాధమొనర్చితివి. అతనికి నివేదింపకయే, ఇతరులకుఁ బ్రసాదమిడకయే తినఁదలచితివి. కావున నీ ఫలాని స్థాన మున నిన్నిదినములుండి సాధూచ్ఛిష్టమును దినుము. వారికంట్లుతోముము

అప్పటికి దోషము పోవును." కావున రాజా! ఇంతకుఁ జెప్పదలచిన దేమనఁగా పంచమహాయజ్ఞము లొనర్పక భోజనమొనర్చువాఁడు పురుగులతో సమానమగు భోజన మొనర్చుచున్నాఁడు.

వానికచ్చట కీటకములు కనబడకున్నఁ గనఁబడకపోవునుగాక. ఈ పాపమున నాతఁడు కృమిభోజనమను నరకమునకుఁ బోవును. ముందుగా వానిని కృములున్న కుండములోఁ బడవేయుదురు. అచ్చట వానిని నలువైపులను గీటకములు కుట్టును. రాత్రింబవళ్ళతఁడు కృములనే తినుచుండును. ఆ నరకమొక లక్షయోజనముల విస్తీర్ణము. నల్దిక్కుల నెటుగాంచినను కీటకములే. అవి ఒక కుండమునుండి మరియొక కుండమునకుఁబోవుచుండును. అవి పాపులను దినును. పాపులా కీటకములనే తిందురు. వీటినుండి రక్షింపఁ బడఁదలచుకొనినవాఁడు బాలకులకును, వృద్ధులకును, అతిధులకును గోవులు మొదలగు వాటికినిఁబెట్టక తినరాదు. భూతబలి నొసంగక యేకాకిగా నెన్నడును దినరాదు.

అంతఁ బరీక్షిన్మహారా జిట్లనెను :— "ప్రభూ! మాంసభక్షణము చేయకున్న జీవనమే నడువని దేశములు కొన్ని కలవు. ఒక్కొక్కప్పుడు విపత్తు సంభవించినపుడు మాంసమును దినియే జీవననిర్వాహ మొనర్చవలయును. ఇట్టిదశలో నేమిచేయవలయును?"

ఇది విని శుకుఁ డిట్లనెను :— "మహారాజా! విపత్తు విషయము వేఱు. ప్రాణధారణ మొనర్పవలయునని ప్రబలేచ్ఛయుండి మాంసభక్షణ మొనర్పక ప్రాణము నిలువకున్నచో నదియొక విషయముకాదు. మాంసభక్షణముతప్ప వేఱుమార్గములేని దెశములలోను, సముద్రతటమునఁగల కొన్ని ద్వీపముల విషయములోను నదిపేయ అచ్చట నంతటిదోషముండదు. కాని అన్నము పాలు, ఫలములు తిని నిర్వాహము చేయఁగలుగు

చోట వ్యర్థముగ మాంసమును దినుటకు జీవహింసచేయుట అక్షమ్య పాపము. చాలమంది దుష్టులు పావురములను, గోరువంకలను, కొంగలను ఇతరపక్షులను బట్టుకొని తెచ్చి బ్రదికియుండఁగనే అగ్నిలోఁ గాల్చెదరు. వారు చచ్చి కుంభీపాక నరకమునకుఁ బోవుదురు. అచ్చట పెద్దపెద్ద తుక తుకనుడుకు తైలకుండము లుండును. వారిని దానిలోఁబడవైచి యమదూతలు వేయించెదరు. వేదద్రోహులును, మాతృ పితృద్రోహులును, బ్రాహ్మణ ద్రోహులును, ఆ పశువుల కెన్నిరోమములు కలవో అన్ని వేలకొలఁది సంవత్సరములు కాలసూత్రమను నరకమందు బాధపడుదురు. ఆ నరకమందు పదివేల యోజనముల రాగినేలయుండును. అది యగ్నిచేఁ దప్తము చేయఁబడి యెఱ్ఱగనుండును. ఆ పాపిని ఆ యగ్నివలె నెఱ్ఱగ నైనభూమిమీఁదఁ బరువెత్తించెదరు. అతఁ డొక్కొక్కప్పుడు కూర్చుండును, ఒక్కొక్కప్పుడు దొర్లును, ఒక్కొక్కప్పుడు నిలుచుండును. ఈవిధముగఁ జిరకాలమువఱకు క్లేశమును సహించును.

పాషండులగువారు కేవలము పాషండము కొఱకు, జిహ్వాస్వాదము కొఱకు యజ్ఞములను నెపముననను, దేవీదేవతలను పేరుతోడను పశువులను బలినొసంగి మాంసమును రుచి యని దిని, తన మాంసమును బెంచుకొనునో, అతఁడు చచ్చి విశసనమను నరకమునకుఁ బోవును. అచ్చట వాని అంగప్రత్యంగములు మాటిమాటికి గోయబడుచుండఁగా, మరల నవి అతుకుకొనుచుండును. ఈవిధముగ వారికి నిరంతరము బాధను గలిగించుచుండును.

తామస భైరవ, యక్ష, రాక్షసుల కొఱకు నరమేధాది పాషండ యజ్ఞముల నొనర్చి పశువులనుగాని, నరపశువులనుగాని బలియొసంగి వారి

మాంసమును దినినచో, వారు స్త్రీలు కానిండు, పురుషులు కానిండు ఘోర నరకములకుఁబోయి, అచ్చట నదేవిధముగ వధింపఁబడుదురు. వీరు దేనిని జంపినారో వానిచేతనే ఛేదించి రక్తపానము నొనర్తురు, మాంసమును దిందురు. వ్యాధులవలె వధింపఁబడు నప్పుడప్పుడు మిక్కిలిహర్షించెదరు.

రాజకర్మచారులు లోభవశమున నిరపరాధులకును, అపరాధము న్నను బ్రాహ్మణులకును దండనముగాని, ఉరిశిక్షగాని యొసంగినచో వారు చచ్చినతర్వాత సూకరముఖమను నరకమునఁ బడుదురు. అచ్చట యమ దూతలు వారిని గానుగలోవైచి త్రిప్పెదరు. చెఱుకుముక్కలు నలిగినట్లు నలుగుచుండఁగా వారి యవయవములు నలిగి పిప్పిపిప్పి యగుచుండఁగా వారు హాహాకారము లొనర్చుచు నేడ్చెదరు.

మొదట పశువులను విశ్వాసమును గలిగించి పెంచి, తర్వాత వాటిని ఛేదించి తిన్నను, గంటమునకు గ్రుచ్చి కాల్చినచో, వారు చచ్చిన తర్వాత వారిని నట్లే కాల్చెదరు.

శుకదేవు డిట్లనెను :— "మహారాజా ! అధికముగ నేమని చెప్పు దును. సాధ్యమైనంతవఱకు ఏ జీవిని హింసింపఁగూడదు. ఇంతయేల నల్లులు, పేలు సర్పములు, తేళ్ళు వీనినిఁగూడ చంపరాదు."

ఇది విని రాజిట్లనెను :— "స్వామీ ! మీరిప్పుడు హద్దు నుల్లంఘించుచున్నారు. దుష్టులను దండించుట ధర్మమును బుణ్యమునై యున్నది. ప్రత్యక్షముగ మన శరీరములోని రక్తపానము నొనర్చి క్లేశమునొనర్చు వాటినిఁ జంపకపోవుట యేమి పుణ్యము ? అటులైన మనము యుద్ధములలో శత్రువులను గొట్టుటయుఁ జంపుటయునుబాపమే."

అంత గంభీరుఁడై శుకు డిట్లనెను :— "అట్లుకాదు రాజా ! యుద్ధమున నెదురుగా శస్త్రమును దీసికొని పోరాడవచ్చిన శత్రువును

జంపుట పాపముకాదు. అది క్షత్రియధర్మము. పుణ్యకార్యము. ఆతతాయిని జంపుట ధర్మమే, గ్రామమునకును, గృహములకును నిప్పుపెట్టువాఁడును విషము నొసంగువాఁడును, అన్యాయపూర్వకముగఁ జేత శస్త్రమును ధరించి వధించుట కుద్యుక్తుఁడైనవాఁడును ధనాపహరణ మొనర్చువాఁడును ఎవరి క్షేత్రమునైనను, స్త్రీనైనను బలవంతముగ గ్రహించువాఁడును నాతతాయులనఁబడుదురు. వీరినిజంపుటచేఁ బాపమురాదు; పైగాఁ బుణ్యమే. కాని రాజా! నల్లులు, పేలు మొదలగునవి యేమి చెరుపొనర్చినవి? అవియు బ్రదుకఁగోరుచున్నవి. రక్తపాన మొనర్చుట వాని వృత్తి. వాని నధికముగ నేమిచేయవలయుననఁగా నేదో విధముగ మన శరీరమునుండి వేఱుచేయవలయును."

రాజిట్లనెను :— "స్వామీ! అయితే మానవుడెంతవఱకు హింస నుండి తప్పించుగొనఁగలఁడు? గాయములలోఁ బురుగులు పడిన నౌషధములచేఁ జంపకున్న శరీరమంతయును గ్రుళ్ళిపోవును. కడుపులో నెన్నియో చిన్నచిన్న పురుగు లసంఖ్యాకములు గనఁబడును. అవి మలముతో వచ్చుచుండును. వాటిని నౌషధముతోఁ జంపకుండిన జీవితమే యుండదు. హింస లేకయుండనే యుండలేము.

అంత శ్రీశుకుఁ డిట్లనెను :— "మహారాజా! అట్లుకాదు. తప్పనిసరి యైనచో నేమిచేయఁగలము? చేతనైనంతవఱకు వ్యర్థముగ హింసచేయరాదు. ఎంతవఱకు తప్పించుకొనుటకు వీలున్నంతవఱకు తప్పించుకొనవలెను. చాలమంది సాధువులు చేతులార నల్లులను, పేలను బయటకుఁదీసి పాఱవేయరు. గాయములోని పురుగులు క్రిందఁబడిపోవుచో మరల వాటిని దీసి గాయములలోఁ బడవేయుదురు. చాలమంది పచ్చికాయలలో నధిక

హింస యున్నదను భయగారణమునఁ జెట్టునుండిరాలిన ఫలములనే తిని యుందురు. చాలమంది పచ్చియాకులలో నధికహింస కలదనుకొని యెండు టాకులను దిని జీవనధారణ మొనరించెదరు. సారాంశమేమనఁగా శక్తి యున్నంతవఱకు హింసను జేయరాదు. ఎవరెవరినిఁ గష్టపెట్టినారో వారట్టి ఫలమునే అనుభవింపవలయును. ఈవిధముగ హింసలకు ఇంకను ననేక నరకములు కలవు. వాని వర్ణనమును నేనెంతవఱకు చేయఁగలను. ఇప్పుడు నీవు మిగిలిన నరకముల వర్ణనమును వినుము."

## నారకీయ గతివర్ణనము

## 347

శ్లో. లోకే వ్యవాయామిష మద్య సేవా
నిత్యాస్తు జంతోర్నహి తత్రచోదనా
వ్యవస్థితి స్తేషు వివాహ యజ్ఞ
సురాగ్రహైరాసు నివృత్తిరిష్టా॥

శ్రీ భాగ. ౧౧ స్కం. ౫ అ. ౧౧. శ్లో

కర్మలు చెడ్డవియును లేవు, మంచివియును లేవు. వానియందుగల ఆసక్తియే సుఖదుఃఖములకుఁ గారణము. జీవులకు స్వాభావిక ప్రవృత్తి సాంసారిక విషయములందే యుండును. ఆ ప్రవృత్తిని సంయమపఱచుం చుటయే ధర్మము. అసంయమ మొనర్చి తనకిష్టమువచ్చినట్లు చేయుటయే అధర్మము. ఎవరకేది యుత్పత్తి స్థానమో దానియందు స్వాభావికమగు

నాసక్తి యుండును. మాజన్మ మధురామండలమందైనచో నా భూమి యందు మనకు సహజప్రేమ యుండును. కావున స్త్రీ పురుష వ్యవసాయ మందు మైథునమందు స్వాభావిక ప్రవృత్తి కల్గును. దీనిని నేర్పవలసిన పనియు నేర్చుకొనవలసిన పనియు నుండదు. ఈ శరీరము మాంసము యొక్క సారభూతమగు రజోవీర్యములచే నేర్పడినది. అందువలన మాన వులకు అన్నసారముగల స్వాదుపదార్థములందు స్వతః ప్రవృత్తి కలు గును. ఇదేవిధముగ మానవుఁడు కొన్నాళ్ళకు సంసారమును మఱచి కొంచెముగ నాత్మవిస్మృతినిఁ గోరును. యోగమొనర్చి సమాధినిఁబొంది జగత్తును మఱచుట కఠినము-కావున మానవుఁడేదో మాదకద్రవ్యమును నేదోరూపమున సేవింపఁగోరును. ఈ స్వాభావిక ప్రవృత్తులను ఆప్తవచ నముల వలనను, శాస్త్రవాక్యముల వలనను సంయమమునకుఁ దెచ్చుకొను టకే ధర్మమని పేరు. వీని నేవిధముగను నాపకయే యింద్రియములను స్వచ్ఛందముగ విషయములందు వదలుట, ఇష్టము వచ్చినట్లు విషయ ప్రవృత్తినిఁ జెందుటయు నధర్మము. పూర్వము కృతయుగములో నంద ఱకును స్వాభావిక ప్రవృత్తి ధర్మమందుండెడిది. అప్పుడు నియమమును లేదు వివాహబంధమును లేదు. నరకముగాని, రోగముగాని, యముఁడు గాని, మృత్యువుగాని లేదు. పాపము లేనప్పుడు మృత్యువేలేదు. మృత్యువులేకున్న నరకములేదు, దుఃఖమునులేదు. యమునితోఁ బని యేమున్నది? జనము స్వర్గమునకు వెళ్ళివచ్చుచుండెడివారు. దేవతల కును, మనుష్యులకును భేదము లేకుండెను. సోదర సోదర న్యాయముతో మీరు మాకడకురండు మేము మీకడకు వచ్చెదమన్నట్లుండెను. క్రమక్రమ ముగ మానవులలోఁ బాపవృద్ధి యగునప్పటికి వారిని దండించుటకు బ్రహ్మ యముఁడను నొక నూతన లోకపాలుని సృష్టించెను. యమధర్మ

రాజిట్లనెను :— "స్వామీ ! నే నెచ్చటెచ్చటని పాపుల వెంటఁదిఁగుచుం దును, నా సమీపమునకు బాపులను దెచ్చుటకు దూతల నొసంగుఁడు."
అప్పుడొక బ్రాహ్మణుఁడు తపస్సు చేయుచుండెను. బ్రహ్మ వానికి మంచి చెడ్డలుచెప్పి,వరదానాదిలోభమునొసంగి ధర్మరాజునకు మంత్రిగానొనర్చెను. ఆతనిపేరు మృత్యువు.మృత్యువిట్లనెను :–"ఇది అపయశమునకు సంబం? ధించిన విషయము. మీరు నాకు బ్రాహ్మణులను జంపు పనినిఁ బెట్టెదరేల అందఱు నన్ను దిట్టుకొనుచుందురు." అంత బ్రహ్మ రోగములను బుట్టించి యిట్లనెను :— "నీవీ రోగముద్వారా ప్రాణులను బట్టుకొని రావలెను. వీటిని నిమిత్తకారణముగఁ బెట్టుకొన్నచో నిన్నెవరును దూషించరు" పాపాత్ములను బుణ్యాత్ములను మృత్యువు యమధర్మరాజు దగ్గఱకుఁ దీసికొనిపోఁగా, పుణ్యాత్ములను సరిగా స్వర్గమునకుఁ బంపును. పాపాత్ములకొఱకని నరకములేర్పడినని. ఎన్నిపాపములుండిన నన్నినరకములు. ఇదంతయును నరకముల సంక్షిప్తచరిత్రము. ఈ యాధ్యాత్మికాఖ్యానముయొక్క గూఢరహస్యమును జ్ఞానియే యెఱుఁగగలడు-

ధర్మాధర్మములకు శాస్త్రమే ప్రమాణము. కర్తవ్యమేదో, అకర్తవ్యమేదో ఇది తర్కముచే సిద్ధించునది కాదు. పరపీడనము, అనఁగా నితరులకుఁ గ్లేశమును గలిగించుటయే పాపమగుచోఁ బరస్త్రీ గమనమందట్లు కాదు. అది మహాపాపము ధర్మమర్యాద భేదసమొనర్చువారే పాపులు.

స్వాభావిక వృత్తిని సంయమమందుంచుటకే ధర్మమందురు. వృత్తులందుఁ గర్తవ్యా కర్తవ్య జ్ఞానములేక యిష్టమువచ్చినట్లు చేయుటయు, యింద్రియముల కధీనులై స్వేచ్ఛాచారముగ వర్తించుటయు నధర్మము. స్త్రీ పురుషులకు తమ ఉత్పత్తిస్థానములందు మైధునమందు స్వాభావిక ప్రవృత్తి యుండును, ఈ ప్రవృత్తిని నిర్జించి నివృత్తిచెందిన సర్వ

శ్రేష్ఠమే; అట్లు నివృత్తినిఁ జెందకున్నచో శాస్త్రీయవిధిగా ధర్మపూర్వకముగ వివాహమొనర్చుకొనుమని ధర్మము చెప్పును. ఋతుకాలమునఁ దన భార్యయందే సంతానేచ్ఛచే గమనమొనర్చుము. ఇది ధర్మము. ఇదిగాక పరస్త్రీ గమనమధర్మము. ఇదేవిధముగా నందరను ధర్మమర్యాద బంధించును. ఈ ధర్మమర్యాద నతిక్రమించినవారు అసిపత్రమను నరకమునకుఁ బోయి నానాక్లేశములను సహింపవలసి యుండును.

శుకుఁ డిట్లనెను :— "మహారాజా ! ద్విజులు మోహావశమున సురాపాన మొనర్చినచో నాతని ముఖమున నరకమందు కఱగిన నినుమును బోయుదురు. రాజా ! ప్రపంచములో మూఁడే ఘోరపాపములు—అసత్యము పలుకుటయు, అహంకారమునకు వశీభూతుఁడై పరులకుఁ గష్టమును గలిగించుటయు, అనఁగా హింసించుటయు, పరస్త్రీగమనము. మహారాజా ! తన భార్యగాక పరస్త్రీని కుదృష్టితోఁ జూచుట మహాపాపము; కాని గురుస్త్రీగమనము చేయువాఁడు ఛండాల సదృశుఁడు. వాని ముఖమును జూచినను బాపమే. అగమ్యస్త్రీతో గమనమొనర్చిన పురుషుడును, అగమ్య పురుషునితో వ్యభిచారమొనర్చిన స్త్రీయును వీరిద్దరను యమదూతలు నరకమునకుఁ గొనిపోయి, అనేకవిధములగు బాధలను బెట్టెదరు. అచ్చట లోహముతోఁ జేయబడిన స్త్రీ పురుష విగ్రహములను బాగుగా నెఱ్ఱగా నగ్నితప్త మొనర్చి వ్యభిచార మొనర్చిన పురుషుని అట్టి తప్తలోహ స్త్రీ విగ్రహమును, వ్యభిచార మొనర్చిన స్త్రీని బాగుగా తప్త మొనర్పఁబడి పురుషలోహ విగ్రహమును దిగంబరులై ఆలింగనమొనర్చుకొమ్మందురు.

విచారించకయే సందఱతో స్వచ్ఛందముగ వ్యభిచరించు స్త్రీపురుషులను వజ్రకంటక, శాల్మలి మొదలగు నరకములకుఁ గొనిపోయి పెద్దపెద్ద ముండ్లయందు నగ్నమొనర్చి యీడ్చెదరు. వారి మర్మస్థానములలో

బాగుగాఁగాల్చిన ఇనుపముండ్లను గ్రుచ్చెదరు. "మహారాజా! గొప్పవర్ణ ములోఁబుట్టి, సదాచారియై యుండి నీచవ్యభిచార మొనర్చువారును బతిత లును, గులటలునైన స్త్రీలతోఁ బాపపూర్ణ వ్యభిచార మొనర్చినయెడుల విచారింపక పశువులవలె దురాచారమొనర్చుచో, చావఁగానే వారిని యమ దూతలు చీము, విష్ఠాకుండములలోను, మూత్ర, కఫభరిత గర్తములం దును బడవేయుదురు. అచ్చట వారు మలమూత్రములను జీమును ద్రావుచు విలపించుచుఁ దడతడ గొట్టుకొనుచుందురు. రాజా! సగోత్ర కన్యక తనకు సోదరియేకదా! ఇట్టి కన్యలతోడను, స్త్రీలతోడను సమాగమమొన ర్చిన పాపులను యమదూతలు లాలాభక్షమను నరకమందుఁబడవైచి వీర్య ముతో నింపఁబడిన కుండములలోఁ బడవైచి, వానినోట వీర్యమును బోయుదురు. దానినే తినుటకును ద్రాగుటకును నొసంగెదరు. రాజా! అధి కముగ నేమి చెప్పఁగలను? నరకమునఁ బడకుండవలయునను పురుషులు పరస్త్రీవైపునఁగు దృష్టితోఁ జూడరాదు. తమ మేలును గోరుకొను స్త్రీలు యమయాతనలు పడగూడదనుకొనిన స్త్రీలు తమ పతినిఁదప్ప మిగిలిన వారిలోఁ బెద్దవారినిఁ తమతండ్రులుగను, సమానవయస్కులను సోదరు లుగను, జిన్నవారినిఁ దమ యౌరసపుత్రులుగను జూచుకొనవలెను.

ఇదేవిధముగ రాజా! ఇతరుల వస్తువులను నడుగకయే తీసికొను టయు, దొంగతన మొనర్చుటయు నివియన్నియును ఘోరపాపములు. పర ధనములను, పరస్త్రీలను, అన్యప్రియ వస్తువులను వారినుండి బలవంత ముగ లాగుకొని పోయినవారును, దొంగిలించినవారును, దామిస్రనరకము నకుఁబోయి అసహ్య యాతనల ననుభవింపవలసియుండును. అచ్చట వారి వీఁపుపైఁ దడాతడమని కొరడాదెబ్బలు పడును. దొంగతన మొనర్చ

వారును, పరధనముల నపహరించువారును గృహదాహకులును విషమును బెట్టువారును, తేళ్ళను పాములను బడవేయువారును వజ్రకంటకమను నరకమునకుఁ బోవుదురు. అచ్చట గట్టి యెముకలుగల కుక్కలచే నిరంతరము కఱవఁబడుదురు. వారేడ్చుచుందురు. అఱచుచుందురు. కాని వారు నిరంతర మీవేదనల ననుభవింపవలసి యుండును.

ఎవరైన స్త్రీ పురుషులను మోసగించి యుపభోగించుచో వాని నంధతామిస్రమను నరకమునఁ బడవేయును. అహంకారమునకు వశీభూతుఁడై మోహవశమునఁ దన కుటుంబపోషణకొఱకు అనేకవిధములగు బాపముల నొనర్చుచో నాతఁడు మహారౌరవమను నరకమందు రురువను సర్పముల చేతను క్రూరజంతువులచేతను గాటువేయఁబడుచుండును. ఎవ్వరికి నేమియును బెట్టక, పరమార్థములేక కేవలము తన శరీరమునే బలిపించుకొని తనదేహమునే సర్వస్వముగ నెంచువాఁడు మహారౌరవనరకమునఁబడును. అచ్చట రురువను సర్పము లనేకములు అతని యంగములనన్నిటినిఁ గొఱికి తినును. శరీరము మరల నతుకుకొనును, మరలఁ గొఱుకును. ఇట్టీవ్యాపారము వేలకొలఁది సంవత్సరములు జరుగుచుండును. రాజుగాని, రాజపురుషులుగాని వారివారి ధర్మములనుబాలింపక పాపమొనర్చుచో నన్యైధోపాయములచేఁ బ్రజాద్రవ్యము నపహరించినచో నాతఁడు చచ్చి వైతరణీనదిలో మునుగుదురు. ఆ నదిలో మూత్ర, పురీష, రక్త, పూయ, కేశ, నఖ, అస్థి, మేద, మాంస, వసా, కఫ వీర్యాది ఘృణిత పదార్థములు ప్రవహించుచుండును. వాటినే వారు తినుచుందురు. దానిలోఁ బెద్ద పెద్ద మకరములు, సొరచేపలు నివసించుచుండును. అవి జీవుని మాంసమును జీల్చి తినుచుండును. ఈవిధముగ రాజా! నరకమం దసంఖ్యాకములగు యాతనలున్నవి. వీటినిగూర్చి ముందు వర్ణింపఁగలను.

# 348

శ్లో॥ దృష్టశ్రుతాభ్యాం యత్పాపం జానన్నప్యాత్మనోఽహితమ్
కరోతి భూయో వివశః ప్రాయశ్చిత్త మథో కథమ్।

శ్రీ భాగ. ౬ స్కం. ౧ అ. ౯ శ్లో.

మీరవునన్నను గాదన్నను పాపఫలము ననుభవించి తీరవలసినదే. ఇంద్రియ తృప్తికై యెన్ని యుపాయములను వెదకుదురో వాసనలంతగా వృద్ధిం బొందును. వాసనాభివృద్ధియే యంత్రసృష్టిని గావించును. వాసనాధీనులై యెవరెంత సుఖమును గోరుదురో, వానికంతటి దుఃఖము లభించును. వాసనయనునది ప్రజ్వలితాగ్నివంటిది. దీనిలో విషయరూపమగు హవిస్సును లేక ఘృతము నెంతయధికముగఁ బడవేయునో అంత వేగ మధికమగును.

శ్రీశుకుఁ డిట్లనెను :— "రాజా! ద్విజుఁడై శ్వాన, సూకర, గర్దభ, కుక్కుటాది విష్ఠాభోగులగు నశుచి జంతువులను బెంచుచో, నిత్యమెవఁడు హింసానిరతుఁడగునో అతఁడు నరకమందు యమదూతలచేఁ దీక్ష్ణబాణములచే సదా వేధింపఁబడుచుందురు. రాజసభయందు కూటసాక్ష్యమును జెప్పువారిని అవీచిమత్తను నరకమునకుఁ గొనిపోయి నూర్లకొలఁది యోజనములయెత్తుగల పర్వతముమీఁదనుండి క్రిందకుఁ బడవేయుదురు. గర్వము కలిగి మదోన్మత్తుఁడగు వానినిఁ దానే సర్వశ్రేష్ఠుఁ డనుకొనువానిని క్షారకర్దమ నరకమునకుఁ గొనిపోయి, మిక్కిలి యుప్పగానుండు నీటిలోను బురదలోను బడవేయుదురు. నిరంతరము దానినే త్రాగించెదరు. కోయఁబడిన యాతని యంగములపై నుప్పుచల్లఁబడును. మాటిమాటికి ఆనీటిలో

ముంచి యెత్తుచుందురు. మిక్కిలిగాఁ గ్రోధమునుజెంది యితరుల కుద్వే
గము గలిగించు వారలను దందశూకమను నరకములోఁ బడవేయుదురు.
అచ్చటనైనైదు, ఏడేడు ముఖములుగల సర్పములు నిరంతరము కఱచు
చుండును. రాజా! విశ్వాసము లేనివాఁడును, అకారణముగ సందేహించు
వాఁడును, ధనలోభులును, నవిశ్వాసియు, ధనమే సర్వస్వమనుకొను పాపి
చచ్చి సూచీముఖమను నరకమునఁ బడును, అచ్చట యమదూతలు
సూదితో గుడ్డలను గుట్టినట్లు వారినిఁ గుట్టుదురు."

ఇది విని శౌనకుఁడు సూతునితో నిట్లనెను :— "సూతా! ఈనరక
కథను వినుచుండిన మాకు గగుర్పొడుచుచున్నది మహాభాగా! ఇప్పుఁడిక
వీని వర్ణనమును బూర్తికావింపుఁడు పాపము లసంఖ్యాకములు. మీరు
మాకు మహాపాపములను గూర్చి చెప్పుడు. వానినుండి బయటఁ బడుటకుఁ
బ్రయత్నించెదము."

ఇదివిని సూతుఁ డిట్లనెను :— మునులారా! పాపములకు లెక్క
లేదని నేను చెప్పియేయుంటిని. అయినను మహాపాపములైదు. ౧ బ్రహ్మ
హత్య, ౨. ద్విజుఁడై మదిరాపాన మొనర్చుట, ౩. సువర్ణరత్నములను
దొంగిలించుట, ౪. గురు స్త్రీ గమనము, ౫. ఈ నల్గురతో నిరంతరము
స్నేహమొనర్చువారు. వీరైదుగురును మహాపాపులనఁబడుదురు. సాక్షా
త్తుగ బ్రాహ్మణహత్య, ప్రత్యక్షసురాపానము, సువర్ణమును దొంగిలిం
చుట, గురుపత్నీగమనము, ఇవి మహాపాపములే. కాని ఇంతేకాదు. వీనికి
సమానముగ, వీని కష్టమునకు సమకక్షమున ననేకపాపములు కలవు.
వానిలోఁ గొన్నిటిని జెప్పెదను. మీరు వీనిని ధ్యానపూర్వకముగ శ్రవణ
మొనర్పుఁడు.

బ్రాహ్మణుఁడు, వేదజ్ఞుడు, సదాచారి, జ్ఞాని, విజ్ఞాని అతఁడెట్టివాఁడైనను సరియే అతనిని హత్య యొనర్చుట మహాపాపము. పంక్తిలో భోజనమునకుఁ గూర్చుండుఁగా గొందఱకు మంచిమంచి వస్తువులను, మరి కొందఱకు చెడ్డచెడ్డ వస్తువులను వేయుచుఁ గొందఱకసలు వేయకుండుటయు, నిట్టి పంక్తి భేది బ్రహ్మహత్య నొనర్చినవానితో సమానమగు పాపియే. కేవలము కడుపునింపుకొనుటకై వంటజేసికొనువారును, బ్రాహ్మణులలో దోషమునెన్నువారును, వారిని నిందించువారును, నీచులభృత్యులై నీచాదేశమును బ్రాహ్మణులద్వారా పంపువారును, వేదములను లిఖించియు లేక వాని ఫలముల నమ్మువారును బ్రహ్మహత్య చేసినవారితో సమానులే. ముందుగా నొకానొక ఆశగల బ్రాహ్మణునిఁ బిలిచి "బ్రాహ్మణదేవా! నేనీ కార్యముకొఱ కింతటి ధనమొసంగఁగలను విశ్వసింపుడు. ఫలాని రోజున మాయింటికి రావలె"నని ఆశఁగొలిపి, అతఁడురాఁగా తానిచ్చుటకు సమర్థుఁడైయుండియు నాతనికి ధనమునీయక పైగా వాని నవమానించిన వాఁడు బ్రహ్మఘాతియే.

బ్రాహ్మణుఁడేదైన తీర్థమునకు స్నానమొనర్పబోవు చున్నను దేవతాపూజనమునకుఁ బోవుచున్నను, నీచత్వముచే విఘ్నమొనర్చు నెడలను స్వార్థవశమున నడ్డగించినను బ్రహ్మహత్యతో సమమగు పాపమే అంటుకొనును. ఆత్మస్తుతియుఁ బరనింద నొనర్చువాఁడును, అసత్యములు పలుకువాఁడును బ్రహ్మఘాతకునితో సమానమగు పాపియే.

అధర్మ కార్యము నొనర్చువాఁడును, దాని నను మోదించువాఁడును ఇతరులకు సదా ఉద్వేగమును గలిగించువాడును, ఇతరుల దోషములనే వెదుకుచు నితరులకుఁ జెప్పుచుండువాఁడును, దంభాచారియై పాషండమార్గమున నిరతుఁడైనవాఁడును, తీర్థములందును, గ్రామములందును సదా దాన

మడుగువాఁడును, దొఱకిన దానములనెల్ల గ్రహించువాడును, నిత్యము జీవులకు హింసఁగావించువాఁడును, ప్రాణులను జంపుటయే వ్యాపారముగఁ గలవాఁడును, వీరందఱును బ్రహ్మఘాతకునితో సమానమగు పాపులే. వీరిని దూరముననుండఁగనే ఒక నమస్కారమొనర్చి తొలఁగి పోవలెను. చేతనైనంతవఱకు వీరితో సంసర్గ మొనర్పరాదు.

ఇఁక సురాపాన విషయమునుగూర్చి వినుము. మదిరాపానము వివేకమునంతను భ్రష్టమొనర్చునట్టి వస్తువు. ఇంతకంటె నశుద్ధమగువస్తు వీ ప్రపంచమున నేదియునుండదు. స్త్రీ పురుషుల శరీరమందు మల, మూత్ర, కఫములు, గుబిలి, చీమిడియు. అస్థి, రక్త, మాంస, మజ్జా, లాలా, వమనములును, చొంగ, రజో, వీర్య, నఖకేశాదులు ఒకదానికంటె నింకొకటి యెట్లు ఘృణితములును నశుద్ధములగు వస్తువులో అట్లే మురికి చీఁకిన వస్తువులచే సారాయి తయారుచేయఁబడును. త్రాగఁగానే మానవుని నున్మత్తునిఁగా నొనర్చును. మదిరపానముచేఁ గామవాసన అధికమగును. లజ్జపోవును. స్త్రీ పురుషులు స్వాభావికముగ లజ్జావశమునఁ బాపప్రవృత్తులు కాకున్నచో వారిని దుష్టులు మదిరాపాన మొనరింపఁజేసి వశపఱచుకొందురు. మదిరాపాన మొనర్చుటవలన రక్తమునకు ఉష్ణత కలిగి, రజోవీర్యములు బయటఁబడుటకు స్వాభావిక ప్రవృత్తి కలుగును. ఆ మదమునఁ బురుషుఁడు కామవాసనా సాధనములను వెదకుచుండును. ఎవరు ఎదుటఁబడిన, వారితో నిర్లజ్జుడై పాపాచరణ ప్రస్తావమొనర్చును. వేశ్యలు నిరంతరము సురాపానముచేతనే పాపప్రవృత్తినిఁ జెందెదరు. వారికడకు వచ్చినవారినెల్ల సురాపానీయులుగా నొనర్తురు. మద్యపాన మొనర్చువాఁడు వేశ్యగామి కాకపోవుట ఆశ్చర్యకర విషయము. సురాపానముచేసిన ఫలము వేశ్యాగమనము, జూదమాడు వ్యసనము, ఇతరు

లను మోసగించి ధనాపహరణ మొనర్చుటగా నుండును. మదిరాపానోన్మాదమున్న మానవుఁ డకార్యములను జేయుచు, న స్తవ్య స్తముగ నుండును. దానివలన నెన్నటికినిఁ దృప్తియుండదు. కైపునిగెనా మరల ద్రాగఁ గోరిక కలుగును. అది దొఱకకున్నచో నాతఁడనేక పాపములందు ప్రవృత్తుఁడగును. కుకర్మలన్నియును జేయుచు సురాపానేచ్ఛ కలిగియేయుండును. ఇట్టి యశుద్ధ పదార్థమును ద్రావుచు న్వభాగ్యులైనవారి జీవితమును దుఃఖమయము కావించుకొనుచున్నారు. చచ్చి నరకములందు నానాయాతనల ననుభవించుదురు.

మహారాజా! ముందుగా సామాన్యముగ, వృక్షాదులనుండి తీసి ఔషధసారముగ కల్లునుదీసి త్రాగుదురు. ఒకసారి అసురులు తమ గురువగు శుక్రాచార్యునకు, అతని ప్రియశిష్యులు బృహస్పతి పుత్రుడగు కచునిఁజంపి, కాల్చి, అట్లు కాల్చిన బూడిదను గలునందుఁగలిపి అయనకుఁ ద్రావనిచ్చిరి. త్రాగిన తర్వాతఁ దనబుద్ధి భ్రష్టమైనదనియు నది యేదియో అత్యంత ఘృణితమగు నశుద్ధవస్తువనియుఁ దెలిసికొనెను. అప్పటినుండి అతఁడిట్లు నియమము నొనర్చెను. "నేఁటినుండి యేద్విజ బ్రాహ్మణుఁడు సురాపానము నొనర్చునో వానికి బ్రహ్మ హత్యతో సమానమగు పాపము లభింపఁగలదు. రాజా! మదిరాపాన మందఱకును నిషేధమే: కాని బ్రాహ్మణుఁడు దానిని స్పర్శింపనైన స్పర్శింపగూడదు. ఎవఁడట్లు స్పర్శించునో అతఁడందఱకంటె గొప్పపాతకి. ప్రత్యక్ష సురాపానముతో సమానమగు బాపములను నీకు నేను జెప్పెదను, దత్తచిత్తుఁడవై వినుము.

వేశ్యలయింట భోజనమొనర్చుటయు, వేశ్యాసంసర్గమును నివి సురాపానమునకు సమానములు. కావునఁ బొరపాటుననైన వేశ్యాసంసర్గ

మొనర్పరాదు. పతితుఁడు, పాపవృత్తి నొనర్చువాఁడు, చోరుఁడు,జూదరి. సురాపాన మొనర్చువాఁడు, జీవహింసకుఁడు వీరియిండ్లయందు వీరితోఁ గూడి భోజనముచేయువాఁడు సురాపాన మొనర్చిన పాపమే లభించును. ఆరంభించిన యుపాసనమును మోహవశమున వదలుటయును, మూర్తి పూజ యొనర్చుచు స్త్రీతో సంసర్గమొనర్చువాడును, నీచులతోఁ బిలువగానే పోయి భోజనమొనర్చుట మొదలగు పాపములు సురాపానముచేసిన పాప ముతో సమానమైనవి.

తృణమును దొంగిలించుటయైనను జెడ్డదే, పాపమే. వస్తువు యొక్క మహత్వముచేఁ జోరీపాపము పెద్దదగును. వ్యాపార మొన ర్చుట వేశ్యావృత్తి వంటిదే, కాని సువర్ణకారు (కంసాలి)ని నింతగా నింద శాస్త్రము లేలచేసినవనఁగా సువర్ణకారుడు బంగారమును దొంగిలింపక మానడు. సువర్ణమును హరించుట మహాపాపము కావున నాతని సంసర్గము వర్జితము.

అంత శౌనకుఁ డిట్లనెను :— "సూతా ! అతఁడు దొంగిలింప కున్న సంసర్గము దోషము లేదా ?"

సూతుఁ డిట్లనెను :— "స్వామీ ! దోషమేమియును లేదుగాని అట్లుండదు. కోటికొకఁడిట్టివా డుండును. తాను జేయకపోయినప్పటికిని, సువర్ణమును దొంగిలించినవారితో మజ్జనపానాదు లొనర్చినను బాపము కలుగును. వ్యాపారి తికమకచేయక, సత్యాసత్యములు పలుకక యెవడో యొకడుండును, అట్లే యెవ్వడో ఒకడుతప్ప సువర్ణము దొంగిలింపని స్వర్ణకారుడుండడు. ఈ విషయమున నొక మనోరంజకమగు ఉపాఖ్యా నమును వినుడు."

ఒకరాజుండెను. అతనికి సువర్ణవస్తువులు, పాత్రలు, ఆభూషణములు చేయింపవలయునను వ్యసనముండెడిది. స్వర్ణకారుల ననేకులను దూరదూరములనుండి పిలిచియుంచెను. ఒక దినమున నాతడందఱను బిలిచి నవ్వుచు నిట్లడిగెను :— "ఓయీ! మీరు సత్యము చెప్పవలయును. రూపాయి కెన్నియణాలు హరించెదరు?" ఒకఁడిట్లనెను :— "మహారాజా! మేము హరింపము. ఇంకొకడు రూపాయికి ఒకయణాయనియు, ఇంకొకడు రెండణాలనియు, మఱియొకడు నాల్గణాలనియు జెప్పిరి. ఒకడిట్లనెను :— "మహారాజా! నేను రూపాయిలో పదునైదణాల ముక్కాలిని దొంగిలించెదను."

రాజాశ్చర్యమునకు మేఱలేకుండెను. అతడు మిక్కిలి విస్మయముతో నిట్లనెను :— "కన్నులయెదుట దొంగిలింపఁగలవా?"

అతడు నవ్వుచు నిట్లనెను :— "మహారాజా! అట్లుకాకున్నఁ గళయేమున్నది? చూడనప్పుడింటికి గన్నమువైచి పిఱికిపందలై దొంగలు దొంగిలించెదరు. మాది దొంగతనము కాదు. ఇది కళ."

రాజిట్లనెను :— "మంచిది. మీకు పరీక్ష. అయిదుశేర్ల సువర్ణముతో నిచ్చట నా యెదుట గూర్చుండి ఒక విగ్రహమును దయారుచేయవలెను. రూపాయిలో బదునైదణాలు ముక్కాలి నెట్లు దొంగిలించెదవో చూతము."

స్వర్ణకారు డిట్లనెను :— "మంచిది మహారాజా! తమ యాజ్ఞప్రకారమే నేను దర్బారుముందే తయారుచేసెదను." మహారాజునకు అతని సాహసమున కాశ్చర్యము కలిగెను. అతడందఱలో విశ్వాసపాత్రుడగు వృద్ధమంత్రిని గూర్చుండబెట్టెను. విశ్వాసపాత్రులగు పూర్వపు సిపాయీలను నల్వురను గూర్చుండబెట్టెను. రాజిట్లాజ్ఞాపించెను. "ఇతడు వచ్చి

నపుడు గుడ్డలువిప్పి పరీక్షచేయుడు. సదా యీతనిచేతులవైపే చూచుచుండుము. ప్రతిది కడకు దీసికొనిరండు. ఈతని వస్తువులనన్నిటిని నాకు జూపించి పెట్టెలో బెట్టుడు. బీగమును నావద్దనుంచుడు."

వృద్ధమంత్రి రాజాజ్ఞను చాలజాగ్రత్తగ బరిపాలించెను. అందఱుకును మిక్కిలి కుతూహలముండుటచే నంధఋను శ్రద్ధగా జూచుచుండిరి. అతడు పగలంతయును బనిచేయును. సాయంకాలమునకు రాజు స్వయముగావచ్చి తనయెదట దిగంబరినిజేసి పరీక్షచేయించి సువర్ణమును దూచి. తాళమువైచి, బీగమును దనదగ్గఱ నుంచుకొనుచుండెను. స్వర్ణకారుడు వెళ్ళిపోవును. పగలంతయును నాతడిచ్చట పనిచేసి, రాత్రియందు సరిగా నదేవిధముగ నిత్తడివిగ్రహమును నదేకొలతితోడను బరువుతోడను దనయింట దయారుచేయుచుండెను.

కొంతకాలమునకు రెండు విగ్రహములును దయారయ్యెను. రాజు మిక్కిలి యానందించి, నాదగ్గఱ వీరియాటలు సాగవు. విగ్రహము తయారుకాగానే దానిపైన బసుపు సిందూరమునుబూసి యిట్లనెను :— "నాకు పదిశేర్లు పుల్లనిపెరుగు కావలెను. దానిలో నీ విగ్రహమును ముంచవలెను. దీనివలన మలినముపోవును, మెఱుపువచ్చును. రేపటికి పూర్తికాగలదు." మంత్రి పెరుగును దెప్పించెను. స్వర్ణకారుడు స్వయముగ రుచినిజూచి, అందఱకును రుచినిజూపించి యిట్లనెను :— "ఇదేమంత పుల్లగాలేదు. ఇంకను బులుపుగానుండవలెను'' దైవయోగముచే నొక గొల్లది ఒక పెద్దపాత్రలో బదిపండ్రెండుశేర్లు పెరుగు తీసికొని వచ్చెను. ఆ గొల్లది యెవరోకాదు. ఆ స్వర్ణకారుని అమాయకపుకూతురే. ఆ పాత్రలో దనయింటిలో నిత్తడితోఁ జేయబడి దానిపై బంగారుపూఁత వేసిన విగ్రహముండెను. అమెరాగానే సిగ్గుతో నమాయకపు స్వభావ

ముతో నిట్లనెను :— "పెరుగు తీసికొందురా ? అయితే కొంచెముపుల్లగా నున్నది." రాజసేవకులు వినోదప్రియులుగ నుందురు. వారిట్లనిరి :— "పులుపు ఇచ్చటెందులకు ? ఇచ్చట మధురవస్తువులు కావలయును." ఈ విషయము మంత్రిచెవిలోబడెను. అతడా గొల్లదానిని బిలిపించి స్వర్ణకారునితో నిట్లనెను :— "ఈమె పెరుగును జూడుము." స్వర్ణకారుడు రుచిచూచెను. చాల ఆనందము కలిగి, ఇట్లనెను :— "బాగున్నది. ఇట్టి పెరుగు కావలెను; మీరుగూడ రుచిచూడుడు." మొదటివాడు రుచిచూచి చప్పరించి ముఖము చిట్లించుకొని యిట్లనెను :— "అతిపులుపు" చిన్నదిట్లే మెదలక నిలుచుండెను. స్వర్ణకారుడు తన స్వర్ణవిగ్రహమును దానిలోఁ బడవైచెను. పసుపు, సిందూరము, భస్మము, మృత్తిక ఇంకేమేమివేసినాఁడోకాని విగ్రహము పడవేయఁగానే పెరుగురంగు మారిపోయెను. ఎఱ్ఱ నెఱ్ఱగనయ్యెను. చాలసేపటివఱకు విగ్రహమును దోమసాగెను. ఆపిల్ల మెదలకుండనిలిచియుండెను. అంత స్వర్ణకారుడు మంత్రితో నిట్లనెను :— "మహారాజా ! ఈమెకు డబ్బిచ్చి పంపుడు.

ఆ పిల్ల వినయముతో నిట్లనెను :— "నా పాత్రకూడ నాకు కావలెను. మాయమ్మ నన్నుఁగొట్టును గట్టిపాత్ర."

కొంచెము సేపట్లే రుద్దిరుద్ది స్వర్ణకారుడు బంగారునీరు పోయుటచే మెఱయుచున్న విగ్రహమునుదీసి, సువర్ణవిగ్రహమును దానిలోనే విడిచి యా పిల్లతో నిట్లనెను :— "తీసికొనిపొమ్ము. ఈ పెరుగు నా గుంటలోఁ బారవోయుము."

ఆమె వినయముతో నిట్లనెను :— "గుంటలో నేలపోయుదును, ఆజ్ఞయగుచో నేను మా గేదెకుఁ దీసికొనిపొయెదగా."

మంత్రి శీఘ్రముగ నిట్లనెను :— "సరిసరి. తీసికొనిపొమ్ము తీసికొనిపొమ్ము, పదపద. ఇదిగో నీడబ్బు తీసికో." పైకము తీసికొని, పెరుగుకుండ నెత్తుకొని కపటపు గొల్లపడుచు వెళ్ళిపోయెను. అందఱును విగ్రహమునుగూర్చి మిక్కిలిగఁ బ్రశంసించుచుండిరి. చూడుఁడు పెరుగులో వేయఁగానే యెట్లు మెఱయుచున్నదో స్వర్ణకారుఁడు దానిని బాగుగాఁ దోమినాడు వస్త్రముతోఁ జాలసార్లుతుడిచి యిట్లనెను :— "మహారాజును బిలువుడు. విగ్రహము తయారైనది."

మహారాజు చాల ఉల్లాసముతో వచ్చెను. విగ్రహమునుజూచి చాల యానందించి, నవ్వి యిట్లనెను :— "స్వర్ణకారా ! దీనిలో నెంత దొంగిలించితివో చెప్పుము.

మిక్కిలి నమ్రతతో, సరళముగ స్వర్ణకారుఁ డిట్లనెను :— "శ్రీవారికి జయమగుగాక ! అపరాధమును క్షమింపుడు. రూపాయిలో బదునైదణాల ముక్కాని దొంగిలింపఁబడినది. యెక్కువలేదు."

ఇది వినఁగా మహారాజాశ్చర్య నిమగ్నుఁడయ్యెను. అతడు మంత్రి వైపు చూడసాగెను. మంత్రి, భటులు, అందఱును విస్మయావిష్టులైరి. స్వర్ణకారుఁ డిట్లనెను :— "దేవా ! అన్య స్వర్ణకారులను బిలిచి పరీక్షింపవచ్చును."

రాజు గొప్పగొప్ప స్వర్ణకారులను బిలిచి, మూర్తి పరీక్షను జేయించెను. అందఱిట్లనిరి ;— "మహారాజా ! పైనమెఱయుచున్నది బంగారపు నీరు. మిగిలినదంతయును శుద్ధమైన యిత్తడితోఁ జేయఁబడినది."

రాజు మిక్కిలి ప్రసన్నుఁడై యిట్లనెను :— "మంచిదయ్యా నీ దొంగతనము నిజముగఁ గళయే."

కావున మునులారా! దొంగతనమును ప్రత్యక్షముగఁ జేయనిండు, కళతోఁ జేయనిండు దొంగతనమే. గన్నము వేయుటలోఁగూడ కళ యున్నది. అందఱయెదుట ద్రవ్యాభూషణములను దీసికొనిపోవుట చాల సాహసకార్యము; కాని యిది నరకద్వారము. ప్రత్యక్ష స్వర్ణచోరులుగాక, చాలమంది స్వర్ణచోరత్వమువంటి పాపములున్నవి. వినుఁడు."

కంద, మూల, ఫలములను దొంగిలించుటయు, కస్తూరి, వస్త్రములు, రత్నములు, వీనిని దొంగిలించుట, బంగారు దొంగిలించుటవంటిదే. ఇత్తడి లోహము, కంచు, ఘృతము తేనె, సుగంధ పదార్థములు, చందన, రసాదులను దొంగిలించుటయును సువర్ణస్తేయ సదృశ్యపాతకమే. ద్విజుఁడై శ్రాద్ధతర్పణ త్యాగము, సాధు సన్న్యాసినింద, భోజనపదార్థములను, అన్న, ధన, రుద్రాక్షాదులను దొంగిలించుటయును స్వర్ణస్తేయ మహాపాతకముతో సమానమైనదే."

సాక్షాద్గురు గురుస్త్రీగమనమును మహాపాతకమే. అన్నమొసంగువాఁడు, జనకుఁడు, ఉపాధ్యాయుఁడు వీరందఱును గురువులే. వీరిభార్యల వైపు కుదృష్టితోఁ జూచుటయును మహాపాపమే. సోదరి, కూఁతురు, కోడళ్లు, సగోత్రస్త్రీ, కన్యక, విధవ, రజస్వల, వదినె, స్నేహితునిభార్య, తనపై విశ్వాసముంచినవాని భార్య, హీనజాతిస్త్రీ, సారాయి త్రాగునది యెట్టి పరపురుషస్త్రీ యైననుసరియే వీరందఱితో సంసర్గ మొనర్చుట గురుపత్నీ సంసర్గముతో సమానమైనవే. వీరును ఘోరనరకము పాలగుదురు.

ఈ నల్గురతో స్నేహము చేయువారును, సంసర్గమొనర్చువారును పాతకులే. కావున నిట్టి ధర్మహీనుఁడును నాచారవిహీనుఁడునగు పాపితో చేతనైనంతవఱకు సదా దూరముగ నుండవలెను. సంసర్గముచే గుణదోషములవశ్యము వచ్చును. ఇందుకు సందేహింపవలసిన పనిలేదు. ఒక్క

సారికాదు, లక్షసార్లు, కోటిసార్లు ఇది అనుభవవిషయము. గుణముల కంటె దుర్గుణముల ప్రభావము శీఘ్రముగఁబడును.

ఇది విని శౌనకుఁ డిట్లనెను :— "సూతా! అట్లైనచో మానవుఁడే సంసర్గమునుండియుఁ దప్పించుకొనఁజాలడు."

సూతుఁ డిట్లనెను :— "లేదు, స్వామి! ఇట్లు ప్రపంచములో గుణదోషములుండును, సదా ఉండఁగలవు. సంసర్గదోషము విశేషముగఁ బంక్తిభోజనము వలనను, ఒక పక్కపైఁ బరుండుటచేతను, ఒక్కవాహనముపై నానుకొని కూర్చుండుటచేతను, వివాహసంబంధమువలనను అంటుకొనును. సాధ్యమైనంతవఱకు మహాపాతకులతో నిట్టి సంబంధమును దెలిసి తెలిసి పెట్టుకొనరాదు."

అంత శౌనకుఁ డిట్లడిగెను:— "మహాభాగా! సూతా! నరకములో గష్టమనుభవింపవలసినవారు ఇదివఱకు మీరు చెప్పినవారేనా? ఇంకెవరైనను గలరా?"

సూతుఁ డిట్లడిగెను :— "స్వామీ! నేను మాటి మాటికినిఁ జెప్పుచునేయున్నాను. నరకముల కష్టములకును, అచ్చటియాతనలకును మితము లేదు. నరకములో ననేకప్రకారములుగ యాతనలు పెట్టుచుందురు. మలమూత్ర కుండములలోఁబడి వానినే తినుటయుఁ ద్రాగుటయును, దానిలో బడి యుండుటయు, బాగుగాఁగాలిన శిలలపై నిద్రించుటయు, తుమ్మముండ్లలో నీడ్చుటయు, రక్తకూపములో ముంచుటయు, నిరంతరము రక్తపానమును జేయించుటయును, స్వాంగమాంసమునేకోసి తినిపించుటయు, మండుటగ్నిజ్వాలలలోఁ బడవేయుటయు, అగ్నిపైఁ దలక్రిందుగ వ్రేలాడఁగట్టుటయు, క్రిందఁగూర్చుండఁబెట్టి పైన నిరంతరము ఱాళ్ళవానను గుఱిపించుటయును, కీటకములనే భోజనము పెట్టుట, ఉప్పునీటిలో

బరుండఁబెట్టుట, ఉప్పునీటినే త్రాగించుటయు, దేహమును ముక్కలు ముక్కలుగఁగోసి ఉప్పునద్దుటయు, కత్తితో శరీరమును ముక్కలుముక్కనుగఁ గోయుటయు మరల నతుకుటయు, శరీరమంతటను మలమును బూయుటయు, మలమును దినిపించుటయును, వీర్యముతో నింపఁబడిన కుండములోఁ బడవేయుటయును, వీర్యమునే పానముచేయించుటయు నరనరములందు సూదులు గ్రుచ్చుటయు, బాశములఁ గట్టుటయు. పొగలో గూర్చుండఁబెట్టి ధూమ్రపానము చేయించుటయు పిత్త, వమన శ్లేష్మ, కఫములను, జొంగను దినిపించుటయు, పెద్దపెద్ద వృక్షములనుండియుఁ, బర్వతములనుండియు దొర్లించుటయు, నీటిలోముంచి పైన రాళ్ళనెత్తుటయుఁ, గంటకముల మీఁదఁ బరుండఁబెట్టుటయు, సర్ప, వృశ్చిక, విష కీటక, మధుమక్షికాదులచేఁ గరపించుటయు, సింహ, వ్యాఘ్ర, మహిష, ఋక్షాదులచేఁ జంపించుటయును, గఱపించుటయును, అత్యంత దుర్గంధముగనుండు బురదలోఁ బరుండబెట్టుటయును, అత్యంతముచేదుగానుండు వస్తువులను దనకిష్టములేకున్నను బలవంతముగ నోటినిఁ దెఱచి త్రాగించుటయును, వేడివేడి కరిగిన ఇనుమును నోటియందును, గుప్తస్థానములయందుఁ బోయుటయు, వేడివేడి తైలమును ద్రాగించుటయు, వేడియిసుకపైఁ బరుండఁబెట్టుటయు, అతిచలిరాత్రియందు మంచునీరును జల్లుటయును, మిక్కిలి యెండకాలమందు మిక్కిలి యుష్ణజలమున స్నానము చేయించుటయును, మెల్లమెల్లగా దంతములనూడఁ బెరుకుటయును, నాలుకను ముక్కలు ముక్కలు చేయుటయును, బాగుగాఁ దప్తమొనర్పఁబడిన స్త్రీ పురుష విగ్రహములను బలవంతముగ నాలింగనమొనరింపఁ జేయుటయును, రెండు వేడి శిలలమధ్య వత్తుటయు మొదలగు అనేక కష్టములున్నవి. స్వామీ! ఎన్నని లెక్కఁబెట్టఁగలము? ఇచ్చట నీలోకమందు మనమా కష్టములను నూహింపనైన నూహింపఁజాలము

చచ్చినమీఁదట పాపులానరకములకుఁ బోయినపుడు మాత్రమే అనుభవింప గలరు. పరీక్షిన్మహారాజుడుగఁగా మా గురుదేవుఁడగు శుకమహర్షి అత్యంత సంక్షేపముగ నగణిత నరకములను గూర్చియు అగణిత యాతనలను గూర్చియు దిగ్దర్శన మొనరించెను. వీనివలన బుద్ధిమంతులగువారు మిగిలిన వాటినిగూర్చి యూహించుకొనవచ్చును.

శుకమహర్షి పరీక్షిన్మహారాజుతో నిట్లనెను :— "రాజా ! పురాణములలో నీ నరకములను గూర్చి విస్తారముగ వర్ణింపఁబడినది. ఇప్పుడు నరకములను గూర్చియే వర్ణించునెడల "భాగవతకథ" నారకీయకథ కాఁగలదు. ప్రసంగానుసారముగ నేను నీకు పాపులనుగూర్చియు, నరకములను గూర్చియు దిగ్దర్శనము కావించితిని. కాకున్న నారకులను దలఁచుటయును బాపమే. పాపమున నరకమును, బుణ్యమున స్వర్గమును లభించును. పాపమునకు ప్రాయశ్చిత్తము చేసికొనకున్నచో నట్టివాఁడవశ్యము నరకములలోఁ బడవలసి వచ్చును. అతని నాఁపగల వాఁడెవఁడును లేడు. పొరపాటునఁ బాపము సంభవించుచో వెంటనే ప్రాయశ్చిత్త మొనర్చుకొనవలెను. నేను నీకు నరకవిషయమునుగూర్చి చెప్పితిని. ఇప్పుడు నీవింకేమి వినఁగోరుచున్నావు ?

## నరకమును దప్పించుకొనుటెట్లు

# 349

శ్లో. అదునేహ మహాభాగ ! యథైవ నరకాన్నరః
నానోగ్రయాతనాన్నేయాత్తన్మే వ్యాఖ్యాతు మర్హసి॥

శ్రీ భాగ. ౬ స్కం. ౧ అ. ౬ శ్లో.

భవిష్యచింత లేనివాఁడు జడుఁడైనను గావలెను. జీవన్ముక్తుఁడైనను గావలెను. కాకున్న నందఱ హృదయములలో ముందేమి జరుగగలదను చింత కలుగును. సాధు మహాత్ములకును, జ్యోతిషులకును మా అదృష్ట మెట్లున్నదని అందఱును జేతులను జూపించుచుందురు. పుణ్యము చేయకున్నను పుణ్యఫలమగు సుఖమును బ్రతివారును గోరుచుందురు; పాపముచేయుచు బాపపరిణామమగు దుఃఖము నెవరును గాంక్షింపరు. ఇది ప్రాణుల స్వాభావిక ప్రవృత్తి కావున నందఱును సుఖమునుబొందుటకును దుఃఖమునుదప్పించుకొనుటకును నుపాయమును జూచుకొనుచుందురు. పరలోకమును లేదనువారును ఈలోకమున దుఃఖము సంభవించినపుడు దానినిఁ దప్పించుకొనుటకు సమస్త ప్రయత్నమును జేయుచుందురు. ఒకానొక ప్రతిష్ఠిత మానవునకు నొకానొక ప్రామాణిక వ్యక్తి, పోలీసులు నీపై సందేహించి ఒకానొక అభియోగమును దెచ్చుటకుఁ బ్రయత్నించుచున్నారని చెప్పుచో ధనము నొసంగి, అనునయ వినయములతోడను అనేక యితరోపాయముల చేతను అభియోగము జరుగకుండను, ఒకవేళ నడిచిన దాననాతని కేవిధమగు శిక్ష పడకుండునట్లును, దానినుండి తప్పించుకొనవలెననియు బ్రయత్నించును. ఈలోకమున నెవఁడైన నపరాధము నొనర్చి తప్పిలచుకొనఁగల దేమోగాని పరలోకమున్నదన్నను లేదన్నను అలోకములో నపరాధమొనర్చి ప్రాయశ్చిత్త మొనర్చుకొనక దండింపఁబడక తప్పఁడు. మేము పరలోకము నంగీంరింపమనిన నేమియును లాభము లేదు. మనకాకాశము కనఁబడుటలేదు కాఁబట్టి అకాశమును మేమంగీకరింపమనిన నాకాశము లేకపోదు. అంగీకరించినను అంగీకరింపకున్నను ఆకాశమాధారములేక యెచ్చటికినిఁ బోఁజాలము. మనముండునది ఆకాశఛత్ర

ఛాయక్రిందనే. నీవు నోట పరలోకము లేదనుచు నిన్ను నీవు మోసము చేసికొన్నను యముఁడు నీ మోసములోఁ బడువాడుకాఁడు. అతఁడవశ్యము పాపఫలము నొసంగి తలను బ్రద్దలుచేసి తీరును. తప్పక దెబ్బలు పడఁగలవు. సందేహములేక పడఁగలవు. మేము పరలోకము నంగీకరింప లేదు. కావున మాకు ఫలము లుండఁగూడదనిన యమధర్మరాజు మీ మాటను వినిపించుకొనఁడు. కంటకాకీర్ణభూమిపై నీవు కన్నులను మూసికొని నాకుఁ గనఁబడుటలేదని అడుగును వేసినచోఁ గాళ్ళలో ముళ్ళు లవశ్యము గ్రుచ్చుకొనఁగలవు. కావున పాపమొనర్చి దానికిఁ బ్రాయశ్చిత్తము చేసికొనకుండినచోఁ బాపఫల మవశ్యమనుభవింపవలసినదే.

పాపములవృత్తాంతమును వినఁగానే పరీక్షిన్మహారాజు హృదయము దడదడ కొట్టుకొనసాగెను. అతఁడు మిక్కిలి భయపడుటచే నాతని శరీరమంతయును గగుర్పొడిచెను. అతఁ డత్యంత దీనుఁడై శుకమహర్షితో నిట్లనెను :— "ప్రభూ ! ఇంతవఱకు మీరు మంచి మంచి కథలను జెప్పితిరి. మొట్టమొదట మీరు నివృత్తి ప్రవృత్తి మార్గమునుగూర్చి అనుపమానమగు భావపూర్ణవర్ణనమును గావించితిరి. నివృత్తి మార్గమం దెట్లు సద్యోముక్తి కలుగునదియు, నెట్లు క్రమముక్తిద్వారా బ్రహ్మలోకమునకుఁబోయి, అచ్చట బ్రహ్మతో సాధకునకు మోక్షమెట్లు ప్రాప్తించునదియు నీ రెంటిని గూర్చియు మీరు గొప్ప విద్వత్పూర్ణమగు వర్ణనమును గావించితిరి. ఇదేవిధముగఁ బ్రవృత్తి సంబంధమున బంధింపఁబడినవారికి యజ్ఞయాగాదిక సకామకర్మ లొనర్చుటచే నేవిధముగ గుణమయమగు స్వర్గాది లోకములు ప్రాప్తించునదియు, పుణ్యము క్షీణింపఁగా మరల నేవిధముగ నీలోకమునకువచ్చి పుట్టునదియు, చచ్చి మరల నెట్లు పుట్టునదియు, నెనుబదినాలుగులక్షల జీవరాసులలో నెట్లు జన్మించునదియును,

ఇట్టి ప్రవృత్తి మార్గమునుగూడ మీరు వర్ణించితిరి. స్వాయంభువమను వంశమునగూడ గొప్ప విద్వత్తుతో విశద వర్ణనమును గావించితిరి. మంచి రసవత్తమమైనట్టియు, శృంగార రసభరితమును, శిక్షాప్రద మును, సదాచార పూర్ణమును, అభ్యున్నతిపథమునకుఁ గొనిపోవునది యును, భగవద్భక్తిని సంపుటీత మొనర్చి యనేక కథలను వినిపించితిరి. మంచి యుపాఖ్యానములను, రాజర్షి చరిత్రములను జెప్పితిరి. ద్వీపవర్ష, గ్రహ, నక్షత్ర, ఊర్ధ్వ, అధోలోకములను గూర్చియు సంక్షేపముగను, నొక్కొ-డ విస్తారముగను వర్ణించితిరి. ఈ కథలన్నియును నాకు చాల బాగుగా నచ్చినవి. కాని స్వామీ ! మీరు నరకవర్ణనమును గావించి పేదను బెల్లమును నేకము గావించితిరి. చాల తికమకయైనది. నాచిత్తము బాగుగా వ్యాకులమూ చెందినది. సంసారములో నుండి బొత్తుగాఁ బాపము లొనర్పని వాఁడెవఁడుండఁగలడు ? నీటిలో మునిఁగిన తర్వాతఁ దడువకుండ నుండఁ గలవాఁడెవఁడు? మరి గదిలోనికిఁబోయి యేచతురుడు మసి అంటకుండఁ దప్పించుకొనఁగలడు ? కావున నో ప్రభూ ! మేము ప్రతిక్షణమును బాప మును జేయుచునే యుందుము. జ్ఞానులును, భగవద్భక్తులునుగాక పాప ములనుండి బయటఁబడినవాని నొక్క-నిఁ జూపించుడు. ఒక్క-డైనబయటఁ బడకున్నచో నందఱును నరకమునకుఁ బోవలసినదేనా ? నారకీయ యాత నలను దప్పించుకొనుటకు ఉపాయము లేదా ? ఉన్నచో ముందుగా దానివి గూర్చియే నాకు చెప్పి తర్వాత కథను జెప్పుడు. ఈ నరకవిషయములను వినుటచే నాచిత్తము మిక్కి-లి క్షోభించుచున్నది.

ఇది విని అత్యంత గంభీరుఁడై శుకుఁడిట్లనెను :— "రాజా ! చేసినకర్మ యెన్నటికిని నిష్ఫలముకాదు. కేవలము భగవన్నిమిత్తముగఁ జేసిన కర్మము భగవద్భక్తిని ఉత్పన్నము కావించును- ప్రభు పాదపద్మ ములందు ప్రీతినే వృద్ధికావించును. సాంసారిముగఁ జేసిన కర్మ సంసా

రమునే సృజించును. జగద్బంధనమును గట్టిగా బిగించును. అవాగమ్య చక్రమును దృఢము గావించును. పాపమొనర్చి ప్రాయశ్చిత్తము చేసికొనకుండినచో నాతఁడు చచ్చి నరకయాతనల ననుభవింపవలసి వచ్చును. కావున చిన్నది గానిండు పెద్దది కానిండు, తెలిసికానిండు తెలియకాకనిండు చేసినపాపము ననుసరించి శాస్త్రీయ విధిచేఁ బ్రాయశ్చిత్త మవశ్యము చేసికొనవలయును. గొడ్డలిచేఁ బెద్దపెద్ద చెట్లు తెగిపడిపోయినట్లు ప్రాయశ్చిత్తమునఁ బాపము లన్నియును తెగిపోవును.

కావున మనోవాక్కాయములచేఁ జేయఁబడిన పాపము ననుసరించి మానవుడు ప్రాయశ్చిత్తము నవశ్యము చేసికొనవలయును. ప్రాయశ్చిత్తము చేసికొనిన తర్వాత దానిని భోగించుటకు మరల నరకమునకుఁ బోవలసిన పనియుండదు. ఎట్లనఁగా-ఒకానొకఁ డొకనివద్ద వేయిరూపాయలను ఋణము తీసికొనెను. వడ్డీ చాల పెరిగెను. అప్పుడాతఁ డీయకున్న నప్పిచ్చినవాడు న్యాయాలయమునకుఁబోయి వ్యాజ్యము వేయును. అప్పుడాతని కచ్చట శిక్ష సంభవించును. ఇంటిలోని వస్తువులన్నియు వేలము వేయఁబడును. నానాక్లేశములు పడవలసి వచ్చును. అభియోగారంభమునకుఁ బూర్వమే పదిమంది పెద్దమనుష్యులను దీసికొనివచ్చి అప్పిచ్చిన వానికడకుఁ బోయి, అనునయ వినయములచేఁ బ్రార్థించి, కొంచెము తగ్గించి యిచ్చిమే సరిచేసికొన వచ్చును. ఇంత అడావిడి పడవలసిన పనియును లేదు. చింతయుండెడిదికాదు. దండాదులుండవు, ఏదో విధముగఁ బ్రాయశ్చిత్త మొనర్చుకొని వివాదమును శాంతింపఁ జేసికొన్నచో, వానికి యమదర్బారునం దభియుక్తుఁడై యుండవలసిన బనియుండదు."

రాజిట్లడిగెను :— "స్వామీ! ఇది పెద్ద పాపమనియు, నిది చిన్నపాప మనియు నెట్లు తెలియఁగలదు. దేనికి పెద్ద ప్రాయశ్చిత్తమో,

దేనికి చిన్న ప్రాయశ్చిత్తమో యెట్లు తెలియఁగలదు? పాపముచేయువాఁడన్నిపాపములను జిన్నవిగనే భావించును."

శుకుఁ డిట్లనెను :— "చేయువాని భావనవలన జరుగదు. మన శరీరమునకు రోగము వచ్చినపుడు "ఇదేమి రోగములే, ఏదో కొంచెము చలివచ్చినది, శ్లేష్మము పెరిగిన"దనిన రోగము తగ్గదు. అది పెరిగిపెరిగి రాజయుక్ష్మ (క్షయ) వఱకు తీసికొనిపోవును. కావున రోగము రాఁగానే వైద్యునకుఁ జూపింపవలయును. అతఁడా రోగముయొక్క గురు లఘుత్వములను బరీక్షించి, అవలేహ్యామునో, భస్మమునో, రసాయనమునో, పటికనో, చూర్ణమునో నిర్ణయించి యిచ్చును. అతఁడేది నిర్ణయించిన నా యౌషధమును శ్రద్ధతోఁ బధ్యపూర్వకముగ సేవించుటచే రోగము పోవును. అదేవిధముగఁ బాపము సంభవింపఁగానే స్మృతిశాస్త్రజ్ఞులగు పండితులకడకుఁ బోయి దాఁచక తమ పాపముల నన్నిటినిఁ జెప్పవలయును. దానిలో మోసము కపటము, దాపరికము పనికిరాదు. పాపమును విని రాజును దండింపఁగలడు. అదియును బ్రాయశ్చిత్తమే. శాస్త్రములలోఁ జెప్పఁబడిన వ్రతోప వాసాదులద్వారా కూడ పాపములు పోఁగలవు. చేతఁ బాశమును దండమును ధరించి యముని ఆజ్ఞను బుచ్చుకొని దూతలు రాక పూర్వమే పాపప్రాయశ్చిత్తము చేసికొనవలయును. వారువచ్చి పట్టుకొని పోయిరా, నియమానుసారముగ నభియోగము సాగవలసినదే. ఇంకేమియు నాశయుండదు. యముఁడేమియును తిథినిఁ జూడడు. అతనిదూత లెప్పుడు రాఁగలరో యెవ్వరికిని దెలియదు. ఆ దుష్టులకు శీల సంకోచము లేవియు నుండవు. వారంతటి నిర్దయులు. అనునయ వినయములు, ఏడ్పులు, బొబ్బలు, చేతులు జోడించుట, పాదములమీఁద బడుట, మూల్గుట, ఇవే

మియును బనిచేయవు. కావున రాజా! పాపము చేయుట సంభవించెనా వెంటనే ప్రాయశ్చిత్త మొనర్చుకొన వలయును.

సూతుఁ డిట్లనెను :— "మునులారా! మా గురుదేవుని ముఖమున బాప ప్రాయశ్చిత్త వృత్తాంతమును విని పరీక్షిన్మహారాజు కొంచెముగఁ జింతించెను. ఆతఁడు పాపమునుం గూర్చియు, వాని మూలకారణమును గూర్చియుఁ బ్రశ్నించుటకై గంభీరముగ నాలోచించుచున్నట్లు తోఁచు చుండెను."

## పాపములకు ప్రాయశ్చిత్తమేమి?

## 350

శ్లో. కర్మణా కర్మనిర్హారో నహ్యాత్యంతిక ఇష్యతే।
అవిద్వ దధికారిత్వా త్ప్రాయశ్చిత్తం విమర్శనమ్॥

శ్రీ భాగ. ౬ స్కం. ౧ అ. ౧౧ శ్లో.

ఏవిధముగనైనను మాతృగమనము, గురు పత్నీ గమనము, భగినీ (చెల్లెలు) గమనము, దుహితా (కూతురు)గమనము, పుత్రవధూ(కోడలు) గమనము నొనర్చినచో, దానికి అగ్నిప్రవేశము తప్ప వేఱు ప్రాయశ్చిత్తమును శాస్త్రకారులు చెప్పలేదు." ఈవిధముగ ననేక ప్రాయశ్చిత్తములను గురించి చెప్పఁబడినది. పాపులు ఆయా పాపాను సారముగఁ బ్రాయశ్చిత్తము నొనర్చుకొన కున్నచో వారు పాపులై పోదురు. వారు మరణింపగానే యముడు తన దూతలచే దండన మొసంగఁ జేయును. నరకమును

దప్పించుకొన వలయుననిన శాస్త్రములలోఁ జెప్పబడిన పాప ప్రాయశ్చి త్తముల నవశ్యము నొనర్చుకొనవలెను."

అంత రాజిట్లడిగెను :— "స్వామీ! ప్రాయశ్చిత్త మొనర్చు కొనుటచే పాపనాశన మెట్లు కాఁగలదు?

అంత శ్రీశుకుఁ డిట్లనెను:— "రాజా! ఇది యెఱిఁగిన విషయమే పొలములో చాల వ్యర్థతృణములు, ముండ్లచెట్లు పెరుగుచో గుద్దలితో నఱికిన నవి యిఁక నుండవు. అట్లే ప్రాయశ్చిత్తము చేసికొనినఁ బాపము లుండఁజాలవు, నశించిపోవును. గొడ్డలితోఁ జెట్టు కొట్టఁబడినట్లు ప్రాయ శ్చిత్తముచేఁ బాపరూపమగు వృక్షము తెగిపోవును."

అంత రాజిట్లడిగెను :— "స్వామీ! ఇది నేను తెలిసికొంటిని. నేనడిగినదాని కభిప్రాయ మేమనఁగా మానవుడు పాపమెట్లు చేయును? వాసనలకు వశీభూతుఁడైకదా! అట్లుకాకున్నఁ బాపము ప్రకటమైనను, రాజునకుఁ దెలిసినను దండమొసంగెదరని అందఱకును దెలియును. నరక ములోఁగూడ దీనిఫలము ననుభవింపవలసి యుండునని పరలోకమునం దస్తిత్వము కలవారందఱు నెఱుంగుదురు. ఇవన్నియును దెలిసియు పాప ప్రవృత్తులగుచున్నారు. కొందఱు వాసనకు వశీభూతులై పరస్త్రీగమన మొనర్చుచున్నారు. బ్రహ్మహత్య చేయుచున్నారు. ధనరత్నములను దొంగిలించుచున్నారు. ప్రాయశ్చిత్త మొనర్చుకొనుటచే వానివాసన నశిం చుచోఁ బ్రాయశ్చిత్త ముచితముకాని, వాసన నశింపక నేడు ప్రాయశ్చిత్త మొనర్చుకొని రేపు మరల పాపప్రవృత్తినిఁ జెందినచో నిది గజస్నాన మువలె నగును. ఏనుగును బాగుగారుద్ది స్నానము చేయించినాననుకొనుడు. అది నదినుండి బయటకు రాఁగానే తనయంగములపై మరల దుమ్మును

జల్లుకొన్నచో దానివలన నేమిలాభము ? ప్రాయశ్చిత్తమను గొడ్డలి పాప రూపమను వృక్షమును నఱకివేసి, వాసనారూపమగు మూలము నట్లే యుంచినచో నా మూలమునుండి వృక్షము పుట్టును. ప్రాయశ్చిత్తమున మూలవాసనయు నశించునా లేక తత్క్షణమునఁజేసిన పాపమే నశించునా ? ఇది చెప్పవలెను."

ఇది విని నవ్వుచు శుకమహాముని యిట్లనెను:— "రాజా ! నీవు తెలివికలవాఁడవు. విషయము చివరవఱకు పెళ్ళుచుందువు. మహారాజా ! కృచ్ఛ్రచాంద్రాయణాది ప్రాయశ్చిత్తములచేఁ బాపకర్మలు పూర్తిగా నశింపవు ఇట్లు గ్రహించుము. ఒకానొకనికి శరీరమున శ్లేష్మ(కఫ)ము వృద్ధియైన దనుకొనుఁడు. దీనివలన నొక్కొక్కప్పుడు ముక్కులు బిగించును, ఒక్కొక్కప్పుడు కొండనాలుక పెరుగును. ఒక్కొకయెడ గొంతు నొప్పి పుట్టును. ఇంకొకప్పుడు పండ్లతీపు పుట్టును. ఇంకొకప్పుడు మందాగ్ని కలుగును. ఒకసారి జ్వరము వచ్చును. రోగికి ఏ యుపద్రవమువలనఁ గష్టము కలుగునో వైద్యుడు దానికి క్షణికచికిత్స యొస్వర్చును. కొండ నాలుక పెద్దదైనచోఁ గత్తిరించును. కఫపుబిళ్ళ లేర్పడుచో వాటినిఁగత్తితోఁ జికిత్సచేయుదురు. మందాగ్ని యగుచో పాచకోద్దీప కౌషధముల నొసంగును. జ్వరము వచ్చినచో దానినాపుట కౌషధము నొసంగును. ఈ యుపాయములచే నుపద్రవములు శాంతమగును. కొంతకాలము మాత్రము శాంతించినవికాని మూల నాశముకాదు శ్లేష్మశాంత్యుపాయమును జూడనంతవఱకును, ప్రయత్నించి మూలదోషమును నాశము చేయనంతవఱకు నుపద్రవము లుండనేయుండును. అదేవిధముగ రాజా ! ప్రాయశ్చిత్తమను నది రోగమునకు మందుకాదు రోగోపద్రవములకు తాత్కాలికౌషధము. ఎవఁడైనఁ గామవశమునఁ బర స్త్రీ గమనమొనర్చుచో దానిఁ ప్రాయశ్చిత్తముగఁ జాంద్రాయణవ్రత మొనర్చెను.

దీనివలన నొకసారి పరదారాభిగమన మొనర్చిన పాపము పోయి నది. ఈ పాపమునకై అతఁడు యమలోకము నదండమును భోగింపఁ బనిలేదు. కాని ఆ ప్రాయశ్చిత్తముచే వాని కామవాసన సమూల నాశము కాదు. మరల కామాభితప్తుఁడై ఆ పాపమును జేయును, చేయవచ్చును, చేసితీరును. ఏలననఁగా భూమిలో మూలముండిన నీరు తగులఁగానే అంకుర మవశ్య ముత్పన్నముకాఁగలదు."

ఇది విని పరీక్షిత్తు ఇట్లనెను :— "స్వామీ ! దీనివలనఁ బ్రయోజనములేదు. పాపప్రవృత్తి కలుగని ఉపాయమును జెప్పుఁడు వాసనా మూలము నాశము కావలెను."

అంత నవ్వుచు శుకుఁ డిట్లనెను :— "రాజా ? అదియే నేను చెప్పఁబోవుచున్నాను. ఇంతకుముందే నీవు ప్రశ్నమడిగితివి. స్వామి ! రోగము వచ్చినతర్వాత చికిత్సయొనర్చుటయు, రోగము రాకముంద సావధానముగ నుండుటయు నుత్తమపక్షముకాదు. సంయమ నియమము లతోనుండి రోగము రాకుండఁ జూచుకొనుటకు సదా ప్రయత్న మొనర్చు టయే ఉత్తమపక్షము. ఒకవేళ పొరపాటున రోగము సంభవించినచో శ్రద్ధతో పథ్యపూర్వకముగఁ జికిత్స యొనర్చుకొని మూలము నశించు నట్లు చూచుకొనవలెను. రోగము కొంచెము మిగిలియున్నను మహారోగ ముల నుత్పన్నము కావించును. ఇదేవిధముగ మహారాజా ! పాపము రాకుండఁ జూచుకొనుటయే సర్వశ్రేష్ఠమార్గము. ఒకవేళ పాపము సంభ వించుచోఁ దత్క్షణము ప్రాయశ్చిత్త మొనర్చుకొని, ఇఁకముందు జాగ్ర త్తగ నుండవలెను."

మంచిది. నీవాలోచించుము—"పాపమెట్లు సంభవించును ? అజ్ఞా నమువలన ననిత్యమునందు నిత్యత్వబుద్ధియు, అప్రియమందు ప్రియ భావనయు, అశుచియందు శుచి కల్పనయు నుండుటవలననే స్త్రీ పురుషుని

యందును, పురుషుఁడు స్త్రీ రూపమునందును, ఆసక్తిఁజెంది పాపకర్మము నొనర్చుచో, దానికి ఒక్కటే కారణము కలదు. అది అజ్ఞానము. అట్టి అజ్ఞాని నేడు పాప ప్రాయశ్చిత్తము నొనర్చుకొని రేపు మరల నదే పాపమును జేయును. ఏలననఁగా నాతని మనస్సు విషయములందు తగుల్కొనియున్నది. కావున మహారాజా! అన్నిటికినిఁ బ్రాయశ్చిత్త మజ్ఞానము. మనసును నీ విషయములనుండి తప్పించి మనమోహన మాధురి యందు మత్తుఁడై యుండవలెను. చిత్త మీ యజ్ఞానకృత శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ సుఖములందుఁ దగుల్కొనినది. వీనినుండి తప్పించి జ్ఞానస్వరూపుఁడగు భగవద్రూపమందు తల్లీనుఁడైనచో మరల నీతఁడు పాపము లొనర్పఁజాలఁడు. సదా సర్వదా పథ్యమందుండు వానికి సాధారణముగ రోగములుఁరావు. అటేవిధముగ నియమానుసారముగ నాచరణ మొనర్చువాఁడు భగవత్తత్త్వమును బొందుటకు సమర్థుఁడు కాఁగలఁడు. కావున భగవత్స్వరూపజ్ఞానము. భగవంతునియం దహైతుకభక్తి, భగవన్నామ, రూప, లీలా, ధామములందుగాని వీనిలో నొక్కదానియందుగాని రతి కలుగుటయే సర్వశ్రేష్ఠమును యథార్థమునగుఁ బ్రాయశ్చిత్తము."

## ప్రభుప్రేమయే సమస్త పాపములను నశింపఁజేయునదే

## 351

శ్లో. ప్రాయశ్చిత్తాని చీర్ణాని నారాయణ పరాఙ్ముఖమ్।
న నిష్పునంతి రాజేంద్ర సురాకుంభ మివాపగాః॥

శ్రీ భాగ. ౬ స్కం. ౧ అధ్యా. ౧౮ శ్లో.

సారపరమార్థ తత్త్వమొక్కటియే. దానినిఁ బొందుటకు మార్గము లనేకములు. గంతవ్యస్థాన మొక్కటియే. అచ్చటికి తూర్పుగా వెళ్ళినను, పశ్చిమముగా వెళ్ళినను, వాహనముమీఁద వెళ్ళినను, నడకను వెళ్ళినను ఆలస్యముగనో త్వరగనో చేరఁగలవచ్చుటికి. కాని బుద్ధిమతిత్వ మెచ్చుట కలదనఁగా రాళ్ళు అప్పలలోను, ముండ్లు గోఁతులలోను ప్రయాణమొన ర్పక సరళ సుగమ రాజపథమున గమ్యస్థానమును జేరవలయును-గొప్ప గొప్పవా రేమార్గమునఁ బయనించిరో, వారే మార్గమును ప్రశంసించిరో అదియే సర్వశ్రేష్ఠమును, సర్వోపరి మార్గమై యున్నది.

శుక మహర్షి యిట్లనెను :— "రాజా ! కొన్నిపాపములు మనస్సు చేతను, కొన్ని మనోవాక్కులచేతను, కొన్ని మనోవాక్కాయములచేతను జరుగును. మానసిక పాపములకు గొప్ప ప్రాయశ్చిత్తము పశ్చాత్తాపము. మనస్సులో నేదైనను బాపముద్భవించుచో క్షణములో దాని నణఁచుకొని "అయ్యో ! ఇట్టిపాపము నా మనస్సులోనికి వచ్చినదేమి ? రామ రామ ! ఇఁక నెన్నటికినిఁజేయను." అనుకొనుచు నీవిధముగ ననేక యుక్తులచే మనస్సును ధిక్కరించి, పాపము చేసినతర్వాత తాపము కలుగుట పశ్చా త్తాపము పశ్చాత్తాపమంది నీపాపము నెన్నటికినిఁజేయనను భావన దృఢ ముగ నుండును. మనోవాక్కులతో పాపము జరుగుచో దానికొఱకై పశ్చా త్తాప సహితముగ జపమొనర్పవలయును. వాచిక పాపములకు మౌన ధారణ మొనర్చుటయు, వైదిక, తాంత్రిక, నామ మంత్రములను జపిం చుటయును ఇది అన్నిటికంటె గొప్ప ప్రాయశ్చిత్తము. మనోవాక్కాయ ములను నీ ప్రతికరణములచేఁ బాపములు సంభవించుచో మనస్సుతో భగ వన్నామ కీర్తన మొనర్చుటయు, దేహముచే భగవత్సేవ యొనర్చుటయు, నియమవ్రతము నుండుటయు, నీవిధముగ భగవదాశ్రయగ్రహణ మొన ర్చుటచేతను, భగవద్భక్తి యొనర్చుటచేతను మానవుడు సమస్తపాపముల నుండి విడివడును. నియమముగను సంయమ పూర్వకముగను నుండని వాని సాధన వ్యర్థము."

అంతట బరీక్షిన్మహారాజి ట్లడిగెను :— "నియమపూర్వకముగ నెట్లుండవలెను? ముఖ్య ముఖ్య నియమ సంయమములను నాకుఁ జెప్ప వలయును."

ఇదివిని శుకుఁడిట్లనెను :- "నియమము లనేకములున్నవి; కాని ప్రధాన నియమములివి. ఈ నియమములను బాలించుటచేఁ గ్రమ క్రమ ముగఁ బ్రపంచ విషయముల నుండి విరమించి భగవత్పాద పద్మము లందు లగ్న మొనర్పవలెను."

పరీక్షిన్మహారాజిట్లనెను :- "స్వామీ! ఆ నియమము లేవి ?"

శుకుఁడిట్లనెను :— "రాజా! ఆ నియమములివి–తపము, బ్రహ్మ చర్యము, శమ, దమ, దాన సత్య, శౌచ, యమ నియమములు. ఇంక నిప్పుడత్యంత సంక్షేపముగ వీని వ్యాఖ్యను వినుము."

"మహారాజా! క్లేశమున శరీరమును దాప మొనర్చుటకుఁ దప మందురు. ఈ శరీరము స్వభావముగ సుఖమును గోరుచుండును. సుందర విషయ వాసనా యుక్తమును గామోద్దీపక సంగీతమును వినుటచేతను, తనను గూర్చిన స్తోత్రమును వినుటచేతను మనోహర చిత్రాకర్షక, రమ ణీయ రూపమును గాంచుటచేతను, స్వాదిష్ట హృద్య మధుర నోయూరఁ జేయు రసయుక్తములగు మృదుల సుస్వాదు పదార్థములను నాలుకతో టచి చూచుటచేతను, మంచి సుగంధవస్తువుల నాఘ్రాణించుట చేతను, మృదుల, సుందర, సుఖద, కోమల సుకుమార శరీరములను మెత్తని దిండ్లను పఱుపులను స్పర్శించుట చేతను సేవనాదుల వలనను చిత్తము స్వతః ప్రసన్నమగును. వీనినిఁ ద్యజించి శరీర నిర్వాహము కొఱకు మాత్రమే వస్తువులను సేవించుటకే తపస్సందురు. కృచ్ఛ్ర చాంద్రాయ

జాది వ్రతములును, తపోంతర్గతములే, యథార్థముగఁ బరమ తపస్సు కామ వాసనలను భోగములను మనస్సు నుండియును త్యజించుటయే.

బ్రహ్మచర్యమని దీనినందురు :- "మనస్సుచే తమ, వచనము చేతను; గర్మచేతను సర్వదా వీర్యరక్షణ మొనర్చుటయు, అష్టవిధ మైథున ములను సర్వదా వర్జించుటయును గృహస్థుఁడు కేవలము సంతానోత్పత్తి కొఱకు స్వదారయందే ఋతుకాలమందే అభిగమన మొనర్చుటకే బ్రహ్మ చర్య మనఁబడును.

మనస్సును శమింపఁజేయుటయు, దానిని విషయముల వైపునుండి మరలించుటయు, అంతఃకరణమును భగవానుని యందే లగ్న మొనర్చు టయు దీనిని శమమందురు. ఇంద్రియములను దమన మొనర్చుటకును, ఇంద్రియములు విషయముల మీఁదకుఁ బరువిడుచుండ వానిని బలాత్కా రముగ నీవలకు లాగి, వాని యందాసక్తినిఁ జెందింప కుండుటకే దమ మందురు.

తన వస్తువును యోగ్యపాత్రకు సవిధిగసమర్పించి,దానిమీఁదగల స్వత్వమును త్యజించుటకు దానమందురు. అన్నదానము, గోదానము. జలదానము, ఫలదానము, ద్రవ్యదానము, పృథ్వీదానము, కన్యాదానము మొదలగు ననేకవిధ దానములు కలవు: కాని యీ దానములను నిర్మత్స రుండై యిచ్చువాఁడే పరమ పుణ్యమున కధికారి కాఁగలఁడు. భూత ద్రోహ మొనర్చుచుఁ పైకి దాన మొనర్చువాఁడు చేసిన దానములన్నియును వ్యర్థములే. కావున భూత ద్రోహమును త్యజించుటయే పరమ దానమని చెప్పఁబడినది,

యథార్థ కథనమునకు సత్యమందురు. ఏది యెట్లు జరిగినదో, అంతఃకరణముతో మనమెట్లు చూచితిమో ఏది వింటిమో దేని ననుభవిం చితిమో దానిఁ జెప్పుటలేమియును లేక నిష్పక్షపాతముతో వ్యక్తమొనర్చు

టకు సత్యమందురు. మనమ్నలో భేదభావముండి, అందులో నొకనినిఁ దనవానిగా నెంచుకొని, రెండవ వానినిఁ బరాయి వానిఁగా నెంచుకొనిన వాఁడెన్నటికిని సత్యాచరణము సేయఁజాలఁడు. కావునఁ బ్రాణులన్నిటి యందు సమభావముంచుటయే యథార్థమగు సత్యము.

బాహ్యాభ్యంతర శుద్ధికి శౌచమందురు. చాలమంది బాహ్యముగ నమిత శుద్ధితో నుందురు. లోపల కావలసినంత కల్మషము. అది యదార్థ మగు శౌచముకాదు. ఇది సురా భాండమును గంగా తోయముతోఁ గడిగి నట్లుండును. మనస్సునిండ దుష్కర్మలు నిండి యుండినచో నంతశ్శౌచ మెట్లుంచఁగలము ? కావున శౌచమునకు యథార్థ స్వరూపము కర్మము లందాసక్తి యుంచక పోవుటయే. అనాసక్తుఁడే పవిత్రుఁడు. కర్మలలోఁ బడినవాఁడు మలినుఁడు, అశుచి. ఈ విధముగ రాజా : చాల యమ నియమములు కలవు. వాని నెంతవఱకని నీకు వర్ణింపగలను ?"

రాజిట్లడిగెను :— "స్వామి ! యమము లెన్ని విధములు, నియమము లెన్ని విధములు ?"

ఇది విని శుకుఁడిట్లనెను :— "మహారాజా ! యోగశాస్త్ర మందు అహింసా, సత్య, అస్తేయ, బ్రహ్మచర్య, అపరిగ్రహములను నీయైదును యమములు. శౌచ, సంతోష, తప, స్వాధ్యాయ, ఈశ్వర ప్రణిధానము లను నీయైదును నియమములు. ఇవిగాక భక్తిశాస్త్ర మందింక నధికముగ గలవు. అచ్చట యమ నియమములు పంద్రెండుగఁ జెప్పఁబడినవి. అహింసా, సత్య, అస్తేయ (దొంగతన మొనర్పకుండుట) అసంగత, హ్రీ (లజ్జ) అసంచయ (శరీర నిర్వాహావశ్యకతకు మించి సంగ్రహిం చుట) ఆస్తికత (ఈశ్వర, గురు, వేదవాక్యము లందు శ్రద్ధ కలిగి యుండుట) బ్రహ్మచర్యము, మౌనము (వాక్సంయమ మొనర్చుటయు,

భగవన్నామ భగవద్గుణ కీర్తనముకాక వ్యావహారికా విషయములను బలుక కుండుట) స్థిరత్వము (చంచలతా పరిత్యాగము) క్షమా (తన కపకార మొనర్చినవారి యెడలను గోపము చెందకుండుట) అభయము (ఎవ్వరి వలనను నన్యాయముగ భయపడకుండుట) అను పండ్రెండు యమములని చెప్పఁబడినవి. ఇదే విధముగఁ బండ్రెండు నియమములు కలవు."

పరీక్షిన్మహారాజిట్లనెను :- "స్వామీ! ఆ పండ్రెండు నియమములను విస్తార వ్యాఖ్యతోఁ జెప్పుడు"

అంత శుకుఁడిట్లనెను :- "రాజా! వీనిని విస్తరించుచో సమయమంతయును దీనికే సరిపోవును కావున నిచ్చట నేను నామ నిర్దేశ మాత్రము చేసెదను. వ్యాఖ్యాన మింకొకసారి చూచుకొన వచ్చును. ఆ పండ్రెండు నియమములివి-శౌచము (అంతర్బాహ్య పవిత్రత) జపము (ఇష్ట మంత్రమును మరల మరల పవిధిగా నుచ్చరించుట) తపము (శరీరమును విషయభోగములనుండి తప్పించుట) శ్రద్ధ (గురు వచనములందు విశ్వాసము) అతిధిసేవ (ఎచ్చటనుండి యైనను అకస్మాత్తుగా వచ్చిన యెడల వానికియథాశక్తిగ అన్న, జల, నివాసస్థానాదుల నొసఁగి, మధుర వాక్కులతో సత్కరించుట) భగవత్పూజనము (వైదిక, తాంత్రిక, మిశ్రిత విధిచే షోడశోపచార, పంచోపచార లేక యథాలబ్ధోపచారములచే భగవద్విగ్రహములను బూజించుట) తీర్థ భ్రమణము [పుణ్యపద తీర్థములకు అప్పుడప్పుడు యాత్ర యొనర్చుట] పరార్థేహ [సదా పరోపకారము కొఱకు ప్రయత్నించుట] దుఃఖములకు మందులిచ్చుట ఆఁకలి గొన్న వారికి అచ్చటచ్చట ప్రోగుజేసి అన్నక్షేత్ర వ్యవస్థను గావించుటయు, నిర్ధన విద్యార్థులకు విద్యనేర్పాటు కావించుటయు, జనమును కథాకీర్తనాది శుభకర్మలద్వారా ప్రచార ప్రసారము లొనర్చి భగవంతుని వైపునకుఁ

ప్రీప్పుటయు, మొదలగు బరోపకార కార్యములను భగవత్సేవా బుద్ధిచేఁ జేయుటకు 'పరార్థేహ' యందురు] సంతోషము [భగవదేచ్ఛనిఁ బ్రార ద్ధాను సారముగఁ బ్రాప్తించిన దానితోఁ దృప్తిచెంది యుండుటయు, ఇత రుల వస్తువులందు చిత్తమును బోనీయక పోవుటయు] గురుసేవ [మనో వాక్కాయ కర్మలతో గురువున కనుకూలమగు నాచరణ మొనర్చుట, వారికి సదా సేవాశుశ్రూష లొనర్చుట ఇవియే పండ్రెండు నియమములు. ఈ యమ నియమములను సావధానముగ నవ్యగ్ర భావముతోఁ బాలించు చుండు నెడల నాతనికిఁ బాపములేరావు.

కొంత కొంతమంది ఆచార్యుల మతమేమనఁగా, మీ రీ యమ నియమములన్నిటిని నెంతవఱకిని జ్ఞాపకము పెట్టుకొనఁగలరు. చెట్టున కనేక పత్రములు, శాఖలునుగలవు. వీనికెంత నీరు కావలెనని విచారింప వలసిన పనిలేదు. వేళ్ళకు నీరుబోసినచో సమస్త శాఖోపశాఖలు తమంత దామే చిగిర్చఁగలవు. హృదయములో వాసుదేవుని భక్తి యుండినచో వాని సమీపమునకు సమస్త సద్గుణములు పిలువకుండఁగనే తమంతవియే పరు గెత్తుకొని రాఁగలవు. కావున నీ యమ నియమముల చింత వీడుము. చిత్తమును మనమోహనుని రూపమాధురి యందు లగ్నమొనర్పుము జిహ్వను నిరంతరమాతని త్రైలోక్యపావన నామగానమందు లగ్నమొన ర్పుము. ఇదివఱకు నీకున్న పాపములన్నియు భస్మములగును. ఇఁక ముందుండఁబోవు. కావున మహారాజా ! సమస్త పాపములు నశించుట కేకైక తిరుగులేని యౌషధము భగవద్భక్తి. ఎటువంటి ఘోరపాపము లున్నను, తన సమస్తేంద్రియములను సమస్త వ్యాపారములను భగవ త్కార్యములందే వినియోగించి భగవద్భక్తుల సాంగత్య మొనర్చుచో దానివలనఁ బాపశుద్ధియైనట్లు వ్రతోపవాస తపః ప్రాయశ్చిత్తాదులచే నెన్న

డును కలుగదు సంసార సముద్రమును దాటుటకుగల సాధనములన్నిటిలో నీ భక్తిమార్గము సర్వశ్రేష్ఠమును, సర్వసులభము, నిర్భయము కల్యాణప్రదమగు మార్గమైయున్నది. రాజా! ఇది యెట్టి విశాలమును జల, ఫల, పుష్పయుక్తమగు రాజపథమనఁగా గ్రుడ్డివాఁడైనను గంతులు వేసి కొనుచుఁ బరువిడినను నాతఁడు పడఁడు. మార్గమును దప్పఁడు. భక్తి మార్గము నాశ్రయించినచో వానికడకు పాపములు చేరఁజాలవు.

రాజిట్లనెను :— "స్వామీ! శాస్త్రకారులు భక్తిలోఁ జాల భేదము లున్నవని చెప్పెదరు. వీనిలో నే భక్తి నాశ్రయించుటచేఁ బాపనాశనమై పరమపదప్రాప్తి కలుగును?"

అంత శుకుఁడిట్లనెను :— "రాజా! భక్తిలోఁ జాల భేదములు కలవనుట సత్యమే; కాని నేను నీకన్నిటికంటె సుగమము, అన్నిటికంటె సరళము, అందరకును సమానముగ నుపయోగించు భక్తి మార్గమును జెప్పెదను. దానివలన సమస్త సిద్ధులు లభింపగలవు. కేవలము దానినే శ్రద్ధాపూర్వకముగ సేవించుచో మానవుఁడు పరమపదమును బొందఁగలు గును. అది భగవన్నామ సంకీర్తనమయమగు భక్తి. భగవన్నామ సంకీర్తనములో నెంతటి సామర్థ్యమున్నదనఁగా నెట్టి పాపియైనను గానిండు నా పరమేశు నాశ్రయించినచో సమస్త అధివ్యాధుల నుండి బయటపడి ప్రభుప్రేమకు అధికారి కాఁగలడు.

రాజిట్లనెను : "స్వామీ! దీనిని నాకు స్పష్టముగఁ జెప్పవలెను,,

అంత శుకుఁడిట్లనెను :— "మంచిది. నేనీ విషయమును నీకు ఉదాహరణముతోఁ జెప్పెదను. నీవు శ్రద్ధతో వినవలెను."

# అజామిలోపాఖ్యానము

## నామసంకీర్తనమే పాపపరిహారమునకుఁ జాలును

## [352]

శ్లో॥ ఏతావతాలమఘ నిర్హరణాయ పుంసామ్
సంకీర్తనం భగవతో గుణకర్మ నామ్నామ్
విక్రుశ్య పుత్రమఘవాన్ యదజామిలోఽపి
నారాయణేతి మ్రియమాణ ఇయాయ ముక్తిమ్॥

శ్రీభాగ. ౬ స్కం. ౩ అ. ౨౪ శ్లో॥

పూర్వజన్మమునఁ జేసిన పుణ్యపాపము లెన్నటికిని వ్యర్థముకావు. కావున శాస్త్రీయ సిద్ధాంత మేమనఁగాఁ బుణ్యకర్మలొనర్చుచున్నను మనకు సుఖము లభింపనిచో నీ ఫలము మనకు రాఁబోవు జన్మయందు లభించు నని తెలిసికొనవలెను. దీనికి విపరీతముగఁ బాపకర్మ లొనర్చుచున్నను వృద్ధివలెఁ గనఁబడు చుండినచో నీ వృద్ధి పాపఫలితము కాదనియు, నేదియో పూర్వపుణ్య ముదయించినదనియు, నీ పాపఫలము నవశ్యము భోగింపవలసి యుండుననియుఁ దెలిసికొనవలెను. పుణ్యపాపములు సాధారణముగ సంగదోషముచేఁ గలుగును. సంగము ననుసరించి సంస్కారము లేర్పడును. సంస్కారముల ననుసరించియే కార్యము లొనర్పఁ బూనుచుండును. కావున సదా సర్వదా సాధుపురుషుల సాంగత్యమును

జేయవలెను. కామినీ కాముకుల సాంగత్యమును పొరపాటుననైనఁ జేయరాదు.

శుకదేవుఁడు పరీక్షిన్మహారాజుతో నిట్లనెను :— రాజా ! తెలిసి తెలిసి సావధానముగ భక్తిచే భగవన్నామమును బలికినచో వారి కల్యాణము విషయమున సందేహము లేనేలేదు. తెలియకున్నను నన్యాపదేశముననైనను మూర్ఛావస్థలో భయభీతుఁడై భగవన్నామము మరణ సమయమున నెట్లు పలికినను వానికి ముక్తి కలుగును. ఈ విషయమున నీకు నేనొక ప్రాచీన, మనోహర, శిక్షాప్రదమగు నితిహాసమును జెప్పెదను. దానిని నీ వేకాగ్రచిత్తుఁడవై శ్రవణము చేయుము."

ప్రాచీన కాలమునఁ బరమ పావనమగు కన్యాకుబ్జ [కనోజ్] నగరమందొక పరమ ధార్మికుఁడును, వేదవేదాంగ జ్ఞాతయును గుణీనుఁడును విద్వాంసుఁడునగు బ్రాహ్మణుఁడుండెను. అతనికి పరమసాధ్వియుఁ బతిపరాయణయు నగు నొక భార్య యుండెను. కాలాంతరమున నాతని కొక అతిసుందర రూపవంతుఁడగు బుత్రుఁడుదయించెను. ఎవరతనినిఁ జూచినను మంత్రముగ్ధులవలె నట్లే చూచుచుండు నంతటి సుందరుఁడు. క్రమ క్రమముగా శుక్ల పక్ష శశాంకునివలె నా పుత్రుఁడు వృద్ధిపొందుచుండెను. అతని యంగములు వికాసము చెందినకొలఁది సద్గుణములును వికాసము చెందుచుండెను. బాలకున కైదాఱేండ్లురాఁగానే తండ్రి అతనికి స్వయముగ యజ్ఞోపవీత సంస్కారమొనర్చి, మంత్రోపదేశమొనర్చెను. అతనికి విధి పూర్వకముగ వేదమును జెప్పుచుండెను. అతని శరీరకాంతి సువర్ణమువలె నుండెను. అతని నల్లనల్లని ఉంగరములు తిరిగిన వెంట్రుకలు విరియఁబోసికొని వనమునకుఁ గుశసమిధలు తేఁబోవునపుడు మార్గమందుఁ జూచినవారందరును బ్రసన్నులగుచుందురు. తండ్రి అతనికి అజామిళుఁడను పేరు పెట్టెను.

అల్పకాలముననే ఆ బ్రాహ్మణ కుమారుఁడు వేదాధ్యయనమొనర్చి విద్వాంసుఁడయ్యెను. అతఁడు శాస్త్రపారంగతుఁ డయ్యెను. గొప్ప సుశీలుఁడును, గొప్ప సదాచారియు, వృద్ధ సేవియునయ్యెను. నిత్య నియమమున సమస్త వ్రతములను పాలించుచుండెను. ఇంద్రియములను వశమందుంచుకొనెను. సదా సత్యభాషణ మొనర్చుచుండెను. అత్యంత మృదుల స్వభావము కలవాఁడై యుండెను. నిత్యము గురువును, అగ్నిని, అతిథులను, తల్లిదండ్రులను సేవించుచుండెను. నియమముతో నుండి, పవిత్రాచరణ మొనర్చుచుండెను. ఎన్నఁడును దన సద్గుణములను, జాతి, కుల, వయస్సౌందర్యములందు మిథ్యాభిమానమును జెందెడువాఁడు కాఁడు. జీవులందు దయాభావమును బ్రదర్శించి ముందుగనే నవ్వుచు మాటలాడును. ఇతరుల గుణములందెన్నఁడును పొరపాటుననైన దోషదృష్టి నొనర్పఁడు. వేయేల? అతఁడు సమస్త సద్గుణముల భాండారుఁడు. సమస్త సద్గుణములు అతని దేహము నాశ్రయించి యుండెను.

అతఁడు తల్లిదండ్రుల కొక్కఁడే పుత్రుఁడగుటచేఁ దలిదండ్రులు వారి ప్రేమనంతయు నాతనిపైఁ బెట్టుకొనిరి. వారు తమ ప్రాణములకంటె నధికముగఁ బ్రేమించుచుఁ దమ శరీరముకంటె నధికముగ నాతనియెడల బ్రేమబెట్టుకొని, కంటికి ఱెప్పవలె రక్షించుచుండెను. అతఁడు యువకుఁడు కాఁగానే తల్లిదండ్రులకు వివాహ చింత యేర్పడెను. తండ్రి మిక్కిలి ప్రసిద్ధుఁడు. అతని వంశముచ్చముగ నుండెను. ధనమునకును గొదువ లేదు. రాజదర్బారు నందును నాతనికి గౌరవము కలదు. అజామిళుఁ డాతని కేకైకపుత్రుఁడు. అందువలన నందఱకును దమ తమ పుత్రునకు చక్కనిచక్కని భార్య కావలెనని యుండునట్లు ఆ బ్రాహ్మణునకును నట్టి కోరిక యుండెను. అందువలన వారు చాల ద్రవ్యమును వ్యయపరచి

ఒక సర్వగుణ సంపన్నయు సులక్షణయు నగుఁ గన్యక నన్వేషించిరి. దైవవశమున వారికొక కులీన బ్రాహ్మణ కన్యక లభించెను. ఆమె అజామిళుని కంటెను నధికసుందరియు, సుశీలయు, గుణవతియునై యుండెను. తండ్రి చాల సంతోషముతోఁ దన యేకైక పుత్రునకు చాల వైభవముగ వివాహ మొనరించెను. కోడలు కాపురమునకు వచ్చెను. కొడుకు, కోడలు కలిసియుండుటను గాంచినఁ దల్లిదండ్రుల యానందమునకు మేరలేకుండెను. ఇప్పు డజామిళుఁ డగ్నిహోత్రి యయ్యెను. నిత్య నియమముగ గృహస్థ ధర్మానుసారముగ నగ్నిహోత్ర బలివైశ్వదేవము నొనర్చి, తల్లి దండ్రులను ప్రేమ పూర్వకముగఁ బరిచర్య చేయుచుండెను. అజామిళుని ధర్మపత్నియుఁ దన పతియందు భగవద్బుద్ధి యుంచి ఆతనికి సేవా శుశ్రూష లొనర్చుచుండెను. ఈ విధముగ నా పరివారము యొక్క సమయము మిక్కిలి ఆనందముతో గడుచుచుండెను.

ఒకానొక దినమున నజామిళుఁడు తన తండ్రి యాజ్ఞను గైకొని నిత్య నియమాను సారముగ వనమందు ఫల, పుష్ప, కుశ, సమిధలను తెచ్చుటకై వెళ్ళెను.

సమిధలనుగోయుట కొఱకుఁదొకగహన వనమధ్యమునఁ బ్రవేశించెను. అచటనొక చిన్ననదికలకలశబ్దమొనర్చుచుఁ బ్రవహించుచుండెను. అచ్చటి వృక్షము లన్నియును బుష్పితములై పల్లవితములై యుండెను. పచ్చని గడ్డి ఆకుపచ్చని మఖమల్లు కంబళి పఱువఁబడి నట్లుండెను. ప్రకృతి స్తబ్ధముగ నుండెను. వృక్షముల పైఁ గూర్చుండి విహంగమ బృందము కలరవ మొనరించుచుండెను. పుష్పములచే నలరారుచున్న పృథివి అలంకరింపఁబడిన క్రొత్త పెండ్లికూఁతురు వలెఁ గనఁబడుచుండెను. అజామిళుఁడు ఫలపుష్పములను జాలగఁ గోసెను. ఎదుట నాతనికి పొదల మాటున పకపక నవ్వులాటల ధ్వని వినఁబడెను. రాజా! ఈ కర్ణేంద్రి

యము స్వభావ మేమనఁగా - భగవచ్చర్చ యెదుటఁ జరుగుచుండినను వినఁబడదు, ఏదైనను నవ్వులాట, శృంగారపు చర్చ మాత్రమున జరుగు చున్నను వినఁబడుచుండును. ఈ యరణ్యములో నింత సుఖముగను స్వేచ్ఛగను నవ్వులాడుచున్నదెవరో? తన కుతూహలమును దీర్చు కొనుటకై అతఁడు ముందుకుఁ బోవునప్పటికి అచ్చటొక అత్యంత సుందరియగు చంద్రముఖియు, పరమలావణ్య యుక్తయగు పడతిఁ కనఁ బడెను. ఆమె ఒక నీలిరంగు పట్టువస్త్రమును, ఎర్రని రవికను తొడిగెను పైన సువర్ణహారము ధరించియుండెను. ఆమె ఒక పురుషుని మెడకుఁ జేతులను బెనవైచుకొని కూర్చుండి నవ్వుచుండెను. చూడఁగా నా పురు షుఁడు ధనికునివలెఁ దోఁచుచుండెను; కాని యాతని యాకృతినిఁబట్టి నీచజాతివాఁడుగా దోఁచుచుండెను. ఇద్దర చేష్టలనుబట్టి ఇద్దరును మదిరా మదమత్తులైరని తోచుచున్నది. మదిరా పానముచే నిద్దర కండ్లు నెఱ్ఱనై యుండెను. సాధారణముగ వేశ్యలకు లజ్జయుండదు. అదియును గాక మదిరాపాన మత్తతచే నామె యింకను మున్మత్తయై నిర్లజ్జయై యుండెను ఇద్దరు నలంకరించుకొని యుండిరి. ఇద్దరును వారి బహుమూల్య వస్త్రము లపై అత్తరులను జల్లుకొనిరి. ఇద్దర భుజములును అంగరాగములచే ననులిప్తమై యుండెను. ఇద్దరును భుజములతో ప్రేమాలింగన మొనర్చు కొనుచుండిరి. ఆ వేశ్యను జూడఁగానే అజామిళుని మనస్సామె యందు లగ్నమయ్యెను. ఆతని హృదయమందు ఆమె యొక్క మనోహర మూర్తి నిలిచిపోయెను.

ఆతడు నిగ్రహించుకొని తన్నుఁదాను దూషించుకొనెను "నేనేమి చేయుచున్నాను? నా మనస్సెట్లైనది. కులీనుఁడను వేదపాఠియు బ్రాహ్మ ణుఁడగు నేనెచ్చట? సర్వభోగ్యయు పణ్యస్త్రీయగు నీ వేశ్య యెచ్చట?

నోటికి రాని అక్షరాస్యుఁడు మొన్నమొన్నటి వఱకు ఆంధ్ర దేశమున నుండెడివాఁడుకాదు. కాలవైపరీత్యముచే నిప్పుడందలి పద్యములను కంఠగతము లొనరించుకొనువారి సంఖ్య చదువుకొన్న వారిలోనే చాల తక్కువైనది. పోతరాజు సంస్కృత భాగవతమును యథాతథముగా నాంధ్రీకరించియుండలేదు. భక్తిభావ భరితమైన భాగముల నాతఁడు పెంపొందించి యుండెను. అది గాక పద్యకావ్యముల నర్థము చేసికొనఁ గలవా రిప్పుడెందరో యుండరు. అందుచే సంస్కృత భాగవతమునకు రెండు మూడు వచనానువాదములు కూడ వెలసినవి. భాగవతమువంటి ఉత్తమ గ్రంథమెంత అధికముగా ప్రచారము పొందిన లోకమున కంత మేలు కలుగును.

తపోనిష్ఠాగరిష్ఠులు, యోగిపుంగవులు, భక్తశిఖామణులునైన శ్రీశ్రీశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు జగద్ధితార్థమై శ్రీ భాగవతము నందలి విషయములను కథాదృష్టాంతానుభవపూర్వకముగా సరళసుందర మైన హిందీభాషలో నఱువది సంపుటములుగా వచన రూపమున రచించి యుండిరి. అది హిందీ భాషాభిజ్ఞుల అదృష్టము. వానిని భక్తవరేణ్యులు శ్రీ రామశరణ్ కుందుర్తి వేంకటనర్సయ్య గురుపుంగవులు సర్వసు బోధమైన భాషలో తెలిఁగించి యుండిరి. భక్తి ప్రధానమైన శ్రీ మద్భాగ వతమును భక్తవరేణ్యుఁడైన పోతరాజాంధ్రీకరించుటవలన నాంధ్ర లోకమున కెంత మహోపకారము జరిగినదో భక్తచూడామణులైన శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి గారి హిందీ గ్రంథమును భక్తిసముద్రులైన శ్రీ కుందుర్తి గురుపుంగవు లాంధ్రీకరించుట వలన నంతమహోప కారము జరిగినది. ఆ గ్రంథమునకు శ్రీ మద్భాగవతదర్శనమను పేరు

సార్థకము. అది రెండుసార్లు ముద్రితమైనది. కాని ప్రతులిప్పుడు లభ్యములగుటలేదు. అది చూచి నిత్యధర్మకార్యపరాయణులును వదాన్య శేఖరులునైన భక్తులొకరు ఆ సంపుటములను పునర్ముద్రించుట వలన లోకమునకు మేలు కలుగునని అందుకు సంకల్పించిరి. వారు సిద్ధ సంకల్పులు. వారి సంకల్ప బీజము వృక్షమై యిప్పుడీ గ్రంథముల రూపమున ఫలించినది. ఆంధ్రులా ఫలమును ఆస్వాదించి ఆనందపారవశ్యము పొందుదు రనుటలో సందేహము లేదు.

ఆ భక్తులే శ్రీ వేంకటేశ్వరార్షధర్మ భారతీధర్మ సంస్థను స్థాపించి దాని పక్షమున అష్టాదశ మహా పురాణములను తెలుగు లిపిలో తాత్పర్య సహితముగ ముద్రించి ఆంధ్రులకు మహోపకారము చేయుచున్నారు. ఈ భాగవతకథా సంపుటములు కూడ, శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతీ ధర్మ సంస్థ పక్షముననే ముద్రింపబడుచున్నవి.

శ్రీ వేంకటేశ నామ్నా
భారత సంస్కృతి ప్రవర్ధనార్థాయ
సంస్థాపితేయం ధర్మ
సంస్థార్షా జయతు భగవతః కృపయా.

—దివాకర్ల వేంకటావధాని

నోటికి రాని అక్షరాస్యుఁడు మొన్నమొన్నటి వఱకు ఆంధ్ర దేశమున నుండెడివాఁడుకాదు. కాలవైపరీత్యముచే నిప్పుడందలి పద్యములను కంఠగతము లొనరించుకొనువారి సంఖ్య చదువుకొన్న వారిలోనే చాల తక్కువైనది. పోతరాజు సంస్కృత భాగవతమును యథాతథముగా నాంధ్రీకరించియుండలేదు. భక్తిభావ భరితమైన భాగముల నాతఁడు పెంపొందించి యుండెను. అది గాక పద్యకావ్యముల నర్థము చేసికొనఁ గలవా రిప్పుడెందరో యుండరు. అందుచే సంస్కృత భాగవతమునకు రెండు మూడు వచనానువాదములు కూడ వెలసినవి. భాగవతమువంటి ఉత్తమ గ్రంథమెంత అధికముగా ప్రచారము పొందిన లోకమున కంత మేలు కలుగును.

తపోనిష్ఠాగరిష్ఠులు, యోగిపుంగవులు, భక్తశిఖామణులునైన శ్రీశ్రీశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు జగద్ధితార్థమై శ్రీ భాగవతము నందలి విషయములను కథాదృష్టాంతానుభవపూర్వకముగా సరళసుందరమైన హిందీభాషలో నఱువది సంపుటములుగా వచన రూపమున రచించి యుండిరి. అది హిందీ భాషాభిజ్ఞుల అదృష్టము. వానిని భక్తవరేణ్యులు శ్రీ రామశరణ్ కుందుర్తి వేంకటనర్సయ్య గురుపుంగవులు సర్వసుబోధమైన భాషలో తెలిఁగించి యుండిరి. భక్తిప్రధానమైన శ్రీ మద్భాగవతమును భక్తవరేణ్యుఁడైన పోతరాజాంధ్రీకరించుటవలన నాంధ్ర లోకమున కెంత మహోపకారము జరిగినదో భక్తచూడామణులైన శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి గారి హిందీ గ్రంథమును భక్తినముద్రులైన శ్రీ కుందుర్తి గురుపుంగవు లాంధ్రీకరించుట వలన నంతమహోపకారము జరిగినది. ఆ గ్రంథమునకు శ్రీ మద్భాగవతదర్శనమను పేరు

సార్థకము. అది రెండుసార్లు ముద్రితమైనది. కాని ప్రతులిప్పుడు లభ్యములగుటలేదు. అది చూచి నిత్యధర్మకార్యపరాయణులును వదాన్య శేఖరులునైన భక్తులొకరు ఆ సంపుటములను పునర్ముద్రించుట వలన లోకమునకు మేలు కలుగునని అందుకు సంకల్పించిరి. వారు సిద్ధ సంకల్పులు. వారి సంకల్పబీజము వృక్షమై యిప్పుడీ గ్రంథముల రూపమున ఫలించినది. ఆంధ్రులా ఫలమును ఆస్వాదించి ఆనందపారవశ్యము పొందుదురనుటలో సందేహము లేదు.

ఆ భక్తులే శ్రీ వేంకటేశ్వరార్షధర్మ భారతీధర్మ సంస్థను స్థాపించి దాని పక్షమున అష్టాదశ మహా పురాణములను తెలుగు లిపిలో తాత్పర్య సహితముగ ముద్రించి ఆంధ్రులకు మహోపకారము చేయుచున్నారు. ఈ భాగవతకథా సంపుటములు కూడ, శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతీ ధర్మ సంస్థ పక్షముననే ముద్రింపబడుచున్నవి.

శ్రీ వేంకటేశ నామ్నా
భారత సంస్కృతి ప్రవర్ధనార్థాయ
సంస్థాపితేయం ధర్మ
సంస్థార్షా జయతు భగవతః కృపయా,

—దివాకర్ల వేంకటావధాని

నా శీల సదాచార మెచ్చట ? దీని వ్యభిచారమయ జీవనమెచ్చట ? నేనేమి యాలోచించు చున్నాను ? ఈ విధముగ ననేక విధముల మనస్సునకు బుద్ధి చెప్పుకొని ధైర్యధారణ మొనర్చుచుండెను. క్రిందకుఁ జూచినప్పు డిట్టి యాలోచనము వచ్చును, పైకిజూచి అటుచూచిన నన్నియును మఱచి పోయి యిది నాకెట్లు సంభవించిన దనుకొనును.

అజామిళుఁ డచ్చటి నుండి పోవలెననుకొను చుండెను గాని ప్రయత్న మొనర్చినను నాతని కాళ్ళచ్చటినుండి లేచుటలేదు. ఒక దట్ట మైన పొదచాటున నుండి ఆతడు వారిద్దరి కామక్రీడలను గాంచుచుండెను. సాయంకాల మయ్యెను. వారిద్దఱును మదిరాపాన మత్తతచే నవ్వుచుండిరి పాడుచుండిరి. కామక్రీడ నొనర్చుచుండిరి; కాని అజామిళుని హృదయ మందు ద్వంద్వయుద్ధము జరుగుచుండెను. అతడు తన ధైర్యమునంతను గూడగట్టుకొని యీ పాపమునుండి బయట పడవలెనని కోరుకొనుచుం డెను గాని యాతఁడవశుఁ డయ్యెను. ఎంత ప్రయత్న మొనర్చినను ఆ వైపునుండి యాతని చిత్తమును దొలిగించుకొనలేక పోవుచుండెను. ఇప్పుడాతడు కామరూప గ్రహగ్రస్తుఁడై స్మృతి శూన్యునివలెనై ఆమె రూపసౌందర్య చింతనమందే తన్మయుఁడయ్యెను. మహారాజా ! ఈ దుష్ట మనస్సెచ్చటికిఁ గొనిపోయి పాఱవేయునో తెలియదు అజామిళుఁడు గృహస్థుఁడు. సంగదోషమున నిమిషములో భ్రష్టులైన సాధువుల ననేకు లను మన మెఱుంగుదుము."

రాజిట్లడిగెను :- స్వామీ ! తర్వాత నేమైనది ?" అత్యంత విషాద స్వరమున శుకుఁడిట్లనెను :- "మహారాజా ! ఏమైనది ? ఏమి కావలెనో అదే అయినది. అజామిళుఁడు తన ధర్మమందు విముఖుఁడ య్యెను. ఏదో విధముగ నామెను దన వశ మొనర్చు కొనవలెనని నిశ్చ యించుకొనెను.

సాయంకాల మగునప్పటికి వారిద్దరును నగరమువైపునకు బోయిరి ఆ యిద్దరును నజామిళుని జూచిరో లేధో తెలియదు. చూచినను లక్ష్య ముతోఁ జూచియుండక పోవచ్చును; ఏలననఁగా—కాముకుల ప్రపంచము వేఱుగనుండును. వారీ ప్రాపంచకులను జూచుచుండియుఁ జూడరు. అజామిళుఁడు తెలియకుండ వారి వెనువెనుకనే పోవుచుండెను, ఆ వేశ్య దూరిన యింటిని గుర్తుపెట్టుకొని అతఁడు తనయింటికిఁ బోయెను. నేఁడా తని చిత్తము ఖిన్నముగ నుండెను. అతఁడు తన తల్లిదండ్రులకు నమ స్కరింపలేదు. భార్యతో మధురముగఁ బలుకలేదు. ఎవ్వరితోడను మాట లాడక, భోజన మొనర్పక అతఁడు పడియుండెను. తల్లిదండ్రు లనేక విధముల చెప్పి, అనేక ప్రశ్నలడిగినను నాతఁడు నేఁడు నా చిత్తము బాగుండలేదు. నన్నేమియు నడుగవలదు. నన్ను మెదలకుండ నిద్ర పోనిండని చెప్పివేసెను. తల్లిదండ్రు లెట్లూరుకొనఁగలరు. వారు యథా శక్తిగ నుపచారము లొనర్చిరి. కాని యాతఁ డందఱను విదిలించి కొట్టెను.

శ్రీ శుకుఁడిట్లనెను :— "మహారాజా! నెత్తిన కామభూతము తాండవించు చున్నప్పు డాతనికి ప్రపంచ మంతయును శూన్యముగఁ దోఁచును. చిత్తము చంచలమగును. ఇదంతయు నెవరివల్లనైనదో ఆ మూర్తి కన్నుల యెదుట నాట్యమాడును; హృదయ పటలమందా మూర్తి యంకితమగును. అజామిళుని హృదయమందును నా వేశ్యా స్వరూప మంకిత మయ్యెను. మనస్సు దానిని వదలి యింకొక చింతనము చేయుట లేదు. ఈ విధముగ నాతఁడా రాత్రియంతయును మేల్కొని పొర్లిగింతలు పెట్టుచు, నిట్టూర్పులు విడుచుచుండెను.

# అజామిళుఁడు వేశ్యాకాత్మ సమర్పణ మొనర్చుట

# [353]

శ్లో॥ విప్రాం స్వభార్యా మప్రౌఢాం కులే మహతి లంభితామ్
విససర్జా చిరాత్పాపః స్వైరిణ్యాపాంగ విద్ధధీః
యత స్తతశ్చోపనిన్యే న్యాయతోఽన్యాయతో ధనమ్
బభారాస్యాః కుటుంబిన్యాః కుటుంబం మందధీరయమ్॥

శ్రీ భాగ. ౬ స్కం. ౧ అ. ౬౫ ౬౬ శ్లో॥

సాధారణపు బాణము తగిలిన నచ్చట గాయమునడి అల్పకాలము నకే నయమగును. అది విషలిప్తమగు బాణమగుచో నల్పకాలముననే శరీరమును నాశము గావించును; కాని యీ కామబాణము మానవుని జీవచ్ఛవ మొనరించును. ఈ బాణము కర్మచక్షువుల ద్వారా హృదయము నకుఁ దగులునుగాని శరీరము నంతను వ్యథితము గావించును. దీనివలన మనుష్యుఁడు చావను జావఁడు బ్రతుకను బ్రదుకఁడు. సగము చచ్చి గిలగిల కొట్టుకొనుచుండును. కామాసక్తునకుఁ బాత్రా పాత్ర విచార ముండదు. కామ మంధునిఁ గావించును; వివేక భ్రష్టునిఁ గావించును కర్తవ్యచ్యుతునిఁ గావించును. మానవుఁడు తన ధర్మ, కర్మ, శీల, సంకోచ, మర్యాద, శాస్త్రజ్ఞాన సదాచారముల నన్నిటినిఁ బోగొట్టును. భగవత్కృప కలవాఁడే మాయామోహము నుండి బయట పడఁగలడు;

కాకున్న నీ పాపాత్ముఁడు కామ విమోహితుఁడై సమస్త నరకయాతన లను భోగించుచుండును.

శుకమహర్షి యిట్లనెను :- "రాజా! ప్రాతఃకాలము గాఁగానే అజామిళుఁడు లేచెను. ఇంటిలోఁ దనభార్య యొక్క అమూల్య చంద్ర హారమును దొంగిలించుకొనిపోయి, యావేశ్య కొసంగెను. ఇదేవిధముగ నింటిలోని మంచి మంచి వస్తువుల నన్నిటిని, వస్త్రాభూషణముల నన్ని టినిఁ గొనిపోయి యా వేశ్య కొసంగుచుండెను. ఆ వేశ్య యేసుందర గ్రామ్య విషయములకు సంతసించునో అజామిళుఁడు వాటినన్నిటిని నేదో విధముగఁ గొనిచ్చి ఆమె కొసంగెడువాఁడు. ఇంటిలో ధనమునకుఁ గొదువలేదు. తల్లిదండ్రుల కీతఁడొక్కఁడే పుత్రుఁడగుటచేఁ జేయి పట్టు కొనువాఁడొక్కఁడునూ లేడు, అతఁడీ విధముగఁ దనతండ్రి యొక్క ధనమువంతను గ్రమక్రమముగ వేశ్యయింటఁ జేర్చెను. అజామిళుఁడు రూపవంతుఁడు, కులీనుఁడు, సుశీలుఁడు సదాచారి కాముకుఁడు కాఁడు, యువకుఁడు. రూపలావణ్య యుక్తుఁడు. ప్రారబ్ధవశమున నా వేశ్య యొక్క చిత్తమును నాతనియందు లగ్నమయ్యెను. ఆమెతో నిదివఱకు సంబంధము గలవాడు శూద్రుడు, చూచుటకుఁ గురూపి. లోభి, కామి, తన కామవాసనను దృప్తి కావించుకొనుటకై నేడిచ్చట రేపచ్చట నీ విధముగ ద్వారద్వారము తిరుగుచుండెను. కాని యజామిళుని ప్రారబ్ధము వలలోఁ బడవైచెను. అతఁడామె రూపమునందాసక్తినిఁ జెందెను. తనకనురూపుఁడును, సర్వగుణ సంపన్నుడు నగు ప్రియునిఁ బొంది వేశ్యయు నానందము చెందెను. ఆమె ఇప్పుడిట్లు తలఁచెను :- "నా యౌవనము, రూపయౌవన మున్నంతవఱకు నీతఁడు నన్నుఁ బ్రేమించ వచ్చును. వృద్ధావస్థలో నీతఁడు నన్ను వదలివేయవచ్చును. అందువలన

నీతఁడెల్లప్పుడు నా వలలోఁ బడియుండుటకై యేదైన నుపాయమాలో చింపవలయును. ఇట్టి ప్రియునిఁ బొందియు నిట్టి ఘృణితమగు వేశ్యా వృత్తినేల జేయవలెను?” అని యాలోచించుకొని ఆమె యొక నినమున నత్యంత స్నేహమును బ్రదర్శించుచు నిట్లనెను :- “చూడండి విను చున్నారా? మీరు నన్ను బ్రేమించుట సౌభాగ్యకరమగు విషయము. కాని నేను మీకొక్క విషయమును స్పష్టముచేయఁ గోరుచున్నాను. నేను వేశ్యనుగాను కులీన బ్రాహ్మణవంశమున నేనుద్భవించితిని. ప్రారబ్ధవశమున నా తల్లిదండ్రులు చావఁగా వేశ్య నన్నుఁ బెంచుకొనినది. నాకు యువావస్థ రాఁగానే మొట్టమొదటగా నా ధనికుఁడగు శూద్రునితో సంబంధము కలిగినది. తర్వాత భగవంతుఁడు మిమ్ములను బంపినాఁడు. మీ యిద్దరి తప్ప నేనింతవఱకు మూఁడవవాని ముఖమును జూడలేదు. జీవితమంతయు మీకు చిరసంగినిగా నుండవలెననుకొనుచున్నాను. కాని ఒక్క ఒఱలో రెండు కత్తులిముడవు. ఒక హృదయము ఇద్దరిని సమానముగఁ బ్రేమింపఁజాలదు, కావున మీరు మీ ప్రాత భార్యతోనైన నుండుఁడు లేక నన్ను శాశ్వతముగఁ బెట్టుకొనుఁడు. రెండుమాటలు వదలము, ఏదో ఒక ప్రక్కకుఁ జేరుఁడు, మీరు చెప్పినట్లు యథార్థముగ నామీఁద బ్రేమ యున్నయెడల నా తోడనే యుండి యింటి సంబంధమును తెగతెంపులు చేసికొనుఁడు.

అజామిళుఁడు వేశ్యామాయా వశుఁడయ్యెను. అందువలన నామె లేక అతనికి శాంతిసుఖములు లేవు. అతనికిఁ దల్లిదండ్రుల మీఁదను, భార్యమీఁదను మోహము లేనేలేదు. ఇంటికాతఁడు ధనముకొఱకై వెళ్ళు చుండెడివాఁడు. ఇంటిలోని ధనము దాదాఁపుగా సమాప్తమయ్యెను. భార్య యొక్క సమస్తాభరణములను దొంగిలించి యా వేశ్యకు సమర్పించినాడు

తలిదండ్రులును వాని యీ వ్యవహారమున దుఃఖితులైరి. పతివ్రతయగుఁ బత్నియు నప్పుడప్పు డాతనినిఁ బట్టుకొని బ్రతిమలాడెడిది కాని యాతని మనస్సు మదిరేక్షణ వశమగుటచే నామె మాటలాతనికి నచ్చలేదు. అందు వలన నాతడు తలిదండ్రులను, యువతియు, సత్కుల సంజాతయు, సుశీలయు, సుందరియు, సర్వలక్షణయు, సర్వగుణ సంపన్నయు, సతీ స్వాధ్వియు, వివాహితయు, ధర్మపత్నియు నగు నామెను విడచి, యెల్లప్పుడు నా వేశ్యతోడనే నివసించుచుండెను. వేశ్యయు నాతనిని హృదయ పూర్వకముగఁ బ్రేమించుచుఁ బత్నివలె నీతని కనుకూలముగ వర్తించుచుండెను.

వేశ్య తన వేశ్యావృత్తిని వదలిపెట్టెను. అతనికి మదిరాపానా ధ్యాన మేర్పడెను. మదిరాపానము చేయువారికి మాంస మవశ్యము కావలసి యుండును. ఇవిగాక అలంకారము, శృంగారము, వస్త్రాభూషణములు, నూనె, పూలు, కామోద్దీపక అంగరాగములు వీని యన్నిటికిని ధనము కావలసియుండెను. పూర్తిగా గృహస్థున కున్నంత ఖర్చుండెను. ఆ వేశ్యకు ఒకరు ఇద్దరుకాదు తొమ్మిదిమంది పుత్రులు కలిగిరి. సంపాదనము లేదు. ఇంత పెద్ద గృహస్థునకు ఖర్చెచ్చటి నుండి రాఁగలదు. ఆదాయములేక వ్యయమగుచుండుచో సముద్రమైనను దరిగిపోఁగలదు. తండ్రియొక్క ధనము క్రమక్రమముగ సమాప్తమయ్యెను. పుత్రులకును మదిరా మాంసములు అవశ్యము కావలసియుండెను. ఇప్పుడేదైనను జేయవలెనను జింత యాతనికి గలిగెను. ఏమి చేయఁగలడు ? ఉరులు చేతఁబట్టుకొని యడవికిఁబోయి హరిణములను జంపుచుండెను. విల్లంబులచే జాల పశువులను హత్య కావించుచుండెను. మాంసమీ విధముగ

వచ్చెడిది. మదిరా మొదలగు పై ఖర్చులకు దొంగతనము చేసెడివాడు. మోసము చేసెడివాడు. జూదమాడుచుండెను. జూదములో నొక్కొక్క ప్పుడు చాలధనము వచ్చును. ఒక్కొక్కప్పు డంతయును బోవును. ఎచ్చటనైన దారిలుకొట్టి తెచ్చుచుండెడివాడు. సారాంశ మేమనగా నాతఁ డిప్పుడు పూర్తిగా దొంగ, జూదరి, దారికొట్టువాడు, హింసకుడు, నిర్దయ గలవాఁడయ్యెను. పరిస్థితిలోఁ బడిపోయి యిప్పుడు సమస్త శీలమును, సదాచారమును, జ్ఞానధ్యానములను మఱచిపోయెను. ఇప్పుడాతనికి నాపని యెట్లు జరుగును, నా కుటుంబమెట్లు పోషింపఁ బడఁగలదను చింతయే యుండెను. ఇప్పుడాతనికి బహు కుటుంబిని యగు నా వేశ్యా పోషణ చింత మాత్రమే యుండెను. ఇప్పుడాతనికిఁ గర్తవ్యతా కర్తవ్యతాజ్ఞాన మును, మంచిచెడ్డల విచారణయుఁ బోయెను. ఏ యుపాయముచే ధనము లభించునో దానినే చేయుచుండెను.

ఎవఁడైన ధనికుడు వెళ్ళుచుండుటను గాంచి మాయ బంగారమును వానిముందు పడవైచి, వాడు తీసికొనఁగానే ఆతనితో నిట్లనును :— "ఇందులో సగభాగము నాది, లేకున్న నిప్పుడే రక్షక భటులకుఁ జెప్పి పట్టించెదను. ఆతడు భయపడి నూఱు రూపాయలకు గాను తన యేఁబది రూపాయలను దీసికొని వెళ్ళిపోవును. ఆ మాయబంగారము రెండురూపా యల ఖరీదుకూడ ఉండదు. ఈ విధముగ నాతడు అనేకులను మోసగిం చును, ఒంటరిగా నెవనినైనఁ గాంచినచో వానిని దోఁచుకొననైన దోఁచు కొనును. లేదా హత్యనైనఁ గావించును. ఘోరారణ్యములలోఁ గొన్ని గుప్తములగు గుహల నేర్పాటు చేసికొని, అచ్చటకు ధనికులగు యువకు లను గొనిపోయి బంధించి, యెవనిద్వారానైనను పది పదునైదు వేల నేర్పాటు చేసికొని ఆ ధనమును గ్రహించి విడిచివేయును. ఒక్కొక్క

ప్పుడు స్త్రీని మోసగించి, ఆమె సొమ్ముల నన్నిటిని హరించి, కొట్టి నది లోనికి నెట్టును. ఒక్కొక్కప్పుడు పది పదునైదుమంది దొంగలను గూర్చుకొని దోపిడి చేసికొని వచ్చును. సశస్త్రుఁడై ధనికుల యిండ్లకు బోయి వారి స్త్రీలయొక్క కాళ్ళుచేతులను నఱకి, త్రేళ్ళను గాల్చి, వారు పాతిపెట్టిన ద్రవ్యమునడిగి, యనేక యాతనలనుబెట్టి, వారి సర్వస్వమును హరించి సంగడిగాండ్రతోఁ దిరిగివచ్చును. ఆ ధనము నందఱకును బంచి పెట్టును. వేయేల, ధనప్రాప్తి కొఱకేమి చేయవలసి వచ్చినను చేయును. ఈ విధముగఁ బాపమొనర్చుచు నాతఁడు వృద్ధుఁడయ్యెను."

ఇదంతయును విని ఖిన్న చిత్తుఁడై శౌనకుఁడిట్లడిగెను :—

"సూతా ! ఇంతటి సదాచారి, ఇంతటి శీలసంపన్నుడు, మాతృ పితృభక్తు డగు నజామిళుఁ డొక్కసారి వేశ్యను గాంచఁగానే ఆసక్తుడై యుండె నేలనో మా కవగత మగుటలేదు. నిత్యము కలిసి మెలసి యుండుటచేత క్రమక్రమముగఁ బ్రేమ వృద్ధియగుటయుఁ బరస్పరము బ్రేమించుకొను టయు సంగతమే. ఆ వేశ్యను నాతఁడిది వఱకు చూడలేదు, యెఱుఁగడు గుర్తింపలేదు, పలుకలేదు, కదలికలేదు, సాంగత్యము లేదు, సంప ర్కము లేదు, ఒక్కసారి చూడఁగానే యింతటి మోహము కలుగుట మాకు మాయగాఁ దోచుచున్నది. ఇదివఱకాతడింక నెందఱనో సుందరు లగు స్త్రీలను జూచియుండవచ్చును. వారిపై నాతనికి మనస్సేల పోలేదు? చూడఁగానే మమకారమును జెందుటకేమి విశేషము కలదు ?

ఇది విని అత్యంత ఖిన్న మనస్కుఁడై సూతుఁ డిట్లనెను :—

"స్వామీ ! ఇప్పుడు నేనేమి చెప్పఁగలను ఇవి పూర్వజన్మ సంస్కార మేమైన యుండవలెనని చెప్పవలసి వచ్చును, ఎందఱో స్త్రీలు పురుషులు జీవితమంతయు మా దగ్గఱ నుందురు. ఒకదాని కంటె నొకటె రూప

లావణ్య యుక్తమైనదే కాని వారిమీదకు మనస్సుపోవుట లేదు. పూర్తి పరిచయమును లేకున్నను నామెపైపు చూడఁగానే మనస్సాకర్షింపబడును క్షణములో నామెయెడల నాత్మీయత కలుగును. వీనినిబట్టి యిదంతయును బూర్వజన్మ సంస్కారమను పరిణామమునకు వచ్చితిని. పూర్వజన్మ సంబంధమును బట్టి ప్రారబ్ధవశమున వారు సమ్ముఖమునకు రాఁగానే వీరు మనకెన్నో దినములనుండి యున్న పరిచయస్థులుగ గనఁబడెదరు. సంభాషణతో ఘనిష్టత వృద్ధిపొందును. ఆత్మీయత స్థాపితమగును. ఈ విషయమున నేను మీ కత్యంత రోచక, శిక్షాప్రదమగు కథనుజెప్పెదను. దానిని మీరు సావధాన పూర్వకముగ శ్రవణ మొనర్పుఁడు.

## పూర్వజన్మ సంస్కారమే సంబంధమునకుఁ గారణము

## 354

శ్లో॥ లబ్ధ్వా నిమిత్తామ వ్యక్తం వ్యక్తావ్యక్తం భవత్యుతః
యథాయోని యథా బీజం స్వభావేన బలీయసా॥

శ్రీ భాగ. ౬ స్కం. ౧ అ. ౫౪ శ్లో॥

జన్మాంతరీయ సంస్కారమున్న తప్ప వెంటనే ఘనిష్ఠ సంబంధ
ముండఁజాలదు. ఇల్లు, గ్రామము, పురము, నగరము, దేశము, ప్రపం
చము వీనియందెన్ని జీవులున్నను, నెందఱు పురుషులున్నను మనకు
లేనివారిక్రింద లెక్కయే. మనయింటి కెందఱో నౌకరులు వచ్చుచుం
దురు సంవత్సరముల కొలఁది పనిచేసి వెళ్ళిపోవుచుందురు. రాత్రిం
బవళ్ళు వెంటనంటి యుందురు. వెళ్ళిపోఁగానే వారి పేరులే మనకు
గుర్తుండవు. రూపమును మఱచి పోవుచుందుము; కాని ఒకానొక నౌకరు
వచ్చినచో నాతఁడు రాత్రింబవళ్ళు తమ యింటిపని వలెఁ జేయుచునే
యుండును. ఇంటిలోని వారందఱకును వానిపై మోహము కలుగును.
అందఱాతనినిఁ దమ పరివారములోని వారివలె భావించుచుందురు. ఒక
తల్లి గర్భమున నుద్భవించిన సోదరులు పరస్పరము ఒకరి మెడను మఱి
యొకరు ఖండించుటకుఁ జూచుచుందురు. దీనికి విపరీతము నింకొక
వర్ణమువాఁడు, అన్యదేశీయుడు, అన్యభాషను మాట్లాడువాడు, తనసర్వస్వ
మును మనకు సమర్పించి తోఁబుట్టిన వారికంటె నెక్కునగఁ బ్రేమించి,
మన కార్యము లన్నిటిలోఁ జేయూత నొసంగుచుండును. ఒక్కొక్కఁడు
మంచి సౌందర్యముగల పిల్లల నిత్తుమన్నను వివాహము చేసికొనరు;
నల్లగఁ గురూపిగనున్న దానిని కావలెనని హఠపూర్వకముగ వివాహ
మాడుచుందురు. దీనినిఁబట్టి మనుష్యులు పూర్వజన్మ సంబంధముచేఁ
బాపశాపములను వివశులై చేయుచుందురను నిష్కర్షకు రావచ్చును.
కాకున్న నాలోచించుడు. తన అపయశము నెవడు కోరుకొనును? తనకప
కీర్తి రావలయుననియుఁ దనను దూషింప వలయుననియు నెవఁడైనఁ
గోరుకొనునా? కాని యింతటి గొప్పకీర్తిని నొక విషయములోఁ బోగొట్టు
కొనును. మేమనేకమంది సాధువుల నెఱుంగుదుము. వారికెంతో ప్రతిష్ఠ

కలదు, గొప్పమాన సన్మానమునుగలదు. జనులు వారినిఁ బరమాత్మవలెఁ బూజించెడువారు. చివరకు వారేదో మోసములోఁ బడిపోయి తమ ప్రతిష్ఠ నంతను దుమ్ములోఁ గలుపుకొనిరి. మాన సన్మానమంతయు నీటిలోఁ గొట్టుకొనిపోయి వణిక్వృత్తి నవలంబించెను. వారికిష్టము లేకున్నను బడిపోయిరి. ప్రారబ్ధము- అదృష్టము - బల పూర్వకముగ వారినిఁ బైన నుండి పట్టుకొని నేలకుఁ గొట్టివైచెను. భగవంతుని శరణువేఁడుటతప్ప దీనికి వేఱే ఉపాయము లేనేలేదు,

సూతుఁడిట్లనెను :- "మునులారా ! ఈ జీవుడు పూర్వజన్మ సంస్కారములచే నవశుఁడై పనులు చేయుచుండును. ఈ సంస్కారములే ప్రాణులచేఁ గర్మలను జేయించును. వారిని నెనుబది నాల్గులక్షల జీవరాసులలోఁ ద్రిప్పును. ఏ మానవుఁడెట్టి వాసనతోఁ జచ్చునో మఱు జన్మమున నాతఁడట్టి శరీరమునే ధరించును. శాపానుగ్రహములు రెండును ప్రారబ్ధానువశమున బ్రాప్తించును. ఎవనికైనఁ బూర్వజన్మమున పెడ కట్టెవలె సంస్కారముండుచో నమష్టుడు శాపము నొసంగును. మంచి సంస్కారము లుదయించుచో సాధువుల హృదయము లందనుగ్రహింప ప్రేరణ కలుగును. జీవుఁడు వాసనా పూర్తికొఱకే మరల మరల జన్మ లెత్తి సుఖదుఃఖము లనుభవించును. ఈ విషయమున నొక మిక్కిలి చక్కని కథను జెప్పెదము వినుఁడు."

ఏ మథురాపురియందు ఆనందకందుఁడగు దేవకీనందనుఁడుదయించి నాఁడో, ఎచ్చట నిత్యము శ్రీహరి సన్నిధియుండునో, ఏ పురిని లీలాధారి యగు ప్రభువెన్నటికినిఁ బరిత్యజింపఁడో అట్టి పావనపురి యందొక సాధువు నివసించుచుండెను. సాధువు గొప్ప సజ్జనుడు, వైరాగ్యవంతుడు సదాచారి. ఆతనికి యోగాభ్యాసమనినఁ బ్రేమ, ఏకాంతమునందుండి యప

నియమములను బాలించుచుఁ బాలు, పండ్లు, వెన్న మొదలగువాటిని యోగ సాధన యందుపయోగించుచు నియమితాహారమును గొనుచుండెను. ఆతని భక్తులలోఁ గొందఱాతనికి ద్రవ్యాదులను సహాయ మొనరించుచుండిరి.

ఆ సాధువు మనస్సులో సాంసారిక వాసనలేదు, కాని ఒకానొక పారమార్థిక వాసనయుండెను. మునులారా! ఆతఁడెంతటి సాధువు, త్యాగి, సదాచారి, వైరాగ్యవంతుఁడైనను గానిండు సాధారణముగ రెండు వాసనలుండును. ఒకటి సంతర్పణ చేయవలెనను వాసనయు నింకొకటి ఆశ్రమమును గట్టవలయునను వాసన ఈ రెండు వాసనలచేత బంధింపఁ బడి సాధువు తన యథార్థ లక్ష్యమునుండి భ్రష్టుఁడగును. ఆతడు మరల జన్మింపవలసి వచ్చును."

అంత శౌనకుఁ డిట్లడిగెను :- సూతా! ఇందులోఁ దన స్వార్థమేమున్నది. ఇది పరోపకారమే. పదుగురు నోట నన్నము పడుట చెడ్డ కార్యమా! సాధువు గృహస్థుకాడు. పిల్లలు జల్లలులేరు, ఎవరికొఱకై యిల్లు కట్టును. పోనిం డాశ్రమము కట్టినాఁడనుకొనుడు ఎవరో వచ్చిన వారుందురు. ఎవరికైనను మంచియే జరుగును. దీనిని నీవు చెడ్డదను చున్నావేమి ?"

సూతుఁడు దానిపై శీఘ్రముగ నిట్లనెను :— "స్వామీ! నేను చెడ్డదనుటలేదు. మంచిదే, పుణ్యకార్యమే. పాపముచే నరకమును బుణ్యముచె స్వర్గమును గలుగును. సంతర్పణ, ఆశ్రమ నిర్మాణములో దాగియుండిన కీర్తి కాంక్ష యిమిడియున్నది భూమిపై నెంతవఱకు కీర్తియుండునో అంతవఱకు స్వర్గమున నవశ్యముండఁ గలడు. ఒకానొకని పేరు మదనమోహనుడు. ఆతఁడొక ఔషధాలయమును మదనమోహన ఉచిత

ఔషధాలయమను పేర నొకదానిని గట్టించెను. మదనమోహనుడు తటాకమును త్రవ్వించెను. మదనమోహనుడు విద్యాలయమును గట్టించెను. ఈ వస్తువు లున్నంతవఱ కాతడు స్వర్గములో సుఖము లనుభవింపవలసి యుండును. సచ్చిదానందస్వామి సచ్చిదానందాశ్రమమును గట్టించుచో నాతఁడు ముక్తికి వంచితుడైనట్లే. ముక్తిమార్గులకు స్వర్గమెట్టిదో నరకము నట్టిదే. పదభ్రష్టుడైనట్లే."

ఇది విని శౌనకుఁడిట్లనెను :— సూతా ! నీవు గడబిడచేసినావే. వ్యాస వాల్మీకుల నామములు అజరామరములే కదా ! వారికి ముక్తి లేదా ?"

ఇది విని సూతుఁడు పెద్దగా నవ్వి యిట్లనెను :— "స్వామీ ! మీరు గడబిడ యనుకొనుడు, ఏమైన ననుకొనుడు. సత్యమేదియో దానిని నే నీ యాసనమందుఁ గూర్చుండినంత వఱకు చెప్పవలసి వచ్చును. అవును. ఆ వ్యాస వాల్మీకాది మహర్షులు ఈ కల్పసృష్టి సమాప్తి చెందు నఱకు ముక్తిఁబొందరు. వ్యాసమహర్షి యిప్పుడు నున్నాఁడు. అతఁడు రాఁబోవు మన్వంతరమందు సప్తర్షులలో నొకఁడగును. వాల్మీకి కలియుగమందొక బ్రాహ్మణ రూపమునఁ బుట్టి మానస రామాయణమును రచించినట్లు వింటిని. ముక్తుడైనచో నెట్లు జన్మింపఁగలఁడు ?"

ఇదివిని చింతాస్వరమున శౌనకు డిట్లనెను :— సూతా ! మేమీ యజ్ఞ యాగాదు లొనర్చుచున్నామే, కథాకీర్తన మొనర్చుచున్నామే దీని ఫలమును స్వర్గమేనా యేమి ?"

అంత సూతుఁడు నవ్వి యిట్లనెను :— "మహాభాగా ! మీరు చింతింపనక్కఱ లేదు మీరు ముక్తులే. భగవత్ప్రీత్యర్థముగాఁ జేసిన

కార్యము బంధన కారణము కాదు. ముక్తి కావలెనను వారికే బంధనము. భక్తులు ముక్తినిఁ దన్నివేయుదురు. బాలకుఁడేడ్చుచోఁ దలిదండ్రులాతని కాటబొమ్మ లొసంగి శాంతపఱతురు స్వామీ! ముక్తియు నట్టిదే. భక్తులీ మోసమునఁబడరు. వా రాటబొమ్మలను గాలఁదన్నెదరు. తల్లి హృదయమునకు హత్తుకొని ఆమెయొక్క మధురాతి మధురమైన పాలను ద్రాగఁ గోరెదరు. వారు భగవత్సేవను దప్ప గాంక్షింపరు. శుక వ్యాస వాల్మీకాదులు మీబోటి పరోపకార సాధువులుఁ వీరు నిత్యముక్తులే. ముండ ముక్తిలో నేమున్నది ? మెదలక పడియుండుటయే ముక్తియైన యెడల పాషాణాదులన్నియు ముక్తులే. మీరహర్నిశము భగవంతుని మధురాతి మధుర కథలు వినుచున్నారు. నిత్యము భగవంతునకు భోగమర్పించి ప్రసాదమును బొందుచున్నారు. కొందఱు చచ్చి ముక్తినిఁ బొందుచుండ మీరు బ్రదికియుండియే ముక్తి ఆనందమును జూరఁగొనుచున్నారు. ఆ మథురలోని మహాత్మునకు సాధువులకు సంతర్పణ చేయవలెనను ప్రబల వాసన యుండెడిది. దీనికొఱకై మెల్లమెల్లగాఁ దన తిండిలో మిగిల్చి కొంత ద్రవ్యమును ప్రోవుచేసెను. ధనికు లాతనిని సన్మానించుచుండిరి. కావున నల్పకాలముననే అతనికి చాలద్రవ్యము ప్రోవుపడెను.

మునివరా! నేను చెప్పెడు కాలములో ద్రవ్యమునకే మూల్యము అన్నది వస్తువుల కేమియును మూల్యములేదు. ఒక్క రూపాయి నొసంగిన నెంత యన్నమునైనను గొనవచ్చును, ఎంతటి నేయినైనను బోయించుకొనవచ్చును, ఆ రోజులలో నొక్క నిష్కమే (ఇదియొక బంగారునాణెము) చాల గొప్పది. అట్టి స్వర్ణ ముద్రికలను నూటయేఁబదింటిని కూడఁబెట్టెను. అతఁడిట్లనుకొనెను - "వీనితో లక్షమంది సాధు

వులకు భోజనము పెట్టవచ్చును. ఆ రోజులలోఁ బ్రయాగలో నర్ధకుంభ మేళము జరుగుచుండెను. సాధువిట్లనుకొనెను :- "ప్రయాగకు వెళ్ళ వలెను" అచ్చట నెలయంతయును త్రివేణీ స్నానమును జేయవచ్చును. సంతర్పణము జరుగఁగలదు; కాని యింత ద్రవ్యమును దీసికొనిపోవు టెట్లు ?" అనియే యాతనిచింత. మహాభాగా ! ఈ ధనము రాఁగానే వివిధ విధములగు జిక్కులు తటస్థించును. కావున శ్రేష్ఠపక్షమేమఁనగా సాధువు ధన సంగ్రహము చేయకుండుటయే ఒకవేళ ప్రారబ్ధవశము న నట్లు చేయఁజాలక గ్రహించుటయే తప్పనిసరి యగుచో దానిని వెంటనే వ్యయమొనర్ప వలయును. దగ్గఱనున్నచో ననేక సంకల్ప వికల్పములు రేగును. వీనికిత్తుమా వానికిత్తుమా ? ఈ పని చేయుదమా ? ఆ పనిచేయు దుమా ? పదిమంది నౌకరులు వెంటఁబడుదురు వారికీయకున్న విరోధ మును గొనితెచ్చుకొనుటయే. ఈ ధనము రాఁగానే ముందుగా నందఱపై నవిశ్వాస ముత్పన్నమగును. నాలుగు పైసలు ప్రోగయ్యెనో లేదో అంద ఱను సందేహించుటయే. తీనిపై నందఱకు నీవి దగ్గఱ లేదో చేరినదను ననుమానముకలుగును, ఈ సంఘటనము జరుగు రోజులలో మార్గమునఁ బోవుట సాధారణ కార్యము కాదు. అదియునుగాక ఇప్పటివలె సౌకర్యము లప్పుడు లేవు. యాత్రికులు గుర్రపు బండ్లమీఁదనో ఎద్దులబండ్లమీదనో లేక కాలినడకనో ప్రయాణ మొనర్చెడివారు. దారిలో గొప్ప గొప్ప దట్టపుటడవు లుండెడివి. అచ్చటచ్చట దోపిడి భయముండెడిది. ధనికులు అస్త్రశస్త్రములతో మిక్కిలి జాగ్రత్తగా యాత్ర చేసెడివారు. అట్టియెడ సాధువుల కిట్టి సౌకర్యము లెట్లు లభింపఁగలవు ? యాత్రికుల తోడను వెళ్ళుట కిష్టపడెడువాఁడు కాఁడు, ఎవడైనను గ్రహించెనా గోవిందాయ నమోనమః చేయవచ్చును. అందువలన నాతఁడొక యుక్తి నాలోచించెను;

ఒక బోలుబొంగును సంపాదించి నూటేబది మొహరీలను దానిలో నింపి వేసెను. పైన నొక గట్టిపిడి నేర్పాటు చేసెను. అది వేయుకానట్లును, ముడిపిడి కలిగిన కఱ్ఱయనియు గ్రహించునట్లుచేసెను. ఇంకనేమున్నది? అంతయును నేర్పాటయ్యెను. ఒక గోచీ పెట్టుకొని ఒకచేతఁ గమండల వును వేఱొకచేత నీ దండమును బట్టుకొని జయజయ సీతారామనుకొనుచు ప్రయాగ రాజమునకు నీ మహాత్ముఁడు బయలుదేరెను. అతడు వెళ్ళుచు నగర గ్రామములను దాఁటుచు, నదీనదములను లంఘించుచు, భిక్షించి తినుచు నీ సాధువు యమునను వదలి గంగ యొడ్డుననే ప్రయాగరాజము వైపునకుఁ బోవుచుండెను.

కాళీనది గంగలోఁ గలియుచోటగు కన్యాకుబ్జము (కనౌజ్) నగర సమీపమునకు వచ్చెను. అచ్చట నొక ధనికుఁడగు వైశ్యుఁ డుండెను. అతఁడతి కృపణుఁడు. కాని అతనికి సంతానములేదు. పుత్ర లోభముచే సాధువుల యాశీర్వాదములచే దనకుఁ బుత్రులు కలుగునేమోనని సాధువు లకు యథాశక్తిగ సేవ చేయుచుండెడ వాఁడు. అతఁడన్నమును బెట్టెడు వాఁడు. వస్త్రము లిచ్చెడివాఁడు. ఇంతటి తేజస్వియగు విరక్త మహాత్ముని జూచునప్పటికి అతఁ డత్యంత ప్రసన్నుఁడై అతని నెక్కుడుగ సత్క రించి యింటికిఁ గొనిపోయెను. విద్యుక్తముగఁ బూజించి ప్రేమపూర్వక ముగఁ బ్రసాదము నిప్పించెను. పరుండుటకు మంచి పరుపువైచెను. దానిమీఁద మెత్తని దుప్పటినిఁ బఱచెను. మహాత్ముఁడు పరుండగానే అతఁడు ప్రేమ పూర్వకముగఁ గాళ్ళ నొత్తసాగెను.

మహాత్ముఁడు పగలంతయు నలసి క్షుత్తృష్ణలచే బాధపడియుండెను ఇప్పుడు కడుపునిండ కమ్మని రుచిగల భోజనము లభించెను. పరుండు

టకు మెత్తని పఱుపు పరుండఁగానే అతఁడు నిద్రించెను. ఆ వైశ్యుఁ డెంతవఱకు కాళ్ళు పిసికెనో అతనికిఁ దెలియదు.

మహాత్ముఁడు నిద్ర పోయినాఁడని తెలిసికొని వైశ్యుఁడు లేచి యింటిలోపలికి వెళ్ళుచుండెను, వెంటనే అతని దృష్టి మహాత్ముని సమీపమునఁ బడియుండిన నా స్వర్ణ పూరితమగు దండముపైఁ బడెను. కర్ర చాల యందముగ నున్నదని, దానిని సౌందర్యమున కచ్చెరువు చెంది చెడ్డభావనతోఁ గాకున్నను దానినిఁ జూచుటకు లేవనెత్తెను. ఎత్తఁగానది చాల బరువుగఁ దోచెను. కొయ్యకర్ర యింతటి బరువుండదని దానిని సందేహించి, యిది యే వస్తువుతోఁ జేయఁబడినదను గుతూహలమున దానిపై జేతినిఁ బ్రసరింపసాగెను. దాని ముడినిఁ జూచుచుండెను. జాగ్రత్తగాఁ జూడఁగా నది అతుకని తెలిసికొనెను. పరీక్షార్థమై బలముగ దానినిఁ ద్రిప్పెను. అతుకున్నది కాఁబట్టి అది తిరిగెను. తెఱచి చూచు నప్పటికి దానిలో గలగలమను శబ్దమువచ్చెను. అతఁడు కృపణుఁడగు టచే సందేహ మధికమయ్యెను. దానినిఁ దీసికొని లోపలికి పోయెను. తెఱచిచూడఁగా దానినుండి నూటయేఁబది మొహరీలు బయలువెడలెను. వాటినిఁ జూడఁగానే అతనికి నోరూరెను. అతని భార్యను బిలిచి ఇట్లనెను. "విన్నావా, సాధువు చాల అసాధ్యుఁడు. ఈతని కర్రనుండి బంగారము బైటపడినది."

అతని భార్య చూచి యిట్లనెను :— "ఉండనీయుఁడు. పరుల సొమ్ముపై నాశ యెందులకు ? ఎట్లున్నదో అట్లే నింపి అతని దగ్గఱ నుంచుడు."

వర్తకు డిట్లనెను :— "అచ్చట నుంచి వచ్చిన సాధువేమి చేయును. అతని కిల్లా ? వాకిలా ? పెండ్లామును లేదు బిడ్డలునులేరు. ఇట్లే

మోసి మోసి చచ్చిపోవును. ఎవనిచేతికో చిక్కును. మనదగ్గఱ నుండిన నేదో ప్రయోజనముండును, వ్యాపారమునకుఁ బెట్టవచ్చును. ధనము వృద్ధియు నగును. కొంచెముగ ధర్మము పుణ్యము లభించును.”

భార్య వ్యంగ్య స్వరముతో నిట్లనెను :— “వ్యాపార మిట్టి యధర్మ అన్యాయముననా ? పాపద్రవ్యముచే నేమి పుణ్యము ? పుణ్య మొనర్పుచో ధర్మముగఁ జేయుఁడు న్యాయమున సంపాదించి చేయుఁడు.”

వర్తకుఁ డిట్లనెను :— “ఆడుదాని కెంత తెలివియో అంతే మాటలాడును. నీకు వ్యాపారమేమి తెలియును ? నీ కొక్కటియే తెలియును. ఉప్పులేదు. పప్పులేదు. చీరె చినిఁగినది, రవిక మాసినదని, ధన మన్యాయముననే వచ్చును. ఇప్పుడు పెద్ద పేరుగలవారు, ధర్మాత్ము లని ప్రసిద్ధినిఁ జెందినవారు, పేదల రక్తమును బిండి పైసలను సంపాదించినవారే. న్యాయముగ ధర్మపూర్వకముగఁ బొట్టగడుపుకొనఁగలమా? పొట్ట నిండుట చాల కఠినము. పాపముచేతనే పైకము లభించును. ధనవంతుఁడేది చేసిన నదియే న్యాయము, అదియే ధర్మము.”

భార్య వ్యంగ్యముగ నిట్లనెను :— “అన్యాయము చేతను, నధర్మము చేతను ధనమురాదు. అన్యాయము, పాపము, దొంగతనము వీని వలననే ధనము ప్రోగగుచోఁ జోరులు, అసత్యవాదులు, నీచులు, వీరందఱును లక్షాధికారులు, కోటీశ్వరులు కావలెను. ధనము కూడబడుట ప్రారబ్ధవశమున. ప్రారబ్ధమున లేక యెంతటి అన్యాయ మొనర్చినను, నెన్ని అసత్యములాడినను ధనము లభింపదు.

వర్తకు డిట్లనెను :— “అదియే నేనును జెప్పుచున్నాను. నా ప్రారబ్ధము వలననే నీ సాధువు మన యింటికి వచ్చినాఁడు. కాకపోయిన నీ నగరమున నెంతమంది లేరు ? అతఁడెంత ప్రయత్నమున నింత

దాఁచుకొన్నాడు. ప్రారబ్ధ విహీనునకు దృష్టి అచ్చట పడదు. నాకు ప్రారబ్ధము కలదు గనుకనే నా దృష్టి అట్లు పడినది. దానిని దెలుచుటకు సంకల్పము కలిగినది. ఇంకొక గృహస్థుని దైనదైన నేను తాఁకెడు వాఁడనేకాదు. అతని పిల్లలు జల్లలు తిట్టుకొందురు. కాని సాధు ద్రవ్య మునుగొని అతని కుపకార మొనర్పవలెను. అతనికి బంధవిముక్తి నొనర్పవలయును. ఈతఁడు సాధువే యగుచో సంతోషించును. సాధు వేషమున నుండిన మోసగాఁడగుచోఁ జిక్కఁలేదు. దీనినిఁగూడ యెచ్చట నైన మోసగించి తెచ్చియుండవచ్చును."

పాపమా స్త్రీ యేమి జవాబు చెప్పగలదు ? తన భర్త యిష్టమునను సరించి ఆమెకును మనస్సులో లోభ ముద్భవించెను. మొహరీలనన్నిటిని దీసి, అంతే బరువు కలిగిన చిల్లపెంకుల నుంచెను. మరల పిడినట్లే బిగించి సాధు సమీపమున నుంచెను. ఆ దంపతు లింతటి ధనము లభించు టచే మిక్కిలి యానందించిరి.

ప్రాతఃకాల మయ్యెను. సాధువు మేల్కాఁనెను. అతఁడు వైశ్యు నకు తన కృతజ్ఞతను బ్రకటించుచు నిట్లనెను ?— "లాలాజీ ! మీ యింటిలో మేము బాగుగా సుఖించితిమి. యాత్రాకష్ట మేమియును దోఁచ లేదు. ఇఁక మేము వెళ్ళిపోయెదము. సంక్రాంతి పర్వము సమీపించు చున్నది. రాత్రింబవళ్ళు నడచినఁగాని చేరఁజాలము. నేను మకర సంక్రాంతికి ప్రయాగకు అవశ్యము చేరవలెను."

వర్తకుఁడు కపట వినయమును జూపుచు నిట్లనెను :— "స్వామీ ! మీరిట్లు మాటలాడుచున్నారేల ? ఇది మీ యిల్లే. తిరిగి వచ్చునపుడు మీరవ శ్యము దర్శన మొసఁగవలెను. ఇప్పుడు మీరు తొందరలో నున్నారు.

మాఘస్నాన మొనర్చి తిరిగి వచ్చునపుడు పది పదునైదు దినములుండి మాకు మీ సత్సంగ లాభము నీయవలయును."

సాధువిట్లనెను :— సరియే; తిరుగు ప్రయాణమున నేను తప్పక వచ్చెదను. మీరిద్దరును గొప్ప ధర్మాత్ములు." ఇంతలోనే భార్య యిట్లనెను :— "స్వామీ ! మీ దయచే నిచ్చట నందఱము సుఖముగ నున్నాము. కాని యింత సంపత్తి యుండియు ననుభవించు వాఁడు లేఁడు."

సాధువు గ్రహించెను. అతని కడకు పుత్రార్థులు ధనార్థులు వచ్చు చునే యుందురు. మిగ్కిలి ప్రేమతో నిట్లనెను :— "మంగళమయుఁ డగు శ్రీహరి మంగళమునే కావించును. అమ్మా ! నీవు చింతింపవలదు" ఈ విధముగ నిద్దఱను సమాధానపఱచి సాధు వచ్చటినుండి ప్రయాగకు వెళ్లెను. రాత్రింబవళ్ళు నడిచి సంక్రాంతి యింకను రెండుదినము లున్న దనఁగాఁ బ్రయాగకుఁ జేరెను.

తీర్థరాజమగు ప్రయాగ యందు మాఘ సంక్రాంతికి ప్రతి సంవత్సరమును గొప్ప పర్వము సంభవించును. కుంభ, అర్ధకుంభము విషయమునఁ జెప్పవలసిన దేమున్నది ? దేశ దేశాంతరములలోని సాధు మహాత్ములు సమావేశ మగుదురు. సర్వత్ర సాధు సత్పురుషుల యొక్క కూటములే కనఁబడుచుండును. సంక్రాంతి దినమున సాధువు లందఱకు సంతర్పణ చేయవలయునని అతని సంకల్పము. ఈ సంకల్పముతో నాతఁడొక ప్రతిష్ఠ కలిగిన మహంతు దగ్గఱ దిగి, దిగఁగానే తన మనో గత భావమును వెల్లడించెను. ఎవరైన సంతర్పణ చేయువారు వచ్చిన బాగుండునని యా మహంతు ఇదివఱకే మాధవునిఁ బ్రార్థించుచుండెను. ఇంకేమున్నది ? మహంతు నిమిషములో సాధుకూటము లన్నిటికిని

ఆహ్వానమును బంపించెను. పాత్రలను దోమిరి. పాలుపెరుగు నేర్పాటు చేసిరి. మహంతు యొక్క ముఖ్య వంటవా డిట్లనెను :— "బాబాజీవద్ద పద్ద నేమియును గనఁబడుట లేదు. ముందుగానే పైకము నడుగుఁడు." మహంతునకా ధ్యానమే లేదు. వంటవాఁడు జ్ఞాపకము చేయఁగా నాతఁ డిట్లనెను :— "మంచిది. కొంచె మడుగుము." వంటవాఁడు సాధువుతో నిట్లనెను :— "స్వామీ! పాలు, పెరుగు, పప్పు, ఉప్పు. బియ్యము వగైరాలు రావలసి యున్నవి. పైకమెంత యున్నది ? ఏ వర్తకుని పేరనయిన హుండీ కలదా లేక మీ వెంట నేమైనను దెచ్చి నారా ?"

సాధువు దృఢముగ నిట్లనెను :— "మీకీ చింత యెందులకు? ఎచ్చటినుండి వచ్చిననేమి ? మీకు పైకము రేపు ప్రొద్దుటికి వచ్చిననరి. చూచుట కాతఁడు సజ్జనుఁడుగను దేజస్విగను గోచరించుచున్నాఁడు. అతని దృఢతా పూర్వకమగు మాటనువిని మహంతు విషయమును బోగొట్టుచు నిట్లనెను :— "కాదు. కాదు. బాబాజీ అంతటి అవిశ్వాసము జెందవలసిన వ్యక్తికాఁడు. ఇచ్చటను భగవంతుని భండారమునకుఁ దరుఁగు లేదు. రూపాయలు వచ్చుచునే యుండును," మాట లంతటితో సమాప్తమయ్యెను.

రాత్రి యయ్యెను. అందఱును నిద్రించిరి. సాధువు నివసించుటకు మహంతు ఒక మంచి కుటీరము నొసంగెను. సంతర్పణవిషయము లేకుండినచో బయట నెచ్చటనో ధునివద్ద గూర్చుండు మనువారే. ఇంత సంతర్పణ జరుగుచున్నప్పుడు అతనికి విశేష సత్కార మొనర్పవలెను. అందఱును నిద్రపోఁగానే సాధువు తన దండములోని మణినుద్రిప్పెను. ఎదుట నొక దీపము వెలుఁగుచుండెను. ఆ ప్రకాశమున దానిలోఁ దాను

జూచినది తాను నమ్మఁజాలక పోయెను. ఇది స్వప్నము కాదుగదా యని యాతఁడు కన్నులు నులుముకొని చూచుచుండెను. కాని సాధువు నిద్రించుటలేదు. మేల్కొనియే యుండెను. అతఁడు చూచుచున్నది సత్యమే. దాఁచియుంచిన సువర్ణముద్రికలు కన్యాకుబ్జ మందలి శ్రేష్ఠికడ నున్నవి. అవి చిల్లపెంకులు. సాధువునకు నెక్కుడుగ మానసిక దుఃఖముకలిగెను. అతనికి సంగతి అంతయును దెలిసెను. తనకు విశ్వాసఘాతుక కార్యము చేసినాఁ డిప్పుడేమి చేయవలయునని యోచించుచుండెను. అర్థరాత్రి సమయము. వెంటనే కుటీరము నుండి బయలుదేరి త్రివేణీ వైపునకుఁ బోయెను.

భాగీరథి తన సోదరియగు కాళిందీ పులినమందుఁ జేరుటకు ద్రుతగతినిఁ బరువిడుచున్నది. సూర్య తనయయు, యముని సోదరియు నగు యమున తన మంథరగతితో గంగకై నిరీక్షించుచుండెను. చంచలబాలికవలె గంగ యమున యొక్క నీలాంబరమునఁ దనశరీరమును గొప్పించి మరలఁ బ్రకటమై నవ్వును. సోదరీమణు లిద్దరును గౌఁగిలించుకొందురు. ఈ కలయిక సంగమమందు ప్రతిక్షణము జరుగుచునే యుండును. అనాది కాలము నుండియు నీ సంగమము జరుగుచునే యున్నది. ఎంతవఱకు జరుగునో నలువ వేదములలో వ్రాసినాఁడో లేక యెవరు వ్రాసినారో వారికే తెలియవలయును. మునులారా! ఈ విషయ మెవరికిని తెలియదు.

సాధువు లజ్జా సంకోచము చేతను, ఆత్మగ్లాని చేతను మిక్కిలి దుఃఖితుఁడయ్యెను. ఆ దుఃఖావేగముచే నాతఁడా గంగా యమునానదీ తీక్ష్ణధారలుగల సంగమములో దుమికెను. అతని శరీర మేమైనదో తెలి

యదు. అతఁ డాత్మహత్య కావించుకొనెను. కుశల విషయ మేమనఁగా నింక నెచ్చటనైనఁ జచ్చియుండినచోఁ ప్రేతము కావలసి వచ్చెడిదే.

సాదువు కథ పూర్తియైనది. ఇఁక శ్రేష్ఠిగారి కథను వినుఁడు. ఆ స్వర్ణముద్రలను దీసికొని యా వర్తకుఁడు గొప్ప వ్యాపార మొనర్చెను. ప్రారబ్ధవిషయమును జూడుఁడు. ఒక్కొక్కపుడు అన్యాయార్జిత విత్తమును ఫలించి పుష్పించుచుండును. ఆ ధనముతోఁ జేసిన వ్యాపారమునఁ బగలు రెట్లు రాత్రి నాల్గు రెట్లుగ లాభము వృద్ధి పొందుచుండెను. వర్తకునకు గొప్ప గొప్ప నగరములలో కోట్లు యేర్పడెను, హుండీలు సాగుచుండెను. అల్పకాలముననే ఆతని భార్యకు గర్భము కలిగి, ఒక పుత్రరత్నమును గనెను.

వర్తకుని కుమారుఁడు సాక్షాత్తుగఁ గామదేవుని అవతారముగ నుండెను. ఆతని యంగ ప్రత్యంగముల నుండి సౌందర్యము వెల్లిబుకు చుండెను. విశాల మస్తకమున నల్లని ఉంగరములు తిరిగిన వెండ్రుకలు, విశాలములగు నేత్రములు, ఒక్కసారి ఆ పిల్లవానినిఁ జూచువారలు మంత్రముగ్ధునివలె నట్లు చూచుచునే యుండవలసినదే. వృద్ధావస్థలో నిట్టియనూప రూపలావణ్య యుక్తుఁడగుఁ బుత్రునిఁగాంచి యా వైశ్య దంపతుల హర్షమునకు మేఱలేకుండెను. లోభియగువాఁడు తన ధనమును రక్షించుకొనునట్లు తలి దండ్రులా పుత్రునిఁ బోషించుకొను చుండిరి. పుత్రుఁడు జన్మించినది మొదలాతని విభవమును వృద్ధి పొందెను. వైశ్యుఁడే కృపణుఁడైనను బుత్రుని కొఱకెంతైనను వ్యయమొనర్చి సంతోషించును. ఆ పిల్లవానికిఁ గొంచెముగ జలుబు, తుమ్ములువచ్చినవా గొప్ప గొప్ప చికిత్సకులను బిలిపించి ధనమును నీటివలె బ్రవహింపఁ జేఁజేయును. రాజకుమారునకుఁ బాలనపోషణము జరుగునట్లా పణిక్పుత్రు

నకుఁ బాలన పోషణము జరుగుచుండెను. క్రమ క్రమముగఁ బిల్లవాఁడు పెద్దవాఁడయ్యెను.

చదువు చెప్పుటకు పండితుల నేర్పాటు కావించెను. అతని తీక్ష్ణ బుద్ధిని గూర్చి చెప్పవలసినదేమున్నది ? ఒకసారి విన్నచో నంతయును జ్ఞాపకముంచుకొను చుండెను. ధర్మమునందీతనికి అత్యంతాభిరుచి. అతని కడ నెల్లప్పుడును పండితులును సాధువులును గుమిగూడి యుందురు. దూర దూరముల నుండి విద్వాంసు లాతని ప్రశంసను విని వచ్చుచుం దురు. అతఁ డందఱను సత్కరించి వారు కోరిన వస్తువుల నిచ్చుచుండెడి వాఁడు. యాచకులను విముఖులుగఁ బోనీయఁడు. అతనికి ధర్మ కార్యము లందు సాధువులకును, బ్రాహ్మణులకును, భోజనమిడుట యనిన నాంత రిక సుఖముకలదు. ధర్మాత్ముఁడగు నా వణిక్పుత్రుని సందర్శించుటకు దూర దూరముల నుండి జనులు వచ్చుచుందురు. ఈ విధముగ నాతఁడు పదునారేండ్ల వాఁడయ్యెను. తమ పిల్లవానికి పెండ్లియై కోడలింటికి రాఁగానే చూచుకొన వలయునని ఆ వణిక్దంపతుల కోరిక కాని యాతనికి వివాహమాడుట ఇష్టములేదు. దీనివలనఁ దలిదండ్రులకు చాల క్లేశము కలుగుచుండెను.

ఇంతటి సర్వగుణసంపన్నుఁడగు పుత్రుఁడు వివాహమాడక ఉండ వలసి వచ్చినది. ప్రయోజన మేమియును లేకుండెను. ఇప్పుడు తలి దండ్రులు సాధు మహాత్ముల యొక్కయు, బ్రాహ్మణుల యొక్కయు సేవ చేయుచుండిరి. కారణము భక్తియుండి కాదు. వారే విధముగనయి నను వారి పిల్లవానికి నచ్చఁజెప్పి పెండ్లి కంగీకరింపఁ జేసెదరనియే.

తలిదండ్రుల బలవంతముచే సాధు బ్రాహ్మణులును బోధింప సాగిరి :— "నాయనా ! మేము సాధుసేవను కాదనము. భగవంతుఁడు

నీకు ధనమొసంగినాఁడు. ఇష్టము వచ్చినట్లు దానపుణ్యముల నొనర్పుము. ధర్మమునకు వినియోగించుటయే ధనమునకు గల నిజమగు సమస యోగము. కాని ధర్మపత్ని లేక ధర్మముండనే యుండదు. భార్య లేకుండ చేసిన యజ్ఞాదులు వ్యర్థములు, నిష్ఫలములు. అతిథిసేవను ఒంటరిగాఁ బురుషుఁడు—భార్య లేనివాఁడు - చేయఁజాలడు. గృహస్థుఁడు అతిథి సత్కార మొనర్చినటుల ఈ గడ్డాల మీసాలవారెట్లు చేయఁగలరు? కావున వివాహ మొనర్చుకొనుము. ఇద్దరును గలిసి ధర్మకార్యము లొన ర్చుము,"

సాధు మహాత్ముల యొక్కయు, బ్రాహ్మణుల యొక్కయు బల వంతముచే నా శ్రేష్ఠి కుమారుఁడు దారాగ్రహణ మొనర్చుట కంగీకరిం చెను. ఇంకేమున్నది. తలిదండ్రుల హర్షమునకు మేఱలేకుండెను. సర్వ లక్షణ సంపన్నయగు కన్యక నన్వేషించుచుండెను. ఈతఁడెట్లు కోటీశ్వ రుఁడో అట్లే మాథురమండలములో నగర శ్రేష్ఠియగు నొక కోటీశ్వరుని పుత్రిక భాగ్యవతియు, గుణవతియు, రూపవతియు నగు నామెతో గొప్ప వైభవముగ వివాహము జరిగెను. తలిదండ్రులీ వధూవరులను గాంచి సంతోషమును బట్టఁ జాలకుండిరి. అందఱును వీరు రతీమన్మథులని ప్రశంసించుచుండిరి; యథార్థమునకు వారట్టి సుందరులే.

పదునెనిమిది సంవత్సరముల వయస్సున మార్గశిర మాసమున నా శ్రేష్ఠి కుమారునకు వివాహమయ్యెను. ఆ సంవత్సరమునఁ బ్రయాగ యందు పూర్ణకుంభము. చాలమంది మహాత్ములు గుఱ్ఱములు, ఏనుగులు, ఒంటెలమీఁదఁ బ్రయాగకు ప్రయాణము చేయుచుండిరి. ఆ వణిక్పు త్రుడు - మిక్కిలి ప్రేమతోఁ దనతండ్రి కిట్లనెను :— "నాయనా!

నేనును దీర్ఘరాజమగు ప్రయాగకు వెళ్ళి కుంభస్నానము చేసి రావలయు నని యున్నది. ఒకనెల అచ్చటనుండి కల్పవాస మొనర్పవలెను.

ఇది విని మిక్కిలి యానందమును బ్రకటించుచు శ్రేష్ఠి యిట్లనెను :— "నాయనా! మంచిదే. నీ వెంట మేమును వచ్చి త్రివేణీ స్నానమును గల్పవాసము నొనర్చెదము. ఎన్నాళ్ళ నుండియో మనకీ గృహస్థాశ్రమ బంధమునుండి బయటపడి పోలేక పోయితిమే యని కలదు. మంచిది, అందఱమును వైభవముగ వెళ్లెదము. ప్రతిష్ఠానపురమున మన దుకాణమును గలదు. గుమాస్తా ఉండనే ఉన్నాఁడు. అన్ని యేర్పాటులును జరుగఁగలవు."

ఇంకేమున్నది; సిద్ధమగుచుండెను. నౌకలలో సామాను వేయుచుండిరి. గొప్ప గొప్ప నౌకలు తయారు చేయఁబడెను. అధిక ధన, అన్న, వస్త్రాదులు వేయఁబడినవి. ధర్మాత్ముఁడగు వణిక్పుత్రుఁడు తీర్థరాజమగు ప్రయాగకు వచ్చుచున్నాఁడని విని వేలకొలఁది అటు నిటు నుండి వచ్చిరి. అందఱితో నౌకలు చాల జాగ్రత్తగఁ బోవుచుండెను, ఆ వణిక్కుమారునకు వివాహమైనను కన్నెత్తి భార్య ముఖమైనను జూడ లేదు. అవసరమేమున్నది? వివాహమైన అల్ప కాలముననే ప్రయాగకు ప్రయాణము సంభవించెను, అతఁడు తన నౌకలో నొక్కఁడు కూర్చుండెను. ఇతరులను గూర్చుండనీయలేదు. తలిదండ్రులు మోహవశమున నౌకలన్నిటి మధ్యయందు అతని నౌకను బెట్టిరి. కుశలురగు పల్లెవారిని అవి తల్లక్రిందులు కాకుండునట్లు దానిని రక్షించుటకు నియమించెను. ఈ విధముగఁ జాల జాగ్రత్తగ బ్రయాణ మొనర్చుచు సంక్రాంతికి ముందుగనే ప్రయాగ రాజమునకుఁ జేరుకొనిరి. అచ్చటకు చేరిన తర్వాత గంగాయమునా మధ్య ప్రదేశమందు రజత చూర్ణమయీ వాలుకాప్రదేశ

పందా ధనికశ్రేష్ఠుని గుడారము పడెను. నల్దిక్కులను నీ సంవత్సరము గొప్ప ధర్మాత్ముఁడగు శ్రేష్ఠి పుత్రుఁడు కల్పవాసము చేయవచ్చెనను గగ్గోలు పుట్టెను.

సూతుఁ డిట్లనును :— "మునులారా ! ధర్మాత్ముని యశస్సు కర్పూర సుగంధము వలె సర్వత్ర వ్యాప్తమగును. మీరాలోచించుఁడు. ధనము నెవఁడు తన వొమ్ముమీఁ బెట్టుకొని పోఁగలఁడు. నేటివఱకీధన మెవనిదైనది. పిచ్చివారు దీనిమీఁద మమత్వమును బెట్టుకొనుచున్నారు. భాగ్యవశమున ధనము ప్రాప్తించిన దానితో ధర్మమును గీర్తిని సంపాదింపకున్నచో వాని ధనము వ్యర్థమే, కేవలమాతఁడు దానికి కావలివాడే. బ్రతికి యున్నంతవఱకు తిండితినకయు నిద్రపోకయు దానిని రక్షించును. చచ్చిన తర్వాత సర్పమై దానిపైఁ బరుండును. ఎవఁడు ధనముచే ధర్మ మొనర్చి యశస్సును గీర్తిని సంపాదించినచో ధనముచే యథార్థోప యోగమును జరిగినట్లె. కీర్తి కలవాఁడు చచ్చియు బ్రతికినవాఁడే. అప కీర్తి కలవాఁడు జీవించియుఁ జచ్చినవాఁడే. కావున స్వామి ! ఆ వణి క్కుమారునకు నాల్గు దినములకే దూరదూరములఁ గీర్తి వ్యాపించెను, నల్దిక్కుల నుండియు నాతని కడకు యాచకులు వచ్చుచుండిరి. అతడును విత్తశాఠ్య మొనర్పక ముక్త హస్తముతో నిచ్చుచుండెను. ఎవరేది యడి గిన దాని నొసంగుచుండెను. అతఁడు దానము చేసి నంతఁగా సంపత్తి పెరుగుచుండెను. దీనివలన తలిదండ్రులకును నానందము కలుగుచుం డెను. సంక్రాంతి నాల్గుదినము లున్నదనఁగాఁ దన తలిదండ్రులతో నిట్లు డిను :— "తండ్రీ ! ఈ ఉత్సవమున నెందఱు సాధువులు, మహా త్ములు, బ్రాహ్మణులు వచ్చిరో అందఱకు మనమొక దినమున భోజనము పెట్టవలెనని నా కోరిక మీ యాజ్ఞయేమి ?"

శ్రేష్ఠిగారికి స్వయముగ ధర్మ కార్యములం దనురాగము లేదు. కాని పుత్రునకే కార్యమున సంతోషము కలుగునో దానికేమియు నభ్యం తరముండదు సరిగదా ఆతనికి అంతరిక సుఖముకూడ కలదు. ఆతఁడు మిక్కిలి యుల్లాసముతో నిట్లనెను :- "నాయనా! మంచిది, తీర్థరాజము నకు మాటి మాటికిని రాఁజాలము. ఎంతగా ధర్మ, కర్మ, దాన, పుణ్య ములు జరిగిన నంత మంచిది. అన్నియు నేర్పాటు చేయుదము. నీకెంత కోరిక యున్నదో అంతటి దాన పుణ్యముల నొనర్పుము. ఎంతమంది సాధు సత్పురుషులకు భోజనము పెట్టఁదలఁచితివో అంతమందికి చేయుము."

ఇంకేమున్నది ? లడ్డు కట్టుచుండిరి. హల్వాను జేయుచుండిరి. పూరీలను వత్తుచుండిరి. ఇంకను పప్పు పాయసాదు లన్నియును దయా రగుచుండెను. పది క్రోసులవఱకు సంతర్పణ గోల వ్యాపించెను. సాధు సజ్జనులకు విధ్యుక్తముగ భోజనము పెట్టఁబడెను. ఒక్కొక్కరికి దక్షిణ క్రింద నొక్కొక్క సువర్ణముద్ర యొసంగఁబడెను. దక్షిణ తీసుకొనని వారు వస్త్రములను గొనవచ్చును. ఎవరికేది కావలయుననిన దాని నొసం గిరి. కొదువ ఏమియును లేదు. ఏది కావలయుననిన దానినిఁదినవచ్చును. ఎంత కావలయుననిన నంత కట్టి తీసికొని పోవచ్చును. పదార్థములు బహిరంగముగ నుంచఁబడినవి, వందల కొలఁది పంక్తులైనవి. లక్షల కొలఁది జనము భోజనము చేయుచుండిరి. ప్రాతఃకాలము నుండి రాత్రి పండ్రెండు గంటల వఱ కెందఱు భోజన మొనర్చిరో, ఎందఱకు సువర్ణ ముద్రిక లీయఁబడినవో తెలియదు. రాత్రి పర్యంత మా కుఱ్ఱవాఁడొక నీటి బొట్టయినను జిహ్వపై వేసికొనలేదు. స్వయముగ వడ్డించి వడ్డించి అందఱకును బెట్టుచుండెను. మహాత్ములను సత్కరించు చుండెను. మహా

త్ములును నాతనిఁగాంచి అతని శీల స్వభావమును, ఉదారతను గూర్చి భూరి ప్రశంస లొనర్చుచుండిరి. ఇంతటి యనవద్య సౌందర్యము, ఇంతటి తెంపులేని ధనసంపత్తి పైగా నింతటి యుదారత, ఇంతటి సహన శీలత, ఇంతటి ధర్మనిష్ఠ, ఇంతటి సరళత సాధారణుల కుండదు. అవతార పురుషుడైనఁ గావలెను లేక యోగభ్రష్టుఁడగు మహాత్ముఁడైనఁ గావల యును. పవిత్ర శుద్ధాంతఃకరణము గల ధనికుల యింట యోగభ్రష్టులగు మహాత్ములు జన్మించుచుందురు.

వణిక్కుమారుని యెదుటనే అతని నందఱును బ్రశంసించుచుం దురు. తన ప్రశంసను విని అతఁడు లజ్జితుఁడై తల వంచుకొని యేమి యును బలుకకుండును. చేతులు జోడించుకొని యింకను ముడుచు కొనును.

అందఱును దినిన తర్వాత అర్ధరాత్రి యగుటచేఁ దల్లిదండ్రు లిట్లు బ్రతిమలాడిరి :— "వత్సా ః నీవును గొంచెము తినుము. నీకు వ్రతోప వాసాభ్యాస మున్నది. ఇదిగో పరాయి యింటిపిల్ల వచ్చినది. ఎంత కుసుమపేశలమై యున్నదియో చూడుము. ఇట్టి సమయ మెవరికి సంభ వించియుండును. చూడు, ఈమె ముఖమెట్లు వాడినదో. నీవు తినకఁబోవు టచే నింతవఱకీమె నీళ్లైన ముట్టలేదు. ఇప్పటి కందఱును దినుటయైనది. మంచిదే యైనది.

ఇదివిని యాశ్రేష్ఠి కుమారుఁడు తలను బట్టుకొని యిట్లనెను :— "నా తల అధికముగ నొప్పి పెట్టుచున్నదిః నాకు తినవలెనని లేదు."

ఇది వినఁగానే తల్లిదండ్రుల హృదయము దడదడ కొట్టుకొన సాగెను. అంత దండ్రి మాటను దప్పించి యిట్లనెను :— "ఇంత పరిశ్రమ చేయవలదు ఇంతటి పరిశ్రమ చేయవలదని మేమెన్నోసారులు

చెప్పితిమి. నీవు విననేలేదు. దినమంతయును లేడి తిరిగినట్లు తిరుగుచునే యుంటివి. జులుబు చేసినది. కొంచెము తిననైనఁ దినలేదు. భోజనము చేసి, అగ్నితోఁ గాపు కాచుకొని, తైలమర్దనము చేయించుకొనుము. అంతయును సరియగును."

అంతఁ బిల్లవాఁడిట్లనెను :— "వలదు నా చిత్త మత్యంత వ్యాకులము చెందియున్నది. నేనేమియును దినను, త్రాగను. నన్ను మెదలకఁ బరుండనీయుఁడు. నన్నుఁ బలుకరించకుఁడు." ఇట్లని యా బాలకుఁడు దగ్గఱనున్న బల్లమీఁదఁ బరుండెను.

ఇంకేమున్నది. ఉత్సవ మంతటను హాహాకారము వెల్లివిరిసెను. వైద్యుఁడుమీద వైద్యుడు వచ్చుచుండెను: చికిత్సకుల సమూహము సమావేశమైరి. మంత్ర తంత్రములు తెలిసినవారు గొప్పవారు చాలమంది వచ్చిరి. కొందఱు శ్రేష్ఠిగారితో "మీరు చింతింపకుఁడు. మేము బాగు చేయుదుమనిరి. కొందఱు గాలిపట్టిన దనిరి. కొందఱు ప్రయోగమనిరి. కొందఱు వేపమును జెప్పుచుండిరి. కొందఱు మాత్రల నిచ్చుచుండిరి. పిల్లవాని స్థితి ప్రతిక్షణము శోచనీయముగ నుండెను.

అంతలోనే ఒక పెద్ద అనుభవము గల నిర్లోభుఁడగు చికిత్సకుఁడు పిలిపింపఁబడెను. శ్రేష్ఠిగారాతనికి చాలగ నీయఁదలచెను. గాని యాతఁడు కొంచెమైనను స్వీకరింపలేదు. అతఁడు చూచి పరీక్షించి యిట్లనెను :- "శ్రేష్ఠిగారూ! చెడ్డగా భావింపవలదు. ఇప్పుడు మందులు మూలికలు ఇచ్చుట వ్యర్థము. ఇప్పుడు భగవన్నామమును జేయుఁడు. రామ రామ యనుఁడు. ఏది కావలెనో అది అయినది."

ఇఁది వినఁగానే శ్రేష్ఠికిని, అతని భార్యకును పిడుగు పడినట్ల

య్యెను. వారు వెక్కి వెక్కి బాలకులవలె నేడ్చుచుండిరి. కోడలు లజ్జను వీడి, ముసుఁగును దీసి, రెండు చేతులతోఁ దన బొమ్మను బాదుకొనుచు నిట్లనెను :- "అయ్యో! ప్రాణనాథా! నేను నిన్ను స్పర్శించుట యట్లుంచుఁడు, కన్నారఁ జూడనైనఁ జూడలేదు. దిక్కులేని నన్నెచ్చట వీడి పోయెదవు ?"

తన తలిదండ్రులును, భార్యయు నిట్టి కరుణాక్రందనము నొన ర్చుటను విని కుమారుఁడొక ప్రక్కకు వత్తిగిలి అజ్ఞాస్వరమున నిట్లనెను :- "ఏడ్పులు, గీడ్పులాపుఁడు. ఇచ్చటనుండి నౌకరుల నందఱను బయటకుఁ బంపుడు, కేవలము మీరు ముగ్గురుండుఁడు."

పిల్లవాని యిట్టిమాటను వినఁగానే ఆతని యాజ్ఞను వెంటనే పాలించిరి. అందఱు నచ్చటనుండి వెడలిపోయిరి. సమ్ముఖమునఁ బ్రకాశమునందెను. ఆ ధర్మాత్ముఁడగు వణిక్కుమారుఁడు లేచి తన యాసనమునఁ గూర్చుండి, అత్యంత గంభీర స్వరమున నిట్లనెను :- "నేనెవఁడనో మీకుఁ దెలియునా ? చెప్పుడు."

శ్రేష్ఠియు, నాతని భార్యయు నేక కంఠముతో నిట్లనెను :— "అయ్యో! నా తండ్రీ! అయ్యో! మా జీవన సర్వస్వమా! నీవేమి మాటలాడుచున్నావురా ? మా యీ అంధుల కేనై రక్షింపుఁడవురా నాయనా! నీవు మా యింటికి దీపమవురా, మాకు జీవనాధారమవురా ?"

దృఢతా స్వరమున నా కుమారుఁ డిట్లనెను :- "ఏడ్పులు గీడ్పులతోఁ బనిలేదు. నా మాటను వినుడు. ఎవఁడెవనికి పుత్రుడు. ఎవఁడెవనికి దండ్రి, అందఱును సంస్కారాధీనులై తమ ఋణమును దీర్చుకొనుటకు సంబంధ రూపమున నుత్పన్ను లగుచుందురు. మీరు జ్ఞాపకము పెట్టుకొనుడు. మీరు నూటయేఁబది సువర్ణ ముద్రికలను దొంగిలించితిరే నేనా

సాధువునే. నేను జన్మింపవలసిన పని లేకున్నను నాకు సాధు సంతర్ప ణము చేయవలయునను వాసన నాకుఁ బ్రబలముగఁ గలదు. మీరు దానిని బూర్తి చేయనీయలేదు. అందువలన నేను మీ యింట జన్మించి దానినిఁ బూర్తి కావించుకొంటిని. మీరు నూటయేఁబది స్వర్ణముద్రికలను హరించితిరి. దానికి బదులుగా నేను వేల రెట్లుగ వ్యయ మొనరింపఁ జేసితిని. నీకింతటి దానపుణ్యము, సాధు సమాగమము, తీర్థ వ్రత సంయోగము ప్రాప్తించినది. ఇదంతయును సాధుసేవాఫలము. మీకిప్పుడు మహాపుత్ర వియోగక్లేశము సంభవించినది. ఇది నీవు దొంగతనము చేసిన ఫలము. మానవుఁడేమి చేసిన దాని ననుభవించును. (తర్వాతఁ దన భార్యవైపు నకుఁ దిరిగి యిట్లనెను.) ఈమె పూర్వ జన్మమున మధుర యందొక కుమ్మరివాని కూఁతురు. ఆమె నా రూపముం దాసక్తినిఁ జెందెను. సాధువు నగు నాయందు కామాసక్తినిఁ జెందినది. ఈమెతో నాకు సంబంధము లేక పోయినను నీమె భావము దూషితమైనది. సదా యీమె నా రూపము నే చింతించుచుండెను. సాధువును చింతించుటచేఁ కలిగిన ఫలమేమనఁగా నీమె యింతటి శ్రీమంతుని యింటఁబుట్టి, యింతటి ధన వైభవమున మిక్కిలి సుఖముగఁ బాలింబఁడి, పోషింపఁబడి, యింతటి యధిక సౌందర్యమును బొందినది. కాని కామవాసనచేఁ జింతించుట వలన నీమె యీ జన్మమున వైధవ్య దుఃఖము ననుభవింపవలసి వచ్చినది. ఈ జన్మ మందు తన జీవితమును శుద్ధముగ గడిపినచో సద్గతి కలుగును. ఈ జన్మ మందే పాపకర్మలందు ప్రవృత్తయై, ధర్మభ్రష్ట యగుచో నరకమందు యాతనలను సహించి, అనేక జన్మముల వఱకు వైధవ్య జన్మ దుఃఖ మును బొందవలసి వచ్చును. ఈమెకును నాకును శరీర సంబంధము పూర్వ జన్మమునను లేదు, ఈ జన్మయందును లేదు. మరణ కాలమున

నీమెకు నా రూపస్మరణమే కలుగుటచే నీమెకు నాకును క్షణిక సుఖము కలిగినది. మీరు చేసినదానికి ఫలము ననుభవింపుడు. నేనిప్పుడు వెళ్ళు చున్నాను." అని పలుకుచు నాతఁడు కన్నులను మూసెను. ఆ సమయ మున నాతనికిఁ గపాలమోక్షము కలిగెను. ఆతని ప్రాణములు శరీరము నుండి వేఱయ్యెను.

సూతుఁడిట్లనెను :- "మునులారా! పూర్వజన్మ సంస్కారముల సంబంధము స్థాపితమగును. కాకున్నచో నజామిళుఁడు ఒకరికి మించిన నౌకరి సౌందర్యవంతుల నెందఱనో కాంచెను. వారిపై నాతనికి మనస్సు పోలేదు. ఈమెను జూడఁగానే అతడు తన ప్రతిజ్ఞను మఱచెను. కారణ మేమనఁగా నీ స్త్రీతో నాతనికిఁ బూర్వ జన్మమున సంబంధము కలదు."

ఇది విని మిక్కిలి యుత్సాహముతో శౌనకుఁ డిట్లడిగెను :— "మహాభాగా! ఈ స్త్రీతో నజామిళునకుఁ బూర్వ జన్మమున నేమి సంబంధము కలదు. పూర్వ జన్మమున నీ స్త్రీ యెవరు? అజామిళు డెవఁడు? ఏ కారణమున సంబంధము కలిగినది? ఈ విషయముల నన్నిటిని విని మా కుతూహలమును శాంతింపఁజేయుడు."

శౌనకుని యీ మాటలను విని సూతుఁడు గంభీరముగా నిట్లనెను :- "మునులారా! నే నజామిళుని పూర్వజన్మ వృత్తాంతమును వినిపించె దను. మీరు దానిని దత్తచిత్తులరై శ్రవణ మొనర్పుడు."

# అజామిళుని పూర్వజన్మ వృత్తాంతము

## 355

శ్లో॥ ఏష ప్రకృతి సంగేన పురుషస్య విపర్యయః
ఆసీత్స ఏవ న చిరాదీశ సంగాత్ విలీయతే॥

శ్రీ భాగ. ౬ స్కం. ౧ అ. ౫౫ శ్లో.

పతనమునకుఁ గారణ మహంకారము. మానవుఁడు తానే సర్వ శ్రేష్ఠుడననియు, నితరులు తుచ్ఛులనియు భావించుచో నకారణముగ నితరుల నవమానించును. అదియే అతని పతనమునకుఁ గారణము. సర్వశ్రేష్ఠుడు శ్రీహరి యొక్కఁడే. అతనినిఁ మఱచి అతని యాసనమున న్వాయముగఁ గూర్చుండుచో నా యవివేకికి అధః పతన మనివార్యము. అందువలన శాస్త్రకారు లీవిషయము ననేక విధముల చర్చించి హరి యీ జగత్తునందు సర్వత్ర వ్యాపించినాఁడనియు కావున నే ప్రాణికైనను నవమానమును గావించుట శ్రీహరి నవమానించుటయే ననియు, తన నీచత్వమును బైట పెట్టుకొనుచున్నాఁ డనియుఁ, దన కాళ్ళయందు స్వాయముగ గొడ్డలిపెట్టు పెట్టుకొనుచున్నాఁ డనియు, ఏలననఁగా మనలోఁగల అత్మ సర్వత్ర కలదు. పాపియగు నహంకారము దానిని వేఱొనర్చినది.

సూతుఁడిట్లనెను :- "మునులారా ! మీరు అజామిళుని పూర్వజన్మ వృత్తాంతమును గూర్చి యడిగితిరి. దానిని మీరంద ఱేకాగ్రచిత్తులరై శ్రవణ మొనర్పుఁడు. పూర్వకాలమున నుత్తరాఖండ మందొక

తపస్వి నివసించుచుండెను. అతడు పర్వతము పైననుండి ఘోరతపస్సు చేయుచుండెను. అరణ్యమున సంభవించు బచ్చిదో యెండినదో ఫల మూలములు లభించుచో స్వయముగఁ బోయి వానినిఁ గొనివచ్చును. వాటినే తినును. ఒక్కొక్కప్పుడు రెండు రెండు దినము లుపవసించి మూడవ దినమున భోజన మొనర్చును. ఒక్కొక్కప్పుడు నెల యంత యును జాంద్రాయణవ్రతమును, ఒక్కొక్కప్పుడు జవ చాంద్రాయణము, పిపీలికా చాంద్రాయణము, ఒక్కొక్కప్పుడు కృచ్ఛ్రము, అతికృచ్ఛ్ర వ్రతము లాచరించును. ఈ విధముగఁ దపస్సు చేయుచు నాతడు కాలము గడుపు చుండెను. అతడు యౌవనుఁ డయ్యెను. శరీరము సుందర మైనది.

తపస్తేజ మాతని ముఖమునఁ బ్రత్యక్షముగ గోచరించుచుండెను శీతాకాలములోఁ బర్వతము లందు హిమముచే నదీజలము లతి శీతలము లుగ నుండును. చాల నదులలోని జలము గడ్డకట్టి మంచుగడ్డ యగును. ఆ తపస్వియగు ముని పుష్య మాఘ మాసముల చలిలోఁ దితిక్షను వృద్ధి చేసికొనుటకు నదిలోని చలి నీటియందుఁ గూర్చుండెడివాడు. దీనివలన నాతనికి మంచి ప్రశంస కలిగెను. అందరు నాతనికి ఆదర సత్కార ములు చేయుచు భక్తితోఁ జూచుచుండిరి. అతనికిని తపోగర్వము కలి గెను. మునులారా ! ఇతరులు తనను బ్రశంసించుటయు, పెద్దఁ జేయు టయు సరియేకాని తానే తనను గూర్చి పొగడుకొనుచుండును. గర్వముతో నిండి తానే సర్వస్వ మనుకొనుచుఁ బెద్దల నవమానించు చుండెను. అదియే ఆతనికిఁ బతన చిహ్నము. స్వామీ ! నేడు శరీరము తితిక్షను సహించును. రేపీతఁడే వృద్ధుడైనను, అసమర్థుడైనను, రోగిష్ఠియైనను సహనశీలత నశించును ఇట్టిదే తితిక్షాదశ. ఆ తపస్వి యిప్పుడు కొంచెము శిథిలమగు చున్నట్లుండెను. ఇంతటి ఘోర తపఃప్రభావ మీ పంచభూతా

త్మకమగు దేహమందుఁ బడుట స్వాభావికమే. ఇప్పు డాతనికి శీతమును సహించుట కష్టమయ్యెను. కాని ప్రశంస కొఱకు మానవుడు హఠ మొన ర్చెను. ఆ తపస్వి తన చర్యను విడువలేదు.

ఒక దినమున నతి చలిగా నుండెను. నదీజల మతి శీతలముగ నుండెను. తపస్వి చలిచే నచేతనుఁడయ్యెను. మృతునివలె నదీతటమున జలికి ముడుచుకొని పడియుండెను.

ఇంతలోనే ఒక ముని పదునాఱేండ్ల వయస్సు కలిగిన తన కూతు రితో జలము తీసికొనిపోవ వచ్చెను. తపస్వి యిట్టి అచేతన స్థితిలో నుండుటనుగాంచి ఆతనికి దయవచ్చెను. అచ్చట అగ్నిలేదు. ఏమి చేయు టకను నాతడు నిర్ణయించుకొనఁ జాలక పోయెను. ఈ సమయమునఁ జికిత్సాదులు బాగుగాఁ దెలిసిన వేరొక మునియు నచ్చటకు వచ్చెను. ఆతడు తపస్వినిఁ గాంచి యిట్లనెను :— "ఈతని కత్యంత శీతము వ్యాపించినది. శీఘ్రముగ నుపచరింప కున్నచో శరీరాంతము కాగలదు. ప్రాణులశరీరమందు ఉష్ణతయుండును. దానివలన నాతడు జీవింపవచ్చును. యువావస్థలో మానవుల శరీరమందు ఊష్మ మధికముగ నుండును. అందు వలన యువకరక్త మత్యధి కోష్ణముగ నుండును. పురుషుల కంటె స్త్రీ శరీర మందుష్ణ మధికముగ నుండును. ఈతని బ్రతికించుటకు రెండే ఉపాయములు కలవు. ఈతనిని, వెంటనే మూసిన యింటిలో నుంచి, శరీరము నిండను దూదితోఁగప్పి దూది వస్త్రములచే గట్టిగాఁ జుట్టి యే యువతి శరీర వేడిమినైనఁ బ్రవేశింప జేయవలెను."

ఆ ముని తన పుత్రికతో నిట్లనెను :— "అమ్మాయీ! నీవు ఈతనిని నీ వస్త్రములతోఁ గప్పుము. మేము పైన నీ వస్త్రములను గప్పె దము. వేడిమి రాఁగలదు. తపస్వికి చైతన్యము రాఁగలదు."

పరోపకార దృష్టిచే నాపిల్ల యట్లే కావించెను. శరీర వేడిమివలన దపస్వికి చైతన్యము ప్రాప్తించెను. చైతన్యము ప్రాప్తింపఁగానే తన సమీపమున నొక యువతి యుండుటను గాంచి తపస్వికి చాల కోపము వచ్చెను. అతఁడడుగకయే తపోభిమానమున నా యువతికి శాప మొసంగెను :— "దుష్టా! నీవు తపస్వినగు నా కంగస్పర్శ కావించి నా ధర్మమును భ్రష్టము కావించితివి. కావున నీవు పునఃజన్మమున వేశ్యవు కమ్ము."

అంత ముని కన్యకకును గ్రోధమువచ్చెను. క్రోధము విషయమే కదా! ఆమెయు రోషమున నిట్లనెను :— "నీకు నీ తపము వలన నధిక గర్వము కలదు, ఆ గర్వముననే నిరపరాధినగు నన్ను స్త్రీనని అవమానించుచున్నావు. పొమ్ము, నీవు రాఁబోవు జన్మమునఁ దపస్వి వయ్యును స్త్రీ కొఱకు వ్యాకులము చెందెదవు. వేశ్యనగు నా రూప లావణ్యమునకు ముగ్ధుడవై నీ ధర్మ కర్మల నన్నిటిని నీటఁ గలిపెదవు?

మునులారా! ఈ విధముగఁ గ్రోధవశులై యిద్దరును బరస్పరము శపించుకొనిరి. కాలాంతరమున నిద్దరకును మరణము సంభవించెను. ఆ తపస్వి బ్రాహ్మణుఁడు అజామిళుఁ డయ్యెను. ఆ ముని కన్యకయే అత్యంత రూపలావణ్యవతి యగు నీ వేశ్య యయ్యెను. ఆమె కొఱకై అజామిళుఁడు తన సతీసాధ్వియుఁ గులవతియునగు పత్నిని, దల్లిదండ్రులను బరిత్యజించెను. ఈ వేశ్యను జూడఁగానే పూర్వ సంస్కారములకు వశీభూతుఁడై భవితవ్యతా ప్రభావముచే నజామిళుఁడా వేశ్యకు వశుఁడయ్యెను. ఆమెను పొందియే అతడు శాంతినిఁ బొందెను. నేను మీ కజామిళుని పూర్వజన్మ వృత్తాంతమును వినిపించితిని. ఇంకేమి చెప్పమందురో అడుగుఁడు.

అంత శౌనకుఁ డిట్లనెను :— సూతా ! అజామిళునకుఁ దనకు గల అభిమానమునకుఁ దగిన ఫల మనుభవించుట ఉచితమే. కాని యా మునికన్యక అపరాధమేమున్నది ? ఆమె తన తండ్రి యాజ్ఞవలన దయా వశమున నిట్లొనర్చినది. ఆమె వేశ్య యగునట్లు శాపము వ్యర్థముగ సంభవించినది."

ఇది విని సూతుఁ డిట్లనెను :— "మహాభాగా ! వ్యర్థముగ నే కార్యమును జరుగదు. మనము దాని సార్థకతను దెలిసికొనఁజాలక పోవుట అది వేఱు విషయము. ఆ మునికన్యకకు ఆ తపస్విపై స్వాభావికానురాగము కలదు. అంగనంగానక్తియు మనోవికారము కలుగుట యును స్వాభావికమే కావున స్త్రీలు పొరపాటుననైనను బరపురుషులను స్పర్శించుట, ఆలింగన మొనర్చుట పనికిరాదు.

ప్రారబ్ధవశమునను, శాపప్రభావమునను నాతఁడు తన ధర్మ కర్మ ముల నన్నిటిని విస్మరించి వేశ్యా పరవశుఁడయ్యెను. అతడు జాతికి బ్రాహ్మణుఁడే కాని కర్మ రాక్షసులవలె నొనర్చుచుండెను. చోరత్వము. జారత్వము, హింస యివేమియును నాతనిని వదలలేదు. తొమ్మిదిమంది పిల్లలు పుట్టిరి. వారందఱును బెద్దవారైరి. మరల నా స్త్రీ గర్భధారణ మొనరించెను. ఈ గర్భమేమనుకొన్నారు ? అతని నుద్ధరించు ప్రారబ్ధము పుత్రుఁడై గర్భమునఁబడెను. అతని శాపావధి పూర్తియైనట్లు తోఁచు చుండెను. భగవదారాధన, సదాచారపాలనము, తపఃఫలము వ్యర్థముగ బోదు. ఎప్పుడో ఈ ఫల మనుభవమునకు రాఁగలదు. ఎప్పుడెవరికి ఏ పుణ్య ముదయించునో యెవ్వరికిని దెలియదు. ఎప్పుడెవనిపై శ్రీహరి యనుగ్రహించునో యెప్పు డెవనికే కార్యముచే నుద్ధారము కలుగునో

కాలస్వరూపుఁడగు శ్రీకృష్ణుఁడు తప్ప యింకెవరును యథార్థరూపముగఁ దెలిసికొనఁజాలరు. సంసార చక్రమునఁ దిరిగి తిరిగి మానవుడు కర్మ బంధములను ఛిన్నా భిన్న సమయము వచ్చినపుడు సాధుసంగము ప్రాప్తించును. తాను స్వయముగ సాధువులను వెదుకవలసిన పనిలేదు. స్వయముగఁ గృపచే నాతనికి దర్శన మొసంగెదరు. సాధు దర్శనమై ఆతని మనస్సులో నీతని నుద్ధరించు కోరిక కలిగి, అతని మనస్సులోఁ బడెనా బంధము తొలఁగినట్లే, ఇంకనీ సంసారబంధన ముండదు. జీవుడీ మాయాజాలము నుండి శాశ్వతముగ ముక్తినిఁ బొందును. మునులారా! అజామీళునకును నుద్ధారావసరము వచ్చెను. దానినిఁగూడ వినుడు.

## అజామిళునకు నారాయణ పుత్రునందాసక్తి

## 356

శ్లో॥ తస్య ప్రవయసః పుత్రా దశ తేషాంతు యోఽవమః
బాలో నారాయణో నామ్నా పుత్రోశ్చదయితో భృశమ్॥
శ్రీ భాగ. ౬ స్కం. ౧. అ. ౨౪ శ్లో॥

వాక్కులోఁ జాల మహత్వమున్నది. శుభవాక్కుచే స్నేహము వృద్ధియగును. అశుభ క్రూర వచనముల చేతనే వైరభావము కలుగును,

నామము ననుసరించి భావముండును. వాక్సంగము వలన దాని యభిప్రాయము నడుచును. అందుకనియే వాణీనిగ్రహమందు శాస్త్రకారు లత్యధిక బలము నొసంగిరి. ఎవఁడైనను మన దల్లిని, సోదరిని, కూఁతురను దిట్టినాఁడనుకొనుడు. అచ్చట మన తల్లియును లేదు, సోదరియును లేదు కూఁతురును లేదు. ఇతర శబ్దములెట్టివో తిట్లునట్టివే. కాని తిట్టువాని నభిప్రాయమును మనము శబ్దములద్వారా కనుఁగొందుము. అతడు మనల నవమానించుటకును, మనలను నీచులుగా నొనర్చుటకును దిట్టినాఁడు మనము వానితో బోరాడెదము స్వయముగఁ జత్తుము లేక చంపుదుము. అంతటిపనికీ అవసరములేదు. అతడు మనకు శారీరక ద్రోహ మొనర్ప లేదు. ఆకాశమున శబ్దము పుట్టినది, విలీనమునైనది. కాని యా యశుభ శబ్దమున మన యంతః కరణమం దశుభ ప్రభావము పడినది. వీరపాటున నెవనినైనఁ దిట్టినను నాతడు కలహించును. ఇదే విధముగ శుభ శబ్దోచ్చారణమున నీయంతః కరణము పవిత్రమగును. నీ వందఱకు ప్రియుఁడ వయ్యెదవు. కావున వాక్కుతో బొరపాటుననైనను నశుభశబ్దోచ్చారణము చేయరాదని శాస్త్రకారులు చెప్పిరి. ఏదె నను మాటలాడినచో శుభమును పలుకుము లేక భగవన్నామోచ్చారణ మొనర్పుము. విలవనగా నవియే అన్నిటికంటె శుభనామములు.

శుకమహర్షి యిట్లనెను :— "రాజా! ఆ వేశ్యా సంగమున నుండి యజామిళుడు వృద్ధుఁడయ్యెను. తొమ్మిదిమంది పిల్లలు పుట్టిరి మరల నా వేశ్య గర్భవతి యయ్యెను. భోజనమొనర్చి మధ్యాహ్నోత్తర మందు ఘోరవనమునకుఁ బోయి, అచ్చట పశు పక్ష్యాదులను జంపి, పథికులను దోఁచుకొని, రాత్రి యింటికి వచ్చి మాంసమును దినును. సారాయము త్రాగును, పెండ్లాము బిడ్డలతో నానంద విహార మొనర్చును,

ఈ మధ్యలో జీవితములో నొక తరంగము వచ్చినట్లొక సంఘటనము జరిగెను."

శౌనకుఁ డిట్లడిగెను :— "సూతా ! ఆ సంఘటననేమి ? కృపతో దానిని మాకు వినిపింపుడు."

అది విని సూతుఁ డిట్లనెను :— "మహాభాగా ! వినుడు. ఒక దినమున నజామిళుఁడు నిత్య నియమాను సారముగ నడవికిఁ బోయెను. ఆ సమయమున నా నగరమున కొక సాధుమండలి వచ్చెను. స్వామీ ! మీకు తెలియును గదా ! జూదరులు జూదగాండ్రను వెదుకుకొనునట్లు సాధువులే గ్రామమునకు వచ్చెదరో అచ్చటికి రాఁగానే, ఈ గ్రామమున సాధుసేవ చేయగలిగిన భక్తులెవరైన నున్నారా ?" యని యడుగు చుందురు.

ఆ సాధుమండలి యందొక సాధువొక తెల్లని గుడ్డలను గట్టు కొనిన వాని నిట్లడిగెను :— "ఏమయ్యా ! ఈ నగరమం దెవరైన సాధుసేవ చేయు ధర్మాత్ములు భగవత్ప్రసాదము కొరకు భక్తులు కలరా ?"

గొప్ప గొప్ప నగరములలో నెక్కువమంది తెల్లని గుడ్డలు వేసి కొనువారి మనస్సు మలినముగ నుండునని యుఁ సాధుసజ్జనుల మాట విన గానే మండిపడి భస్మమగుదురను సంగతి సరళ చిత్తముగల నా సాధు వుల కేమి తెలియును ? సాధువులకుఁ గ్లేశము కలిగించుట యందే వారి కానందము. సాధు వడిగిన ప్రశ్నను విని యా మలిన మనస్కుఁడు లోలోనఁ గ్రుళ్ళుకొని, ఆ సమీపముననే అజామిళుని యేకాంత గృహ మును జూపెను. ఎదురుగాఁ బెద్దయరుగుండెను. దానిపై రావిమానిచెట్లు దట్టముగ నుండెను. అ దుష్టుడు తన భావమును మఱుగుపెట్టుచు గంభీర

ముగ నిట్లనెను :— "సాధు మహారాజా! ఈ నగరమందు గొప్పభక్తుడు అజామిళుడను నొక బ్రాహ్మణుడు కలడు. అతనికడకు వెళ్ళినచో నచ్చట మీకు యధేష్ట సత్కారము కలుగును. చాల ద్రవ్యము తినుటకు లభించును."

సాధువులు సరళముగ నుందురు. వారజామిళుని ద్వారము కడకు వెళ్ళిరి. సాధువుల కోలాహలమును విని అజామిళుని పిల్లలు యెనిమిది తొమ్మిదిమంది ఒక్కసారిగా బయటకు వచ్చిరి- ఆ యందమైన పిల్లలని గాంచి ఒకఁ డిట్లడిగెను :- "అజామిళ భక్తుని గృహమిదేనా ?" పెద్ద పిల్లవాడు తలనూపెను. సాధువులు సంచులు కఱ్ఱలట నుంచిరి. ఆసనములు పఱువసాగిరి. మహంతు యొక్క ఛత్రము తెరువఁబడి దాని క్రింద నాతని యాసనము వేయఁబడెను. భగవత్సేవా పూజ కేర్పాటులు కావింపబడెను.

పిల్లల కాశ్చర్యమాయెను. వారు పరువిడి తమ తల్లితో నిట్లనిరి :— "అమ్మా! అమ్మా! మన అరుగుమీద పెద్ద పెద్ద జడదారులు, గడ్డాల మీసాలవారు, పెద్దపెద్ద నామములు ధరించినవారు చాలమంది దిగినారు. వారజామిళ భక్తుని గృహ మిదియేనా ? యని నాయనగారి పేరడుగుచు న్నారు. ఏ దుష్టుడో సాదువులకు పరిహాసముగ నిట్లు చెప్పియుందురని వేశ్య గ్రహించెను. కాకున్న మన యింటి కడకు సాదువులు వచ్చు భాగ్యము మనకెక్కడిది! ఇప్పుడేమి చేయుదును ? అమె తన కన్నులలో నీరు గ్రుక్కుకొని తన పిల్లలను బుజ్జగించుచు నిట్లనెను :— "నాయనలారా! మీరిప్పుడు వెళ్ళి మహాత్ముల పాదములకు నమస్కరించి చేతులు జోడించి యిట్లనుడు :— "స్వాములారా! మీరు కూర్చుండుడు. నాయనగారు బయటకు వెళ్ళినారు. వారురాఁగానే మీకు సత్కారము చేయఁగలరు."

ఈ పిల్లలింతవఱకు నమస్కరించుటయే యెఱుఁగరు. తల్లి వెంటనే అచ్చటనే పాదములమీఁదఁ బడుటను నేర్పెను. పిల్లలు చూచుటకతి సుందరులుగను సుకుమారులుగను నుండిరి. ఏలననఁగా వారి తలిదండ్రులిద్దరును సుందరులే. పెద్దపిల్లవాఁడు తన తమ్ముల నందఱను దీసికొని సాధువుల దగ్గఱకుఁ బోయెను. అతఁడు బుద్ధిమంతుడు. అతఁడెట్లు నమస్కరించెనో మిగిలిన వారందఱట్లే అనుకరించిరి. సాధువులస్వభావమేమనఁగా వారికేమియును నీయకున్నను గేవలము పాదములపైఁ బడిన ప్రసన్నులయ్యెదరు. చిన్న చిన్న సుందర సుకుమారులు గుంపుగా వచ్చి పాదములపైఁ బడుటనుగాంచి సాధువులు గద్గదికులైరి. తమలోఁ దామిట్లనుకొనిరి :- "వీరు చాల సుశీలురగు పిల్లలు. భక్తుల పిల్లలిట్లేయుందురు. పిల్లల నందరను మహంతుగారి వద్దకుఁబంపిరి. పిల్లలు వారిపాదముల కెట్లు నమస్కరింప వలయునని నేర్పినదో అట్లే నమస్కరించి యిట్లనిరి :- "నాయనగారు బయటకి వెళ్ళినారు. వారు రాఁగానే మీకు సత్కారము చేయఁగలరు."

ముద్దు పెట్టుకొని మహంతు యిట్లనెను :- "సరియేలే నాయనా : పరవాలేదు. మేమిచ్చట చాల ఆనందముగ నున్నామనియు, నేమియు బాధలేదనియు మీ అమ్మతోఁ జెప్పుడు" పిల్లవాఁడిది విని వెళ్ళిపోయెను.

నేఁడజామిళుని ద్వారమందు సాధు సమూహ ముండుటను గాంచి అ ప్రక్కగా వెళ్ళు వారందఱును నిర్ఘాంతులగు చుండిరి నేఁడీ క్రొత్త విషయమెట్లు సంభవించినది ? కాని సంకోచము వలన నెవ్వరు నడుగ కుండిరి. ఇంతలోనే అజామిళుఁడును వచ్చెను. తన యింటివద్ద సాధు మండలి యుండుటను గాంచి యాతఁడు నిర్ఘాంతపడెను. అతడు వస్త్రము

లచేఁ జచ్చిన పశుపక్షులను గప్పిపెట్టెను. పెళ్ళఁగానే అతడు భయభీతుని వలె నిట్లడిగెను :— "నేఁడు మన యీ అరుగుమీఁద నేమి లీల జరుగు చున్నది."

భార్య ఆడావిడితో నిట్లనెను :— "నాకును దెలియుట లేదు. మీ పేరు భక్తుఁడను బేరును జేర్చి యడుగుచు మహాత్ము లిచటికి వచ్చిరి. ఏ దుర్మార్గుఁడో వీరిని మోసగించెనని తోఁచుచున్నది. మీరు త్వరగా వెళ్ళుఁడు. సాధువులతోఁ గపట మొనర్చుట మంచిదికాదు. వారిని భ్రమలో నుంచుట మనకి మిక్కిలి యనిష్టము కలుగఁగలదు. మీరు వారికి మీ యథార్థ స్థితినిఁజెప్పి వారిని క్షమాపణ వేఁడవలయును."

అజామిళుడు త్వర త్వరగాఁ జేతులు, కాళ్ళను గడుగుకొనెను. గుడ్డలు మార్చుకొని యాతడు చేతులు జోడించుకొనుచు బయటికివచ్చెను. ఇద్దరు ముగ్గురు పిల్లలును గుతూహల వశమున నాతని వెంటఁ బడిరి. పెళ్ళఁగానే అతడు మహంతుని పాదములు పట్టుకొనెను. వెంబడి పిల్ల లున్న యా వృద్ధునిఁ గాంచి మహంతు నవ్వి, మిక్కిలి ప్రేమతో నిట్ల నెను :— "తమ్ము, రమ్ము భక్తవర్యా! నీ పేరే కాదూ భక్త అజామిళుఁడు."

చేతులు జోడించుకొని అత్యంత లజ్జా వివశుఁడై అజామిళుఁ డిట్లనెను :— "స్వామీ! ఎక్కడి భక్తుఁడను. నేనత్యంత నీచుడను పాపిని, దుష్టుఁడను. ఎవ్వరో మిమ్ములను మోసగించిరి."

మహంతు ఇట్లనెను :— "భక్తుల స్వభావ మిదియే. తమ్ముఁ దాము నీచులుగాఁ జెప్పుకొందురు. నిన్నుఁ గూర్చి మేమెక్కువగా విని యుంటిమి.

అత్యంత లజ్జతో అజామిళుఁ డిట్లనెను :— "ప్రభూ ! అట్టిది గాదు. నేను యథార్థముగఁ బాపిని. నేను బ్రాహ్మణ వంశములోనే పుట్టితిని గాని నేను బొత్తుగా బ్రాహ్మణత్వ కర్మ విహీనుఁడను. నేను వేశ్యాపతిని; హింసకుఁడను. దొంగతనముచేసి, జనులను జంపి దోచుకొని నా పొట్టను బోసికొను చున్నాను. ఇతరులకైన దాఁచి యుండెడి వాఁడను, మహాత్ములవద్ద దాఁచు టెందులకు ? దాఁచెదమన్నను వారు త్రికాలజ్ఞులుగ నుందురు, వారన్నియును దెలిసికొనఁ గలరు."

ఎవఁడో యెగతాళిగాఁ జెప్పినాఁడని యిప్పుడా మహాత్ముఁడు రహస్యమును గ్రహించెను, అతఁ డిట్లనుకొనెను :- "శ్రీమన్నారాయణుని యిష్టము. అతని యిష్టము లేకుండ నేమియును జరుగదు. ఇందులోను గొంచెముగనో గొప్పగనో అతని లీల లేకపోలేదు. భగవంతుని సింహాసన మమర్పఁ బడినది. పూజకుఁ గావలసిన వన్నియు సిద్ధము చేయఁబడెను. ఇప్పుడు రాత్రియం దెచ్చటికి వెళ్ళెదరు ?"

"వసుధ యంతయు వేణుగోపాల మయము
దీనికిని మన కింక సందేహమేల ?
మనసులో సందియంబున్న మాధవునకు
సందియఁ బుండు అచటికి సాగిరాఁడు."

మహాత్ముఁ డిట్లనెను :- "మంచిది నాయనా ! జంతవఱకు భక్తుఁడవు కాకపోవచ్చును. ఇప్పుడు భగవత్కృపచేఁ గాఁగలవు."

మహాత్ముని నోట నిట్టి మాటను వినఁగానే అతఁడతి హర్షమును జెందెను. ఆతఁ డత్యంతా నందమును బ్రకటించుచు నిట్లనెను :— "ప్రభూ ! ఆజ్ఞయగుచో భగవత్ప్రసాదము కొఱకు కొద్దిగ ఫలమూలము

లను ఇతర పదార్థములను గొనివచ్చెదను." మహాత్ముఁడు కొంచెము సేపాలోచించి యిట్లనెను :- "మంచిదయ్యా! నీ భక్తి శ్రద్ధలకొలది అజామిళునకు నిధి యబ్బినట్లుండెను. అతని యన్నమును నేఁడు సాధువులు స్వీకరించెదరు. నేఁడాతని యన్నము భగవంతునకు వినియోగింపబడును. ఆ ఆలోచన రాఁగానే అతని శరీరమంతయును రోమాంచమయ్యెను. అతఁడు పరువిడి యింటిలోనికిఁ బోయి, తన భార్యతో నిట్లనెను :- "ఏమే! నేఁడు మన భాగ్యము కూడ బండినది. సాధువులు పతితుల సేవనుగూడ గ్రహించెదరు."



ఇచ్చట అజామిళుఁడు వెళ్ళిన తర్వాత కొందఱు సాధువులు మహాత్మునితో నిట్లనిరి :- "స్వామీ! మీరిట్టి [illegible], వేశ్యాపతి హింసకుఁడు, దురాచారుఁడు నగు వీని యన్నమును గ్రహించుట కేల యంగీకరించితిరి? శాస్త్రములలో నిట్టివాని యన్న మత్యంత దూషితమనియుఁ ద్యాజ్యమనియుఁ జెప్పఁబడినది."



అంత గంభీరుఁడై యా వృద్ధాచార్యుఁ డిట్లనెను :- "శాస్త్రములలో సామాన్య వచనమట్లే యున్నది, వృషలీపతి, శూద్రుఁడు హింసకుడు, పాపి, అబద్ధపు సాక్ష్యములు చెప్పువాఁడు, వేశ్య, వైద్యపాతకి, ఉపపాతకి మొదలగువారి యన్నమును దినరాదనుట నిజమే. మిక్కిలి శ్రద్ధాభక్తులతో ఫలమూలములను పచ్చి వస్తువులను దెచ్చియిచ్చువో, వారి శ్రద్ధావిశేషముచే వానిని గ్రహించుటలో దోషము లేదనియు విశేష వచనము శాస్త్రములలో లభించుచున్నది. కొందఱు ఆచార్యుల మతమేమనఁగా - కులీన బ్రాహ్మణుఁడై, శ్రద్ధతో నన్నము నొసంగినను. అత్యంత శ్రద్ధతోఁ దెచ్చి యిచ్చినచో వీరిద్దరి యన్నము సరిసమానమే. కులీనతను

బట్టియు, వర్ణశ్రేష్ఠతను బట్టియు శుద్ధమేకాని అశ్రద్ధచే నొసంగిన హేయ మగుచున్నది. దానికి విపరీతముగా హీనస, పాపము కారణమున త్యాజ్యమైనను శ్రద్ధా విశేషముచే గ్రహణీయ మగుచున్నది. కాని కొందఱాచార్యు లిట్లనిరి:- "అశ్రద్ధచే నొసంగఁబడిన శ్రోత్రియ బ్రాహ్మణాన్నము అధమము. అత్యంత శ్రద్ధతో నొసంగఁబడిన సధర్ముని అన్నము ఉత్తమము. ఉత్తమతా అధమతలకు శ్రద్ధయే ప్రధాన కారణము. నాయనా! శుష్కాన్నము, శ్రద్ధతో వండి ప్రభువునకు నివేదన చేసినది అమృతోపమ నైవేద్యము కాఁగలదు. దానిలోఁగల సమస్తదోషములు నశించిపోవును. ప్రభుపీతని యింటికి పంపినాఁడు. అతని యాతిధ్యమును గ్రహింపకపోవుట పాపము, అపరాధము, అతని కన్యాయము చేసినట్లే. అతనికి మానసిక క్లేశమును గలిగించుటయే. అతని శ్రద్ధకు కుఠారాఘాత మొనర్చుటయే.

మహంతు ఈ విధముగ మాటలాడుచుండఁగనే మిక్కిలిగ శుష్క సామానును దీసికొని అజామిళుఁడు వచ్చెను. బియ్యము, పప్పు, ఉప్పు, నేయి, కూరలు, కందమూలాది ఫలములు నాతఁడు ప్రవేశపెట్టెను సాధువులు మిక్కిలి శుద్ధముగ జగన్నాథునకు వంట చేసిరి. అజామిళుఁడు మెదలకఁ గూర్చుండి యుండెను.

నేఁడు సాదు సంగతిచే నాతనికి తన జీవన స్మృతి వచ్చెను. "అయ్యో! ఒకానొక దినమున నేను నింత శుద్ధముగ నుంటిని. ఎచ్చట వాఁడ నెచ్చటికి వచ్చితిని, అతఁ డనేకుల దీనతతో నా మహాత్ములతో నట్లనెను:- "స్వామి! నాకుగూడ ఉద్ధారోపాయ మున్నదా గలదా? నా వలన భజన నెఱవేరదు. ఈ స్త్రీని నేను వదలఁజాలను. నే నీమెతో

గొపుర మెునర్ప్పవలసి యున్నది. వీరు తొమ్మిదిమంది పిల్లలు. నా వీర్య మున నుద్భవించిరి. నాకుఁ జేతనైనట్లు వీరినిఁ బోషింపవలయును. నే నేదైనను జేయఁగల నుపాయమును వచింపుడు."

మహాత్ముఁ డిట్లు తలఁచెను :- "ఇది చాల చిక్కు సమస్య. వేశ్యను వదలఁ దలఁపులేదు. పిల్లలను బోషింపఁ దలంచుచున్నాడు. భజన చేయలేననుచున్నాడు. ఏమి ఉపాయమును జెప్పఁగలను. శరణా గతునిఁ దిరస్కరింపఁ గూడదు. ఈ విధముగ నాలోచించి యిట్లనెను :- "మంచిది, నీ కెందఱు పిల్లలు ."

ఆతఁ డిట్లనెను :- "స్వామీ ! తొమ్మండుగురు"

మహాత్ముఁ డిట్లనెను :- "సరే, ఇంతేనా, ఇంకేమైన నున్నారా ?

సిగ్గుతో నజామిళుఁ డిట్లనెను :- "అవును స్వామీ ! ఇంకను గొలఁది దినములలో నింకొక బిడ్డ కలుగఁగలదు.

మహాత్ముఁ డాలోచించి యిట్లనెను :- "మీ యీ పిల్లల పేరు లేమి ?"

అజామిళుఁ డిట్లనెను :- "స్వామీ ! పేరేమి యున్నది? పురో హితుఁడు మా నీడనైనఁ ద్రొక్కఁడు. ఈ పిల్లల తల్లియే వీరికి పేర్లు పెట్టినది. మొదటివాని పేరు పిచ్చాయి, రెండవవాని పేరు పుల్లాయి, మూఁడవవాని పేరు రోశాయి, నాల్గవవాని పేరు రాశాయి, అయిదవవాని పేరు నల్లోడు, ఆఱవవాని పేరు తెల్లోడు, ఏడవవాని పేరు కన్నయ్య, యెనిమిదవవాని పేరు చిన్నయ్య, తొమ్మిదవవాని పేరు బుల్లెయ్య."

ఇది విని మహాత్ముఁడు నవ్వి యిట్లనెను :- "నీ భార్య చాల మంచిపేర్లు పెట్టినదయ్యా. ఇప్పుడొక పని చేయవలెను. ఇప్పుడు పుట్ట

బోవు పిల్లవానికి 'నారాయణ' యను పేరు పెట్టవలెను. "చూడుము, ఏమగుననగా భగవానునకుఁ దన పేరుపైఁ బ్రీతి యున్నచో నేదో చేయఁ గలడు."

ఇది వినఁగానే అజామిళుఁడు చాల సంతోషించెను. పరుపెత్తుకొని యింటిలోనికి బోయి భార్యతో నిట్లనెను :- "విన్నావటే, ఇప్పుడు పుట్ట బోవు పిల్లవానికి 'నారాయణ' యను పేరును బెట్టవలెను. ఇది సాధు మహాత్ముని అజ్ఞ, నారాయణ నారాయణ ఎంత మనోహర నామము! మఱచిపోవలదు. ఇప్పటి వారివలె రోశాయి కాశాయి అని పిలువవలదు. పుట్టగానే నారాయణ నారాయణయని పిలువవలెను."

భార్య యిట్లనెను :- "మంచిదే. ఇంతవఱకు పేరుపెట్టిన వారే లేరు. మన నోటికేమి వచ్చిన నట్లె పిలుచుచుంటిమి. ఇప్పుడు సాధు భగవానుఁడు పుట్టకముందే పేరు పెట్టినాఁడు. ఇఁక నేనట్లె చేసెదను." దీనివలన నిద్దరకును మిక్కిలి సంతోషమయ్యెను. సాధువుల వంట తయారయ్యెను. భగవంతునకు నైవేద్యమైన మీఁదట హారతి గంటను గొట్టఁగానే అజామిళుఁడు పిల్లలతో నచ్చటికిఁ జేరెను. అజామిళుని భార్యయు శరీరమునంతను వస్త్రముతోఁ గప్పుకొని దూరముగ నిలుచుండెను. దూరమున నుండియే భూమిపై శిరస్సునానించి ఆమె సాధువులకు బ్రణామము కావించెను. ఆమె మీఁదను మహాత్ముని దయాదృష్టి పడెను.

భగవంతునకు నైవేద్యమైన తర్వాత మహాత్ముఁ డిట్లనెను :— "అజామిళా! నీవు పిల్లలకొఱకు కొంచెముగ భగవత్ప్రసాదమును గొని పొమ్ము."

**చేతులు జోడించుకొని అజామిళుఁ డిట్లనెను :- "స్వామీ!**

మీరందఱును ప్రసాదమును గైకొనుఁడు. మిగిలిన ఉచ్ఛిష్టమును గైకొనుటకు మేమందఱ మధికారులమే."

మహాత్ముఁ డిట్లనెను :- "మంచిదేనయ్యా. సరియే హరిహర సాధువులు పంక్తిలోఁ గూర్చుండిరి.

ఇంకేమున్నది ? వారి వారి పాత్రలను గైకొని మహాత్ములు కూర్చుండిరి. అంత నిట్లు సంకీర్తనము సాగెను.

"శ్రీహరి నారాయణ గోవిందే భజ రామా కృష్ణా గోవిందేపురీ అయోధ్యా సరయూ తీరను శ్రీరఘు వీరుడుండే నగరము శ్రీహరి నారాయణ గోవిందేభజ రామా కృష్ణా గోవిందే గోవింద గోవింద యను పలుకండీ, ప్రేమ పదార్థము పొందండీ శ్రీహరి నారాయణ గోవిందే భజ రామా కృష్ణా గోవిందే" అందఱ ఆఁకులలోను ప్రసాదము వడ్డింపబడెను. అప్పుడు జయజయ ధ్వనులు చలరేగెను. నాలుగు ధామములకును, సప్త మోక్షపురములకును. ఆది అన్నదాతకును జయధ్వానము లొనర్చిరి. ఇట్లు జయధ్వనులు కొట్టిన తర్వాత హరిహర శబ్దము నుచ్చరించిరి. అందఱును ప్రసాదమును బొందిరి. అజామిళుఁడిది యంతయును జూచుచుండెను. సుమధుర భగవన్నామ కీర్తనమును వినుచుండెను.

మహాత్ము లందఱును ప్రసాదమును బొందగానే సాధువు లెవరును విస్తళ్లెత్తఁగూడదని ప్రార్థించెను. అతని దీనతను గాంచఁగానే సాధువుల హృదయములలో దయ యుదయించెను. ఎవ్వరును ఆకులెత్తలేదు అందఱును లేచిన తర్వాత నాతఁడాకులన్నిటి నెత్తెను. వడ్డించినవారును, వండినవారును తమకు యోగ్యమగు ప్రసాదము నుంచుకొని, మిగిలిన దంతయు నాతని కొసంగిరి. నేఁడు భగవత్ప్రసాదమును గైకొని లోప

లికిఁ బోయెను. ఇంటిలోని వారందఱును నేఁడు రఘుపతిచే భగవత్ప్రసాదమును గైకొనిరి. ఇట్టి పదార్థమీ భాగహీనులగు విషయ లంపటులగు గృహస్థుల కెక్కడిది? వీరు పాపపు ధనమును సంపాదించెదరు. వండుచున్నప్పుడు దుష్టభావనలు కలిగియుందురు. భగవన్నివేదనము లేక, బలివైశ్వదేవ మొనర్పక మెక్కుచుందురు. ప్రాయిక్యముంచు కూర్చుండియే తినుచుందురు. ఆ యెంగిలి చేతులతోడనే పాత్రలను దాఁకుచుంచుందురు, వారు భోజనము చేయునదేమిటి? మూర్తిమంతమగు పాపమునే భుజించుచున్నారు. మంజరీ సహిత పచ్చని తులసీదళ యుక్తమగు భగవన్నైవేద్యమును స్వీకరించి అందఱియొక్క అంతరాత్మ తృప్తియయ్యెను. వారి నెత్తుకొనఁ జాలనంతగాఁ బిల్లలు తినిరి. అచ్చటనే నిద్రించిరి.

ప్రాతః కాలమయ్యెను. సాధువులు దండ కమండలవులును గ్రహించి వెళ్లుట కుద్యుక్తులైరి. అజామిలుఁడు వారినిఁ బంపుటకు చాల దూరము వఱకు వెళ్ళిరి. సాధువులు చాల బలవంతము చేయఁగా నాతఁడు ప్రణామము కావించి తిరిగివచ్చెను, తన కాత్మీయుల వియోగము చెందినట్లాతఁడు భావించెను.

సూతుఁ డిట్లనెను :- "మునులారా! సాధు పాదములందు భక్తి కలుగునంత వఱకే యీ సంసార బంధనము. సాధువుల ప్రీతి యనురాగములు కలిగెనా యీ సంసారము విలీనమైపోవును. ఏః క్షణకాల సత్సంగమువనే పాపియగు నజామిళునకు ఉద్ధారము కలిగేను.

అల్ప కాలమునకే అజామిళుని వేశ్యా భార్య పదవ పుత్రునిఁ, గనెను. పుట్టగానే అజామిళుఁ డాతనికి నారాయణుఁడను పేరు బెట్టెను.

వృద్ధాప్యమున సంతానము కలిగెనా అతనికి స్వాభావికముగ నధికమోహ ముండును. ఇంకొక నియమ మేమనఁగా నందఱికంటె జిన్న సంతానము మీఁద తలిదండ్రుల కత్యధికానురాగ ముండును. ఈ పిల్లవాని కొఱకు ప్రతీక్షయు బాగుగా జరిగెను. సాధువు లీతని జన్మమునకు ముందే నామ సంస్కారము కావించిరి. కావున నజామిళునకు ప్రేమ యంతయును నీతనిమీఁదనే కేంద్రీభూతమయ్యెను. ఈ వేశ్యమీఁద నిదివఱ కెంతటి ప్రేమయుండెచో అట్టి ప్రేమయే యీ నారాయణ పుత్రునందుండెను. తినుచున్నను, త్రాగుచున్నను, కూర్చుండినను నిలుచుండినను నా నారా యణుని దగ్గఱ నుంచుకొనెడువాఁడు.

## పుత్ర మిషచే నారాయణ నామ కీర్తనము

## 357

శ్లో॥ స బద్ధహృదయ స్తస్మిన్నర్భకే కలభాషిణి ॥
నిరీక్షమాణ స్తల్లీలాం ముముదే జరఠో భృశమ్॥
భుంజానః ప్రపిబన్ ఖాదన్ బాలకస్నేహ యంత్రితః ॥
భోజయన్పాయయన్మూఢో న వేదాగతమన్తకమ్ ॥

శ్రీ భాగ. ౬ స్కం. ౧ అ. ౨౫. ౨౬. శ్లో.

ఈ మనస్సు స్థిరముగనుండదు. ఏదో ఒక వస్తువుమీఁద నిలువదు పసిపిల్లవాడెదుట నున్న మెఱుగు వస్తువును దీసికొనుటకుఁ బరువిడును. దానినిఁబొంది మరల నింకొక వస్తువు కావలెననును. ఈ మనస్సు కూడ ఊసరవిల్లివలె రంగులు మార్చుచుండును. బాల్యకాలమున వీఁడు తల్లిని ప్రేమించును. తల్లి నివీడి యెచ్చటికిని బోఁడు, అచ్చటనే సుఖానుభవమును జెందును. కొంచెము పెద్దకాఁగానే సహవాసగాండ్ర మీఁదను, ఆటపాటలు, ఆటవస్తువులందును ప్రేమ కలుగును. పగలంతయును ఆటలయందే సుఖమనుభవించును. ఆటలకొఱకు భోజన విశ్రాంతములను గూడ మఱచును. అంతకంటెఁ గొంచెము పెద్దకాఁగానే పుస్తక ప్రేమ కలుగును. దీపమును వెలిగించుకొని రాత్రి యంతయును జదువుచునే యుండును. అప్పుడింటిలోని వారు "వలదు, ఇంతగాఁ జదువఁగూడదయ్యా, ఆరోగ్యము చెడిపోవునన్నను వినఁడు. కిశోరావస్థ దాఁటఁగానే యువావస్థలోఁ బ్రవేశించును. అప్పుడు కన్నులకు మదమెక్కును. అప్పుడు పెద్దమ్మ నెత్తికెక్కును. అప్పుడొకతె యేర్పడును. అది యెట్లాడించిన నటాడును. కూర్చుండుమనినఁ గూర్చుండును. నిలుచుండుమనిన నిలుచుండును, నిద్ర పొమ్మనిన నిద్రించును, అది యేమి చేయించిన దానినిఁ జేయును. ఆమె కన్నులయెదుట లేకున్నఁ గష్టముగఁ దోఁచును. ఇఁకబిల్లలు పుట్టఁగానే మాయామోహమంతయు నాతనియందే యేకత్రితము కాఁగలదు. మెలమెల్లఁగా వృద్ధావస్థ కాలిడును. నల్లని ముఖము తెల్లఁబడఁజొచ్చును. మెడ అల్లాడఁజొచ్చును ఇంతవఱకు విషయ భోగమెంతో చేసియున్నావు. ఇఁక చాలులేయన్నట్లు ఒక్కొక్కదంతమే నమస్కారమొనర్చుచు శలవు గైకొనుచుండును. బోసినోరగును. కన్నులలోని చూపు తగ్గిపోవును. ఇంద్రియము లన్నిటి శక్తి

క్షీణించిపోవును. కాని యీ వృద్ధావస్థలో నొక్క తృష్ణయే తరుణావస్థలో నుండును. కోరికలతో నుండు వృద్ధాప్యములోఁ దృష్ణ యెక్కువగ నుండును.

శుకదేవుఁ డిట్లనెను :– "రాజా ! ఇప్పుడా వృద్ధుడగు నజామిళుని స్నేహమంతయును నారాయణపుత్రుని మీఁదకువచ్చి ఘనీభూతమయ్యెను చిన్నవాడు అతి సుందరుడు. విశాల మస్తకమందు వ్రేలాడుచుండిన ముంగురులు వ్రేలాడుచుండ, అతడు కిలకిల నవ్వుచుఁ దండ్రి వడిలోనికి బరువిడుచో నజామిళుని రోమరోమము నిక్కబొడుచుచుండెను. అతనిని గట్టిగా గౌగిలించుకొనును. మాటిమాటికిని ముఖమును ముద్దుపెట్టుకొనుచు జోలపాటలు పాడుచు నిట్లనుచుండెను :– "నా తండ్రీ నారాయణ – నారాయణ – నారాయణ – నా కన్నతండ్రీ ! నారాయణ నారాయణ నారాయణ నారాయణ. భోజనమునకుఁ గూర్చుండునపుడు "రా నారాయణా ఇటురా బువ్వతిను" అనును. ఒక ముద్ద అతనికిఁబెట్టి ఒకముద్దను దాను దినును. నీరు త్రాగవలసి వచ్చినవో నిట్లనును :– "రారా నారాయణ ! అప్పత్రాగుము." అతని వ్రేలుపట్టుకొని నడుచుట నేర్పుచో నిట్లనును:– "నారాయణా ! కాలుపెట్టు, ముందుకు వేయుము కాలు. మేల్కొనిన వడిలోనికి దీసికొని వాని ముఖమును ముద్దు బెట్టుకొనును. "నా నారాయణా! నీకు నిద్రవచ్చినదఁటరా ?" మేల్కొనిన నారాయణ నారాయణ యనును. మేలుకో నారాయణ ! నా వడిలోనికి రా." తన భార్యతో నిట్లనును :— "ఏమే ? వినుచున్నావా ? నారాయణుని ముఖమును గడుగుము. చలిది అన్నమును బెట్టుము." ఈ విధముగ రాజా ! లేచినను, గూర్చుండినను

నిద్ర పోవుచున్నను, మేల్కొన్నను, అతఁడు నిరంతరము నారాయణ నామమును గీర్తించుచుండెను.

అంత శౌనకుఁ డిట్లనెను :- "సూతా! నీవేటి మాటలు పలుకు చున్నావు? అతడు నారాయణ నామము నెక్కడ కీర్తించుచున్నాడు. అతడు తన పుత్రుడగు నారాయణుని నామమును బలుకుచున్నాడు. నీవు దానిని నామకీర్తనమని యేలననుచున్నావు?"

సూతుఁ డిట్లనెను :- "మహాభాగా! ఎట్లైనను గానిండు భగవంతుని యుద్దేశ్యము తోడనే నామమును బలుకుచుండెను. భగవంతుని నామముకూడా నారాయణ నామమే. ఒకచోట రఘునందనుడను పేరుగల వారిద్దరుండిరి. ఒకానొక్కఁ డింకొక రఘునందనుడని పిలుచుచుండెను. ఏ రఘునందనునైనఁ బిలుచుఁగాక యిద్దరును జెవులను నిక్కఁబొడుచు కొందురు, ఇద్దరును బిలుచువానివైపు చూచుచుందురు."

అంత శౌనకుఁ డిట్లనెను :- "సూతా! ఇది భ్రమవలనఁ గలుగు చుండును. భగవంతుడు సర్వాంతర్యామి. అతనికి భ్రమ యుండదు. ఆతడు నారాయణ యని తన పుత్రు ననుచున్నాడు గాని తనను గాదని ఆతనికిఁ దెలియును."

సూతుఁ డిట్లనెను :- "స్వామీ! భగవంతుని సర్వాంతర్యామిత్వ మున నాకును సందేహము లేదు. నేనిచ్చట నామమాహాత్మ్యమును గూర్చి చెప్పుచున్నాను. భగవన్నామమును దెలిసిగాని తెలియకగాని, అన్యాపదేశ మునఁగాని, ఇతరులు పలికినప్పుడుగాని, తన యుద్దేశ్యముచేఁగాని, యిత రుల యుద్దేశ్యముచేఁగాని, ప్రేమతోఁ గానిండు, బుజ్జగింపుగాఁ గానిండు, వైరము చేతను, పోట్లాటలోను, ద్వేషము చేతను, కామము చేతను,

క్రోధముచేతను, మోహముచేతను నేవిధముగనైనను సరియే అది మేలే చేయఁగలిగిన శక్తి గలిగియుండును. శాస్త్రకారుల యొక్క వాక్యములను బట్టి భగవన్నామము భగవంతుని కంటె నధిక శక్తి కలిగియుండును. నామము స్వయముగ చైతన్యధనము. అది జడముకాదు. అగ్నికణమును నింటిమీఁద నిడి దీనినిఁ దగులబెట్టుగాక యని పడవైచినను, పిల్లలట్టి సంకల్పములేక పడవైచినను తప్పు తగులబడి పోఁగలదు. భగవన్నామ మెన్నటికిని అన్యనామములవలె నిరర్థకము కాదు. అది అమోఘమైనది. తన ప్రభావము నది చూపించితీరును. కలగండను పగలు తిన్నను అది దీపియే, రాత్రి తిన్నను దీపియే, వెలుఁగులో దిన్నను దీపియే, చీకటిలో దిన్నను దీపియే."

అంత శౌనకుఁ డిట్లనెను :- "కాదు సూతా! అట్లుకాదు. పైత్య రోగి కలకండను వెలుఁగులో తిన్నను, చీకటిలోఁ దిన్నను వారికి నోటి తీపి యుండదు."

ఇదివిని సూతుఁ డిట్లనెను :- స్వామీ! మీరేటి మాటలు మాట లాడుచున్నారు. కలకండ తీపిపోలేదు. రోగము వలన జిహ్వాస్వాదము పోయినది. అచ్చటనైనను కలకండనుదినుట వ్యర్థముకాదు. ఆయుర్వేద ములోఁ బిత్తశమ నౌషధమొక్క కలకండయే. ఒక్కొక్క పలుకును దినుచుండినచోఁ దీపిగానుండ కున్నను నౌషధ రూపమున సేవించుటచే రోగమును బోవును, కలకండ తీపియు ననుభవమునకు వచ్చును. దానిని సేవించుట వ్యర్థము కాఁజాలదు. అదే విధముగ పూర్వజన్మ పాపకారణ ముగ భగవన్నామముపై ననురాగము లేకున్నను. బాగుండకున్నను వానిని బలవంతముగ నామ సంకీర్తన మందు నియుక్తుల నొనరింపవల

యును. అనిచ్ఛతో నామ సంకీర్తన మొనరించినను వాని పాపములు నశించును. పాపములు నశించుటచే నంతఃకరణము శుద్ధము కాఁగలదు. శుద్ధాంతఃకరణము వలన భగవన్నామము లందనురాగము వృద్ధియగును. మీరు నామికిని నామమునకును భేదము నెంచరాదు. నామిలో నేమి శక్తి కలదో నామములోను నదియే శక్తికలదు. అంతేకాదు. నామికి మించిన శక్తి నామములోఁగలదు. ఒకానొక రాజునకు నల్దిశల గొప్పపేరు కలదు. జనులాతని నామమును విని గడగడ వణఁకుదురు నది కడకుఁబోయి, నేను ఫలాని రాజు యొక్క కర్మచారిననఁగా నాతఁడూరక నదిని దాటించును. డబ్బడుగఁడు, రాజు స్వయముగ వేషమును మార్చుకొని పడవ నడుపువానితోఁ దనను దాటింపుమనుచో 'డబ్బిచ్చుచో దాటించెదను లేకున్న దారి పట్టుఁడనును' రాజనేక విధముల ననునయ వినయము లొనర్చును: కాని వారికి దయ యెచ్చటిది? ఎవఁడైనఁ గర్మచారి వచ్చి యెవనిచెవిలో నైన రాజుపేరు చెప్పినచో నామమునువినఁగానే అందటను బయవిడివచ్చి కొందరు పాదములమీఁద బడుదురు, కొందరు నౌకను దీసికొనివచ్చెదరు, కొందర ఆసనమును బఱచెదరు. ఇప్పుడు చూడుడు నామియగు రాజెదుటనే నిలిచియున్నాడు. అతని మాటను వినినవారే లేరు. నామమును వినగానే అతని మహత్వ మధికమైనది. నామిని నామమే ప్రకాశింపఁ జేయును."

అంత శౌనకుఁడిట్లనెను :- సూతా! తర్వాత నేమైనది ?"

సూతు డిట్లనెను :- "మునివరా! మా గురుదేవుడు పరీక్షిత్తునకు గథను వినిపించుచుండెను : "రాజా! ఈ విధముగ నా వృద్ధులగు నజామిళుడును, వేశ్యయు నారాయణుఁడను పిల్లవానియందు మనస్సును

లగ్నమొనర్చిరి. అజామిళుఁడా పిల్లవాని మోహమందు దన్మయుఁ డయ్యెను. ఈ విధమగు లాలన, పాలనము ప్రేమ వ్యవహారమందుం డిన యా యజ్ఞాని తనకు మృత్యువాసన్నమైనను నాతనినుండి మనస్సును దొలిగింపఁ జాలకపోయెను. అతఁడన్నిటిని మఱచినాడు కాని నారాయణ నామమాతని జిహ్వా యందుండెను.

కాలగతి దుర్నివారము. మృత్యువెప్పుడు సంభవించునో యెవ్వరి కినిఁ దెలియదు. అజామిళుని నారాయణుఁ డిప్పటికి నాలుగేండ్లవాఁడైనగా లేదు; అప్పుడే అజామిళునకు మృత్యు వాసన్నమయ్యెను. జీవితమం తయుఁ బాపమునే చేసినాడు. అతడు చేసిన హింసల కంతులేదు. తలి దండ్రులను, నిరపరాధియగు సతీ, సాధ్వి, కులీన వంశ ప్రసూతయగు పత్నినిఁ బాపమతియై పరిత్యాగము కావించెను. ఈ పాపము లన్నిటి కారణమున జేతులలో గట్టి భుసుండ పాశములను, గదలను బట్టుకొని యమదూత లజామిళుని బంధించుటకు వచ్చిరి. వారి నిక్కబొడిచిన యెఱ్ఱని భయానకములగు వెండ్రుకలు, భయంకరమగు నల్లని ముఖము, తీక్ష్ణగడ్డము, శ్యామవర్ణము కలిగిన బండపెదవులు, పర్వత కందరముల వలె భయంకర ముఖము, గుండ్రని యెఱ్ఱగ మెఱయుచున్న కన్నులును గలిగియుండిరి, నల్లని పెద్దపెద్ద పర్వత శిఖరములవలె నుండిరి. లెక్కకు వారు ముగ్గురు. వారివి సూక్ష్మ శరీరములు. ఆకాశమందుఁ బ్రత్యక్షముగ దంతములను పటపటఁ గొరుకుచుఁ గ్రోధముతోఁ గనబడుచుండిరి. బండ పెదవులను నాలుకతో నాకుచు వక్రదృష్టితో నజామిళునిఁ జూచుచుండిరి. వారు దగ్గరనున్న అజామిళుని అంగుష్ఠ మాత్రమగు సూక్ష్మ శరీరమును బంధించి తీసికొని పోవుచుండ భయమున దగ్గఱనే ఆడుకొనుచుండిన

తన పుత్రుని నామమును అజామిళుఁడతి దీనభావమున "నారాయణ ! నారాయణ ! రా ! రా ! !" యని కేకవేసెను.

"రాజా ! వాసుదేవ భగవానునకుఁ జాలపంది శంఖ, చక్ర, గదా, పద్మధారులగు పార్షదులు సదా బ్రహ్మాండమందు భగవద్భక్తులగు వైష్ణవుల కేవిధమగు గష్టములు రాకుండఁ జేయవలయునని తిరుగుచుందురను సంగతి నీకు తెలియునుగదా ! తమ స్వామి నామమును మరణ కాలమునఁ గీర్తించువానిని యమదూతలు పట్టుకొని పోవుచున్నారను సంగతినిఁ దెలిసికొని, యిఁక నుండజాలకపోయిరి. మాంసముపై గ్రద్దలును, చిన్న పక్షులపై డేగలు దుముకునట్లు వారు యమదూతలపైబడిరి. వెళ్ళఁగానే వారు గదలతోఁ గొట్టిరి. అంతవారు నాల్గువైపులను దెబ్బలు తిని పడియుండిరి. శ్వాసలు నడచుచున్నవికాని మిగిలిన దుర్గతియంతయు వారికి జరిగినది.

అంత శౌనకుఁ డిట్లనెను :- "సూతా : నీవు సాంసారిక అజ్ఞానులవలెఁ బక్షపాత పూర్ణమగు పలుకులు పలుకుచున్నావు. నామ మాహాత్మ్యమును గూర్చి నీవు చెప్పుచున్నావు. మా కిష్టమే. మరణకాలము నామమును గ్రహించినచో అట్టివానికి మేలే కలుగఁగలదనుట నిజమేకాని ఇదేమిటి ? పిలుచుచున్న దాతని కుమారుని మధ్యలో విష్ణుపార్షదులు వచ్చి సతాయించుచున్నారు, ఆతడు తమ ప్రభువును గీర్తించుట లేదు. మోహాసక్తిచేత తన కొడుకగు నారాయణ నామమును బలుకుచున్నసంగతి సర్వజ్ఞులగు విష్ణుపార్షదులకుఁ దెలియదా ?"

అంత సూతుఁడు గంభీరముగ నిట్లనెను :- "స్వామీ ! మీ రీ విషయమున గంభీరముగ విచారించుడు. అప్పుడు మీకు దీని రహస్యము

తెలియఁగలదు. ఒక కుక్క గలదు. అది ఎచ్చట నుండియో ఆఁకలి దప్పులనుజెంది సమర్థుడగు శ్రీమంతుని ద్వారముకడకు వచ్చెను. దయా వశమున స్వామి సేవకులు దానికి కొంచెము తినుటకుఁ బెట్టిరి. కడుపు నిండ తిండిని దిని కుక్క అచ్చటనే పడియుండెను. రెండవ దినము నను నచ్చటనే పడియుండెను. అప్పుడు వారెంగటిఁ కూడును పాసిన కూడును వేసిరి. నౌకరులు దానిని మూఁడు నాలుగుసార్లు కొట్టిరి. కాని అది పోవక అచ్చటనే పడియుండెను. ఒకానొకడు దయావశమున నిట్ల నెను :- "ఏమయ్యా! నీదేమి పోయినది ? ఎంగిలి కూడేదైన నుండిన బడవేయుము, కొట్టెదవెందులకు ? పడియుండనిమ్ము. కుక్క పడియుం డెను. గృహ యజమాని యెప్పుడైనను బయటకు వచ్చుటను గాంచిన గుక్క తోఁక నాడించును. యజమాని వెడలిపోవును. అతడు దీనినిఁ బెంచములేదు, దీనివైపు అతనికి ధ్యానమేలేదు. ఎప్పుడైనను దృష్టిపడిన నౌకరులతో నిట్లనును :- "ఈ కుక్కకు గూడ నేదైనను వేయుచుం డుఁడు." ఈ విధముగ దానికా యింటికడఁ జక్కగా గడుపు నిండు నిండుచుండెను.

ఒక దినమున నా కుక్క యింకొక బజారునకు బోయెను. అచ్చట నది ఒకని పాలకుండలో దాని ముఖమును బెట్టెను. అతడు దానిని బాగుగాఁ గొట్టెను. దైవికముగ నటుగుండ నా శ్రీమంతుని ఇద్దరు సిపా యీలు వెళ్లుచుండిరి. ఆ మనుష్యులు తమ కుక్కను బాదుచుండుటను గాంచి వారితోఁ లొరాడుట కుద్యుక్తుఁడయ్యెను. ఆ మనుష్యుడిట్లనెను :- "నీవు గొప్పకుక్కను గలవాఁడవైనావే ? ఇది మాకెంతటి యపరాధము నొనర్చినది. పాలను నపవిత్రము కావించినది" సమర్థుడగు శ్రీమంతుని

సిపాయిూలా, అయన లెక్కయ లేదు. నాలుగు నాణెములను వ్రిపుచేసి కొన్నాడు. జనులు వెళ్ళి శ్రీమంతునితో నిట్లు చెప్పిరి :- "మీ సిపాయీలతో పోట్లాట జరుగుచున్నది." ఆ సమర్థ శ్రీమంతుఁ డిట్లడిగెను :— "ఏమి యా విషయము ?"

జను లిట్లనిరి :— "అతడు మీ కుక్కను బాగుగాఁ గొట్టినాడు. దానిమీఁద పోట్లాట పెరిగినది."

శ్రీమంతుఁ డిట్లనెను :— "నాకేమియును కుక్కలేదు, నేను కుక్కను పెంచనేలేదు."

అంత నింకొక సేవకుఁ డిట్లనెను :— "శ్రీమంతులవారూ! ఇదివఱకు మనవాఁకిట కుక్కకలదే దానిని గూర్చి చెప్పుచున్నాము."

ఇది విని శ్రీమంతుఁడు గంభీరుఁ డయ్యెను. కుక్క ఆయనది కాకున్నను నేదో విధముగ నాతని పేరుతో దాని సంబంధము కుదిరినది. ఇష్టము లేకున్నను నందఱును దానిని శ్రీమంతుని కుక్కయని పిలువసాగిరి. ఇప్పుడాతని సేవకులు దానినిఁ దమదని పోరాడసాగిరి. దానిపక్షమున వారుండవలసి వచ్చెను. కుక్క విషయమువ నేమియు ననుకొనవలసిన పనిలేదు. కుక్కను అపరాధ మొనర్చినపుడు కొట్టుచునేయుందురు. పోట్లాట విషయములోఁ గూడ నేమియును లేదు. నౌకరులు పరస్పరము పోట్లాడుకొనుచునే యుందురు. ఇచ్చట నామము యొక్క ప్రశ్న యున్నది. "అయ్యో! ఇంత గొప్పవాని కుక్కను గొట్టగా మెదలక ఊరకొన్నాఁడేమని లోకులందురు. మనపేరు తగ్గిపోవును, పేరు పోవును, అపయశస్సు కలుగును. అందులకని అతఁడు తన నౌకరుల పక్షమును గైకొని, గద్దించి యిటనెను :— "మా కుక్కను గొట్టినవారెవరు? వానినిఁ బట్టుకొని రండు, ఖైదుకు పంపవలెను."

సూతుఁ డిట్లనెను :— మునివరా ! కొంచె మాలోచింపుఁడు. కుక్కను శ్రీమంతుఁడు పెంచనేలేదు, ఎప్పుడును దనదనలేదు. అది యితరుల కపరాధ మొనర్చినది. దానిని దండించుట యుపయుక్తమే; కాని సమర్థుని నామముతో సంబంధముండుటచే దాని యపరాధముపైపున కెవరి మనస్సును బోలేదు. అందఱును గొట్టినవారిని నానా చీవాట్లు పెట్టిరి. "ఇది చాల మూర్ఖవిషయము. ఇంత గొప్పవాని కుక్కను గొట్టుటయా ? పాలలో మూతిపెట్టిన నేమైనది ? అది కుక్కయైనను. దాని కంతటి యాలోచనయు, బుద్ధియును లేదు. దీనికొఱకని యీ విధముగఁ గొట్టుట ఉచితముకాదు. సిపాయిలు మంచిపనిచేసినారు. వానికి తగినశాస్తి చేసినారు. ఇప్పుడా ప్రాంతములోని వారెవరును గుక్కను గొట్టుటకు సాహసింపఁ జాలరు. అదే విధముగ శౌనకా ! పెద్దవారి పేరువలన వారు స్వీకరింపకున్నను మానవుఁడు చాల దుఃఖములనుండి బయటఁబడఁ గలడు. విష్ణు పార్షదులు సమర్థులను సంగతి అందఱకును దెలియును; కాని యాతఁ డిట్లనుకొనెను :— "మరణ కాలమున మా స్వామినిఁ దలఁచువారికి దుర్గతి గలిగినచో నామ మాహాత్మ్యము పోనే పోయినది. ఎట్లైనను గానిండు, ఏ భావముతో నామమును బలికినను నాతఁడు చతురక్షరములు కల దివ్య చిన్మయ ఆనంద ఘన రస విగ్రహమగు 'నారాయణ నామమును బలికినాఁడు. ఆతఁడు పాపియనియు, పాపమొనర్చినాడనియు మనకుఁ దెలియును కాని మరణ కాలమున నీ నామము పలికినవాని సమ్ముఖమునఁ బాపమెట్లుండఁ గలదు. ఒక మానవుడున్నాడు ఆతడు చాలసామాను నింటి నిండను బ్రోవుచేసెను. ఆతనికి విశ్రాంతినిఁగొనుటకును స్థానము లేకుండెను. మంచి వస్తువులను బెట్టుకొనుటకును ఖాళీ

స్థానములేకుండెను. ఇల్లు మంచిదే, గట్టిదే; కాని వ్యర్థమగు గడ్డిగాదము విఱిగిన పుల్లలు పడియున్నవి. విలువ గలిగిన యావశ్యక బదార్థములు బయట పడియున్నవి. అటు అతనికి మనస్సేలేదు. ఒకనాఁడాతడు పొగ చుట్టను ద్రాగుటకు నిప్పును వెలిగించెను. దైవికముగ నా యగ్ని యా గడ్డిగాదమున కంటుకొనెను. వ్యర్థ పదార్థము లన్నియును దగలఁబడి భస్మమయ్యెను. ఇతరులు చాల సంతసించిరి. దయావశమున గృహ మును ఱిమ్మి, నీటితోఁ గడిగెను. బహుమూల్య వస్తువులను బయటనుండి లోపల నుంచుకొనెను. ఇప్పుడది దరిద్రుని యిల్లుగానుండక శ్రీమంతుని గృహమువలె నయ్యెను. అతఁడు కావలెనని గడ్డిగాదములో నగ్ని తగు ల్కానెను. గడ్డిగాదము భస్మము కావలెననుకొనలేదు. అతడు ధూమ పానము చేయుటకు నిప్పును వెలిగించెను. నిప్పు స్వభావము ఎచ్చట౼ దగుల్కానిన నది భస్మమగుటయే ఇదేవిధముగ నజామిళుఁడు పాపము చేసినాఁడనుట సత్యమే. భగవన్నామమును నాతని పుత్రుని నిమిత్తముగ జేసెననుట సత్యమే కాని నామ మాహాత్మ్యము, నారాయణ శబ్దభావమెచ్చ టికిఁ బోఁగలదు. పాపనాశనమై తీరును."

అంత శౌనకుఁ డిట్లనెను :— "మహాభాగా ! నీవు సమర్థ శ్రీమంతుఁడు, కుక్క దృష్టాంతమును జెప్పితిరే యిది ప్రాకృతిక పురు షుల పక్షపాత పూర్ణవాక్యములు. భగవంతుడు సర్వసమర్థుడు, సర్వజ్ఞుడు సర్వవిత్, న్యాయ సత్యయుక్తమగు నిరాకార, నిర్గుణ, నిర్లేపుఁడు అతఁ డిట్టి యసత్య పక్షపాతమేల చేయవలెను. అతఁడు తన మిథ్యానామమును బలుకువాని యెడల మమత్వమునేలఁ జూపించినాడు."

ఇది విని సూతుఁడు నవ్వుచు నిట్లనెను :— "స్వామీ ; పేదను

చెల్లమును నొకటిగఁ గలుపకుడు. నేనిచ్చట దుర్గుణ నిరాకార బ్రహ్మము విషయము పలుకుటలేదు. నేనిచ్చట సగుణ సాకార వైకుంఠాధిపతి చతుర్భుజ లక్ష్మీపతి శ్రీమన్నారాయణుని అనుకంపను దయాతత్వమును గూర్చి వర్ణించుచున్నాను. ఆ భక్తవత్సలుఁడగు భగవానునకు శరణాగత భృత్యుల యెడలఁ బక్షపాత ముండును. దీనిని మేము కాదనఁజాలము. అతనికి దననామమును బలుకు వారియెడల మమత్వముండనే యుండును. వారే భావముతోఁ బలికినను వామమగు నెట్లు పలికినను దానిని గమనింపడు మన సగుణ సాకార లక్ష్మీపతి శేషశాయి కమలాకాంతుఁడు, దానిలోఁ బక్షపాత దోషము రానే రాఁజాలదు. నామ, రూప, లీలా, ధామములలో దేని నాశ్రయించినను వాని కుద్ధారము కలిగియే తీరును. వారు కావలెనను కొన్నను, ఆగదు ఇది యాతని బిరుదు, పట్టుదల, ప్రతిజ్ఞ."

ఇది విని శౌనకుఁ డిట్లనెను :— "సూతా! నీవు నిజమే చెప్పితివి. మనః పూర్వకముగ ననంత గుణధాముడును, ప్రకృతికిఁ బరుఁడునగు ప్రభువు నే జీవుడు హృదయ పూర్వకముగ ధ్యానకీర్తనము లొనర్పఁగలడు. అందఱును విమనస్కులై చేయుచుందురు. మనము నోరార శ్రీమన్నారాయణ నారాయణ నారాయణ పలుకుచుందుము. చిత్త మటు నిటుఁ దిరుగుచుండును. మనస్సులేక చేసినపని వ్యర్థమగు నెడల మనము చేయు జప, తప, కీర్తన, కథాదులన్నియును వ్యర్థములే. ఏల ననఁగా - మొట్టమొదట మనస్సెవరికిని నిలువదు. వినఁగా వినఁగా జేయఁగా జేయఁగా ప్రభువు కృపఁ జూచినపుడు మనస్సు భగవంతునిపై లగ్నము కాఁగలదు. అతని నామ, గుణ, లీలా, ధామములను గూర్చియు రూపమును గూర్చియు జింతించుటకు అతని అనుగ్రహము లేక యెవరికి స్వయముగ సామర్థ్యమున్నది ? మనము విమనస్కులమై రామ రామ యనుచుందుము. కాని నామ మెవరిదో వారికి నామము మీద నభిమాన

మున్నది. విముక్తులై పలికిన వారియెడలను గృపజూచును అజామిళుడు పుత్ర విమోహముచే నారాయణ నామమును బలికినప్పటికిని వానిని గృప జూచెను. విష్ణుదూతలు యమదూతల నుండి రక్షించి సరియైన పనినే చేసెను. ఇదియే వారు చేయవలసినది. కృపఁజూడక అతనిని దుఃఖము నుండి బయట పడవేయకుండినచో ననుచితమనియే చెప్పవలసియుండును. సరియే తర్వాత నేమైనది? ఈ ఆఖ్యానమును బూర్తిగా వినిపింపుడు,"

ఇది విని సూతుఁడు నవ్వి యిట్లనెను :— "స్వామీ! భగవన్నామ మాహాత్మ్యమందును దాని ప్రభావ విషయమందును శంకింపవలసిన పనిలేదని మీకు తెలియునని మాకుఁ దెలియును. మీరు సర్వ సాధారణుల కొఱకీ ప్రశ్న నడుగుచున్నారు. మంచిది, ఇప్పుడిక దర్వాతఁ జరిగిన అనుడు అజామిళాఖ్యానమును శ్రవణ మొనర్పుడు.

## యమదూత విష్ణుదూతల సంవాదము

# 358

శ్లో॥ యూయంవై ధర్మరాజస్య యది నిర్దేశ కారిణః।
బ్రూత ధర్మస్య న స్తత్త్వం యచ్చాధర్మస్య లక్షణమ్॥
వేద ప్రణిహితో ధర్మో హ్యధర్మస్తద్వి పర్యయః।
వేదో నారాయణ స్సాక్షాత్స్వయం భూరితి విశ్రుతమ్॥

(శ్రీ భాగ. ౬ స్కం. ౧ అ. ౩౮, ౪౦ శ్లో॥)

ఉ॥ మీరు పరేత నాయకుని - మేలిమి దూతలపేనిఁ బల్కుఁడా
తీరపు బుణ్యలక్షణము-దుష్కృతభావము దండకృత్యమున్
వీరము తోడ నీతని క-భీష్ట నివాసముఁ బూని దండ్య లె
వ్వారలో సర్వ భూతములో వారొక కొందఱు పాపకర్ములో॥

వ. అనిన యమభటు లిట్లనిరి.

క. వేద ప్రణిహితమే యను
మోదంబుగ ధర్మమయ్యె మున్ను తదన్యం
బేదియగు నది యధర్మం
బాదియు హరిరూపు వేదమని వినుకతనన్॥

శ్రీమదాంధ్రభాగవతము,

ఇద్దరు రాజసేవకులు పరస్పరము కలిసికొనినప్పుడు, అందులోఁ బెద్దరాజుయొక్క సేవకులు చిన్న మండలీశ్వరుని సేవకులను సామాన్య సేవకులవలె గద్దించి బెదిరించుచుందురు. వాస్తవముగ నసమర్థుఁడగు వాడు సేవకుఁడు సమర్థుఁడగువాడు స్వామి. ప్రభావశాలికానివాడు ప్రభావ శాలియగు వాని సమ్ముఖముగ వంగి తీరవలెను.

శుకుఁ డిట్లనెను :— "రాజా ! భగవంతుని పార్షదులు నలుగురు యమదూతలను ముగ్గుర నిష్టము వచ్చినట్లు బాదఁగా దేజోహీనులై వెల్లకిలఁ బడిపోయిరి. ఇంతవఱకు వారు తామే అధిక బలవంతుల మనుకొని పాపులయెడ నిర్దయతోఁ దర్జన భర్జనలను గావించుచు భయపెట్టుచుండిరి. కాని నేఁడు వారన్నిటిని మఱచిపోయిరి. వారు మిక్కిలి దీనముగా నేడ్చుచు నిట్లనిరి. "ఇంత తేజోవంతులగు మహానుభావులు మీ్మ

వరు ? ధర్మరాజు నాజ్ఞను దిరస్కరించిన వానినింత వఱకు మేము చూడ లేదు. నేఁడు మేము క్రొత్తగా గాంచుచున్నాము. మీరు నిర్భయులై ధర్మరాజు నాజ్ఞను అవహేళనము గావించుచున్నారు. మీరెవరి దూతలు ? మీ స్వామి నామధేయమేమి ? మీ స్వామి యమునికంటె గొప్పవాడా ? మీరిప్పు డెక్కడినుండి వచ్చినారు ? మేమీ పాపిని గొనిపోవుచున్నాము కాని మీకేమియు హాని చేయలేదే. మమ్ముల నకారణముగఁ గొట్టనేల ? మీరేమైన దేవతలా ? లేక యక్ష, గంధర్వ, కింపురుష, సిద్ధ, చారణులా ? చూడఁగా మీరందఱును సుందరులుగ నున్నారు. మీ విశాల నేత్రములు వికసించిన కమలములవలె సరసకమనీయములుగ నున్నవి. అందఱి శరీరములపై సుందరసువర్ణపీతాంబరము మెఱయుచున్నది శిరస్సునమనోహర ముకుటము, కర్ణములకు కనక కుండలములు. గళమున కమనీయ కమల కుసుమముల మనోహరమగు మాలలు కలవు. అందఱు యౌవనులే. అందఱకు ఆజాను పర్యంతము నాల్గు నాల్గు చేతులు కలవు. అందరు శంఖ, చక్ర, గదా, పద్మ, ధనుర్బాణ, ఖడ్గములను, అంబులపొదిని ధరించితిరి. మీరీ యంధకార పూర్ణమగు గృహమును మీ ప్రకాశముచే ప్రకాశింపఁ జేయుచున్నారు. మీ యాగమనమున దశ దిశలు ప్రదీప్యమానములైనవి. మీరు మీ విషయమును జెప్పి, ఏ కారణముచే ధర్మరాజ కార్యమునందు హస్తక్షేపమును గావించితిరో చెప్పుడు. దయచేసి మా యీ ప్రశ్నలకు జవాబీయ వేఁడెదము."

యమదూతల యీ ప్రశ్నలకు భగవంతుని ప్రియ పార్షదులు పక పక నగి యిట్లనిరి :— "మేము మీ ప్రశ్నలకు జవాబు తర్వాత జెప్పెదము. వీనిని గొనిపోవచ్చిన మీరెవరో ముందు చెప్పుడు."

వారాశ్చర్యముతో నిట్లనిరి :— "అయ్యలారా ! మేము రాత్రిం

బవశ్యీ పనినే చేయుచుందుము. మేము పాపులను ధర్మరాజు కడకు వారి యాజ్ఞచేఁ దీసికొని పోవుచుందుము."

అంత విష్ణు పార్షదు లిట్లనిరి :— "మీ స్వామి ప్రతివారి నూరక గొనిరమ్మనునా ? లేక యేదైన నియమమునుబట్టి నే కారణమున నైనఁ బిలుచునా ?

యమదూత లిట్లనిరి ;— "మా స్వామి న్యాయముగ, ధర్మముగ మరణించు వానిని మా ద్వారమునఁ దెప్పించుకొనును. పాపులకు శిక్ష నొసంగును. వారేమాత్రమైన ధర్మమును దప్పరు. అందులకు వారిని ధర్మరాజందురు. మే మా ధర్మరాజుని ఆజ్ఞాకారులగు దూతలము. వారి యాజ్ఞ అగుటచే మేమీతనిని గొనిపోవ వచ్చితిమి. మేమే యపరాధము నొనర్పలేదు. మీరు వృధాగా మమ్ములను వలగఁబొడిచి సగము చచ్చిన వారిని గావించితిరి,

ఇది విని యధికార స్వరమున విష్ణు పార్షదు లిట్లనిరి :— "మంచిది, మీరు ధర్మరాజు బంటులగుచో ధర్మమన నేమో చెప్పుడు."

ఈ దూతలిప్పుడే పరీక్షనిచ్చి పదవిని సంపాదించినట్లగపడుచున్న దను భావముతో నడుగుచున్నా రనుకొని, పరీక్ష ప్రశ్న నడుగఁగానే వారు శీఘ్రముగఁ దమ యోగ్యతలను జూపుచు నిట్లనిరి :— "వేదములలో జెప్పఁబడిన విహితకర్మలు ధర్మములు. వానికి విపరీతములు అవిహితలు అధర్మములు. అవి నిషేధములు."

విష్ణు పార్షదు లిట్లనిరి :— "వేదమేది ?"

యమదూత లిట్లనిరి :— "శ్రీమన్నారాయణ ముఖ నిశ్వాసితములు వేదములు అవి భగవంతున కభిన్నములు. అవి యాతని

స్వరూపములే. సాక్షాన్నారాయణుఁడే వేదము. ఈ ప్రాణులందఱును భగవంతుని యందే యున్నారు. ఆ హరియే అందఱ అంతఃకరణమందు జీవరూపమున నున్నాఁడు."

పార్షదు లిట్లనిరి :— "అయితే ప్రాణులలో నీ విభిన్నత యెట్లు వచ్చినది ?"

యమదూత లిట్లనిరి :— "మహానుభావులారా! భగవంతుని స్వరూపమందు నిలిచిన సత్త్వ, రజ, స్తమోమయ ప్రాణులను ప్రభువు తన వేదరూప జ్ఞానముచే గుణ, కర్మ, నామ, రూపాద్యను సారముగ, వారి వారి కర్మాను సారముగ యథా యోగ్యముగ విభాగించనాఁడు. ఇందులో భగవంతునకు పక్షపాతముగాని అన్యాయముగాని లేదు."

అంత విష్ణుదూత లిట్లడిగిరి :— "ఏ జీవుఁడైన శుభకర్మ చేసినదియు, నశుభకర్మ చేసినదియు, పారితోషికి మీయబడ వలసినదియు దండ మొసంగబడ వలసినదియు, స్వర్గమునకుఁ బంపబడ వలసినదియు, నరకమునకు బంపబడ వలసినదియు నెట్లు తెలియఁగలదు ?"

అంత యమదూతలిట్లు ప్రత్యుత్తర మొసంగిరి :— "స్వాములారా! దీనికి చాలమంది సాక్షులు కలరు. జీవుల శుభా శుభములను జూచుటకై అత్యంత గుప్తచరులను భగవంతుఁడు నియమించినాఁడు. వారి నెవరును మోసగించలేరు."

పార్షదు లిట్లనిరి :— "ఆ దూత లెవరు? వారి నామములేవి ?"

యమదూత లిట్లనిరి :— "సర్వ ప్రథమమున సమస్త ప్రాణుల శుభాశుభ కర్మలకు సాక్షి సూర్యనారాయణుఁడు. అందుకనియే యెవడైన శుభకర్మ నొనర్చినప్పుడు సూర్యున కర్ఘ్యమొసంగి ఇట్లు ప్రార్థించెదరు:—

"ఓ వివస్వంతుఁడా ! ఓ బ్రహ్మ ! ఓ ప్రకాశవంతా ! విష్ణుతేజయుక్తుఁడ వగునో దేవా ! జగత్సవితా ! పరమపవిత్రా ! కర్మసాక్షీ ! ప్రభూ ! నీకు నమస్కారము. నీవు మా యీ శుభకర్మలకు సాక్షివి. ప్రాణి మరణింపఁగనే సూర్యుఁడు వెళ్ళి వీఁడీపని చేసినాఁడని సాక్ష్యమొసంగును. అగ్నికూడ కర్మసాక్షియే. అగ్నిలోన జఠరాగ్ని రూపమునను బయట ప్రత్యక్షాగ్ని రూపమున నున్నాఁడు. అగ్నినిగాదని యెవఁడు నేమిపనియు జేయలేడు. ఆకాశము కూడ భగవంతుని గుప్తచరుఁడు. పాపపుణ్యము లాకాశము క్రిందనే చేయవలసి యుండును. ఆకాశమున కావల నెవఁడు నేమిపనియుఁ జేయలేడు. వాయువుకూడ కర్మలను స్మరించును. వాయువు లేక యెవరును జీవింపజాలరు. ఇంద్రియాభిమాన దేవతలుకూడ కర్మకు సాక్షులే. చంద్ర, సంధ్యా, రాత్రి, దిన, దశదిశలు, జలము, పృథ్వీ, కాల, ధర్మములు జీవుల శుభాశుభ కర్మలకు సాక్షులు. ధర్మరాజు వీరం దఱ నడుగును, దండమునకు యోగ్యులైనవారిని మా ద్వారా పిలిపించి దండించును. స్వర్గ యోగ్యులైన వారిని సౌమ్య రూపమున సత్కార పూర్వకముగ స్వర్గమునకుఁ బంపును. ప్రాణులు వారి వారి కర్మానుసారముగ స్వర్గ నరకములందు సుఖదుఃఖము లనుభవించెదరు."

విష్ణుపార్షదు లిట్లనిరి :— "మీ స్వామి కర్మలు చేయని వారిని దండించునా ?"

యమదూత లిట్లనిరి :— "స్వాములారా ! అదెట్లు జరుగును ? శరీరము ధరించిన వాడేవో చేయనే చేయును. త్రిగుణములచే బద్ధుఁడు గాని శరీరము నెవఁడును ధరింపఁడు. సత్వ, రజ, స్తమ గుణములచే బంధింపఁడిన వాఁడు శుభాశుభ కర్మలవశ్యము చేయును. ఈ లోకములో

శుభాశుభ, ధర్మాధర్మ పాపపుణ్య కర్మలెట్లో పరలోకమున నట్లే సుఖ దుఃఖము లనుభవించును."

విష్ణు పార్షదు లిట్లనిరి ;— "అయితే వీడు పాపి, పూర్వజన్మ మున వీడు పాపము చేసినాడు. వీడు రాఁబోవు జన్మమున పాపయోని యందు భోగింపవలయునను సంగతి యెట్లు తెలియఁగలదు ? భూత భవిష్యత్తు లదృశ్యములు కదా !"

ఇది విని యమదూత లిట్లనిరి :— "స్వామీ ! భూత భవిష్య త్తుల దృశ్యములనుట నిజమే; కాని వర్తమానము ప్రత్యక్షముగఁ గనఁ బడు చుండును. ఇచ్చట మనకు ఉత్తమ, మధ్యమ, అధమములను మూఁడు రకముల మానవులు కనఁబడుచుందురు. సుఖి, దుఃఖి, సాధార ణుఁడు, పుణ్యాత్ముఁడు, పాపాత్ముఁడు, మధ్యమ శ్రేణికిఁ జెందినవాఁడు; సాత్త్విక, రాజస, తామసులు. ఇప్పుడు సుఖముగ నుండి పుణ్యకర్మ లొనర్చువాడు పూర్వజన్మమున నాతడు పుణ్యకర్మ లొనర్చినాఁడనియు, అందువలననే ఆతనికి శుభకర్మలందు ప్రవృత్తి కలిగినదనియు, ఇప్పుడు శుభకర్మలొనర్చువాడు ముందును శుభలోకములను బొందుననియు తెలియ వలెను. ఇదేవిధముగ నధర్మ విషయమందును నూహింపవలెను. దీని వలన వర్తమాన కర్మను గాంచిన మూడు జన్మముల విషయము ప్రత్య క్షముగఁ గనఁబడఁగలదు.

విష్ణు పార్షదు లిట్లనిరి :— "అనుమాన మెన్నడును సత్యమన రాదు. అప్పుడప్పు డనుమానము మిథ్య కాఁగలదు. యముఁ డనుమానం చేతనే దండించునా లేక పాపపుణ్య కర్మలను దెలిసికొనుట కాతనికడ నేమైన సాధనము కలదా ?"

అంత యమదూత లిట్లనిరి :— "కాదు, అట్లుకాదు, యముడు కేవల మనుమానముచే దండింపఁడు. అతఁడు ప్రతివాని యంతఃకరణముననుండి సదా వారి కర్మలను బ్రత్యక్షముగ గాంచుచుండును. అజుడగు ధర్మరాజు మ్మనస్సుచేతనే సమస్త ప్రాణుల పూర్వా పూర్వ రూపములను విచారించును- యమునకు దెలియని విషయము లేదు. అతఁడు భూత భవిష్యద్వర్తమానముల నన్నిటిని ఎఱుఁగును కాని, జీవునకు వర్తమాన శరీరము తెలియునుగాని భూత భవిష్యచ్ఛరీరముల జ్ఞానముండదు.

విష్ణు పార్షదు లిట్లనిరి :— "జీవులకు భూత భవిష్యజ్జన్మముల జ్ఞానమేల యుండదు ? అతఁడు స్వయముగ భోగించిన శరీరములను, అవి చేసిన కర్మముల నెట్లు మఱచును ?"

అంత యమదూత లిట్లనిరి :— "నిష్పాపులారా ! ఈ విషయమును మీరిట్లు భావింపుఁడు. మానవుఁడు నిద్రించునపుడు స్వప్నమున శుభాశుభ కర్మల నొనర్చును. స్వప్నమున స్వప్న శరీరమునఁ జేసిన కార్యములు సత్యములనే భావించును. అప్పుడు స్థూల శరీరాభిమానమును పూర్తిగా మఱచును. మేల్కాంచఁగానే వానికా స్వప్న శరీరము, స్వప్నమునఁ జేసిన కార్యములు, పదార్థములు మిథ్యగాఁ దోఁచును. అట్లే విధముగ పూర్వజన్మ స్మృతి నశింపఁగానే జీవునకు వర్తమాన శరీరముగాక అన్యభూత భవిష్యచ్ఛరీర విషయముల స్మరణముండదు."

విష్ణు పార్షదు లిట్లనిరి :— "జీవుఁడొక శరీరమునుండి వేఱొక శరీరమున కెట్లు పోవును ?"

అంత యమదూత లిట్లనిరి :— "ఐదు కర్మేంద్రియములు, ఐదు జ్ఞానేంద్రియములు, విషయ పంచకము మొత్తము పదునైదు,

పదునాఱవది మనస్సు, పదునేడవది జీవుఁడు. జీవుడు వీనితోఁ జేరి విష యోప భోగము కావించును. ఈ విధముగఁ త్రిగుణములతోఁ గూడిన షోడశ కళలుగల ఈ లింగశరీరము ఒక దేహమునుండి యింకొక దేహమున ప్రవేశించును, మాటి మాటికి దేహమును విడుచుచుఁ గ్రొత్త దేహమును ధరించుచుండును. దేహాభిమానమును జెంది కామ క్రోధాదులకు వశీభూతుఁడగును. అజ్ఞానియగు జీవి యిష్టము లేకున్నను లింగశరీరము ద్వారా కర్మలందు ప్రారబ్ధ కర్మానుసారముగఁ బ్రవృత్తుఁడగును.

విష్ణు పార్షదు లిట్లనిరి :— "ఇది బాగున్నది ! స్వయముగఁ గర్మలొనర్చి స్వయముగనే వానిలో బంధింపబడును."

నవ్వి యమదూత లిట్లనిరి :— "స్వాములారా ! జీవుల యజ్ఞాన మిదియే. పట్టుపురుగును జూడుఁడు. ఇది తన నోటినుండియే దారమునుదీసి తనను బంధించుకొనును. బయటకు వచ్చు దారియైననుండదు. పట్టు చేయువారు వాటిని దెచ్చి వేడినీటిలో వేయుదురు. పురుగు చచ్చును. అప్పుడు పట్టును దీసికొందురు. అట్లే యీ జీవి తానశుభకర్మ లొనర్చి మాటి మాటికి జనన మరణములను బొందుచుండును. సంసార చక్రమును దానే నిర్మించుకొనును. స్వాములారా ! ఈ జీవి ప్రారబ్ధా కర్మానుసారముగఁ బ్రకృతికి వశీభూతుఁడై అవశుఁడై కర్మ లొనర్చుచుండును.

విష్ణు పార్షదు లిట్లనిరి :— "అయితే వీని దోషమేమి ? వీనిని మీరేలఁ గొనిపోవుచున్నారు ?"

యమదూతలు వెంటనే యిట్లనిరి :— "స్వాములారా ! ఈతడు చాల గొప్ప పాపములు చేసినాఁడు. మొదట ఈతఁడు మంచివాఁడే. కులీన బ్రాహ్మణుఁడే ఒకానొక వేశ్య వలలోఁ బడి తన శీల సదాచారము

లను బోఁగొట్టు కొనినాఁడు. గొప్ప గొప్ప ఘోరపాపము లొనర్చెను. అనేక హత్య లొనర్చినాఁడు, ధనము నపహరించినాఁడు. ఎన్ని పాపము లున్నవో అన్నిపాపము లొనర్చినాఁడు. ఇప్పుడు మేమీతనిని మాస్వామి యాజ్ఞ ననుసరించి నరకమునకుఁ గొనిపోయెదము. అచ్చట నీతఁడు చేసిన పాపములకు వివిధ యాతన లనుభవించవలెను. అచ్చట దండ మొసంగి పాపులను బాపమునుండి విముక్తుల నొనర్చెదము."

మీకిది తెలియదు కావుననే యీతనియందు మీకు దయ కలిగినది. ఈతని జీవితము పాపపూర్ణమైనది. ఈతఁడు బహు దినములు వేశ్యతోఁ గూడి భోజన, పాన, సంగమాదులు కావించినాఁడు. దాని సంసర్గముచేఁ గలిగిన పాపముల ననుభవించుచున్నాఁడు. ఇన్ని పాపములు చేసియు నిచ్చట శాస్త్రవిధిచేఁ బ్రాయశ్చిత్త మొనర్చుకొనలేదు. మేమిప్పు డీతనిని దండపాణియగు యమునికడకు తీసికొనిపోయెదము. అచ్చట దండన ననుభవింపఁగానే పాప ప్రాయశ్చిత్తము కాఁగలదు. అప్పుడు నరకము నుండి నెట్టివేయఁబడును.

శుకుఁ డిట్లనెను :— "మహారాజా! యమదూతల వలనఁ దమ ప్రశ్నలకు సమాధానమును బొంది, భగవంతుని ప్రియ పార్షదులు ప్రసన్నులై వారితో నిట్లనిరి :— "నాయనలారా! మీరు చెప్పునది యథార్థమేకాని ఒక పెద్ద పొరపాటును జేయుచున్నారు, ఈతఁడు పాప మును జేసినాఁడనునది మేమంగీకరించు చున్నాము. కాని ప్రాయశ్చిత్త మైన మీఁదట పాపభోగముండదు. ఈతఁడు పాపమొనర్చి ప్రాయశ్చిత్త మొనర్చినాఁడు."

యమదూత లిట్లనిరి :— "లేదు స్వాములారా! ఈతడుఁ ప్రాయశ్చిత్తము చేసికొనలేదు. ఈతడు చాంద్రాయణమును గాని,

కృచ్ఛ్రిమును గాని, పరాక వ్రతమునుగాని చేయలేదు. వ్రతోపవాస మొనర్పలేదు. అట్టియెడ నీతఁడు ప్రాయశ్చిత్త మొనర్చుకొనినాఁడని యెట్లు చెప్పఁగలరు ?"

విష్ణుదూతలు గంభీర స్వరముతో నిట్లనిరి :— "మీ పొరపాటి దియే. దీనినే మీరు గమనింప లేదు. అందువలననే మీకు తడి తగిలినది.—

యమదూత లిట్లనిరి :— "స్వాములారా ! అదేమిటో మాకుఁ జెప్పుఁడు."

శ్రీ శుకుఁ డిట్లనెను :— "రాజా ! యమదూత లిట్లు జిజ్ఞాస నొనర్పఁగా విష్ణు పార్షదులు వారికి భగవన్నామ మహిమను జెప్ప నుద్యుక్తులైరి."

## భగవన్నామమే సమస్త పాపములకు పూర్ణ ప్రాయశ్చిత్తము

## 359

శ్లో॥ ననిష్కృతై ర్బ్రహ్మవాదిభి
స్తథా విశుద్ధ్యత్య ఘవాన్ వ్రతాదిభిః

యథా హరేర్నామ పదైరుదాహృతై
స్తదుత్తమ శ్లోక గుణోపలంభకమ్॥

శ్రీ భాగ. ౬ స్కం. ౨ అ. ౧౧ శ్లో॥

సీ॥ అతిపాపములకుఁ బ్రయత్న పూర్వకముగఁ
దనుపాపముల కమితంబుగాఁగ
సన్ముని వరులచే సంపాద్యమై యుండు
నిర్మలంబగు పాప నిష్కృతములు
గ్రసు రూపమున నుపశమనంబులగుఁ

శ్రీమదాంధ్రభాగవతము.

రత్నము, సాధారణ రాయి రెండును పాషాణములే. మూర్ఖుల దృష్టిలో రెంటికి విశేష భేదమేమియును లేదు. ఒకటి బాగుగా మెఱసెడు రాయి, ఇంకొకటి కొంచెము తక్కువగ మెఱయురాయి. రాతి విషయములో రెండు నొకటియే. కాని దాని మహత్తు రత్నాల వర్తకుఁడు తెలిసి కొనగలఁడు. అట్లే సాధారణ వ్యక్తులు మిగిలిన నామములు, భగవన్నామము నొక్కటియనియే భావించెదరు. అన్నియు నక్షరములే యనుకొందురు. కాని భగవంతున కత్యంత ప్రియములును, సమీపవర్తులు నగు పార్షదులకు వాస్తవముగ నామమునకును భగవన్నామమునకును భేదమేమో తెలియఁగలదు. భగవన్నామములోఁ గల శక్తి వారికి తెలియును.

శుకదేవుఁ డిట్లనెను :— "రాజా ! యమదూతల ముఖమున

ధర్మవాక్యములను, అజామిళుని నరకమునకుఁ గొనిపోవు నిచ్ఛను ప్రక టించుటను గాంచి విష్ణుపార్షదులు నవ్వి యిట్లనిరి :— "ఓరీ ! మీరజ్ఞులు మీరు ధర్మరాజు దూతలమని చెప్పుకొనుచున్నారు గాని మాకుఁ జూడ మీ రధర్ముని దూతలుగ గోచరించుచున్నారు. మీ స్వామి ధర్మా త్ముఁడగుచో నిట్టి యాజ్ఞను బొరపాటున నైనను నొసంగఁడు. చాలా చింతింపవలసిన విషయ మేమనఁగా ధర్మాత్ముఁడని పిలువబడుచు, ధర్మ రాజను నామమున బిలువఁ బడుచున్నవాని సభలోనికి అధర్మము ప్రవే శించి, దండనార్హులగు నిష్పాపుల నకారణముగ దండించుచుండిన నిఁక ప్రజ యెవరిని శరణువేఁడవలెను ? ప్రజలాతనిని తల్లి, తండ్రి, స్వామి సర్వస్వము సమాదర్శియని యనుకొనుచుందురు. అట్టివాఁడును నన్యాయ మున కొడిగట్టుకొనిన నింక ధర్మరక్షణ మేమున్నది ? ఆతఁ డన్యాయా చరణ మొనర్చుచో నింక సాధారణులు కూడ అన్యాయాచరణము కావిం పరా ? శ్రేష్ఠులేమి యాచరింతురో అన్యులును దానినే యాచరించుచుం దురు. పెద్దవారు దేనిని మంచిదందురో మిగిలినవారు దానినే ప్రమాణ ముగ గ్రహించెదరు. ఇప్పు డన్యాయమును విశ్వాసఘాతము నైనది,

యమదూత లిట్లనిరి :— "ఇది విశ్వాసఘాత మెట్లైనది ?"

విష్ణుపార్షదు లిట్లనిరి :— "అవును, విశ్వాసఘాతమే అయి నది. విశ్వసించి శరణుఁ జొచ్చినవాని గొంతుమీఁదఁ గత్తిని జళిపించుట విశ్వాసఘాతము కాదా యేమి ? వేటగాండు వలలుపన్ని వీణనుబాడి హరిణములను బట్టి చంపుచుందురు. మనమునమ్మి ఒకానొకని తొడపైఁ దలనుంచి పరుండిన వాఁడు గొంతును గోసిన నది విశ్వాసఘాతము కాదా ? సాధుస్వభావము కలవాఁడు తనను శరణుజొచ్చిన యపకారికిఁ గూడ ననిష్టముకావింపఁడు. తనసువిశ్వసించినవారికి న్యాయమునేచేయును.

జడమతియు, వ్యాధుఁడును పశుబుద్ధికలవాఁడును మాత్రమే యిట్టి విపరీత వ్యవహార మొనర్చును. చివరకు హింసక పశువైనను శరణాగతునకు విశ్వాసఘాత మొనర్పదు. ఒక కథకలదు, వినుఁడు.

ఒకానొక పథికుఁడు ఘోరారణ్యముగుండా పోవుచుండ నాతనికొక సింహము కనఁబడెను. దానినిగాంచి భయముచే నాతఁడు పారిపోసాగెను సింహమును మాంసలోభమున నాతనిని వెన్నంటెను. పథికుఁడు వెంటనే ఒక చెట్టుపై నెక్కెను. ఆ చెట్టుపై నొక ఎలుఁగు నివసించుచుండెను. పథికుఁ డెలుగుతో నిట్లనెను :– "నేను నీ శరణు జొచ్చితిని. నీ యింటికి వచ్చితిని, రక్షింపవలెను." ఎలుగుబంటు ఇట్లనెను :– "మంచిది, నీవే మియును భయపడరాదు. ఇచ్చట నిర్భయముగనుండుము. నా సంరక్షణ ములో నుంటివా నిన్ను సింహ మేమియును జేయఁజాలదు." ఎలుగు యొక్క మాటలను పథకుఁడు విశ్వసించెను. అతఁడు నిశ్చితుఁడై యెలుఁగు సమీపమున నుండెను.

సింహము ఎలుఁగుతో నిట్లనెను :— "సోదరా! మనమిద్దర ము ను వనములో నుండువారము, సోదరులము. ఈతఁడా గ్రామములో నుండువాఁడు. భిన్నజాతివాఁడు, మనకాహారము. నా కాకలి యగుచున్నది. వీనిని గ్రిందఁకు ద్రోయుము. నా కాకలి తీరును. నీకు పుణ్య ముండును."

ఎలుఁగిట్లనెను :— "వనరాజా! నీవు అన్యాయ మొనర్చినను నేనుమాత్ర మన్యాయ మొనర్పఁజాలను, శరణు పొందిన వానిని బరి త్యాగము చేయఁజాలను, నన్ను విశ్వసించి ఆత్మసమర్పణ చేసినవానికి విశ్వాసఘాత మొనర్పరాదు. నా కాత్మ సమర్పణ చేసిన శరణాగతుని నా

ప్రాణపణముగ రక్షించెదను.'' ఎలుఁగుయొక్క న్యాయయుక్త వచనము లను విని ఆఁకలి జెందిన సింహము ఇది చిగకపోవునా యని యచటనే కూర్చుండెను. ఇంతలో నెలుఁగు నిద్రించెను. అంత సింహము పథికు నితో నిట్లు పలుక నారంభించెను. "ఓయీ! నీవు దీని వలలోఁబడిపోయి తివి. ఇది నాకంటె హింసించు మృగము. నేనున్నంత వరకిది యూర కుండును. నేను వెళ్ళఁగానే నిన్నుఁ దినఁగలదు కావున నా నిద్రపోవు దానిని క్రిందకు దొర్లించుము. దీనిని దిని నిన్ను ముట్టకయే నా త్రోవన నేను బోయెదను."

సింహము మాటలను విని, యా మూర్ఖ, అజ్ఞ, కృతఘ్నుఁడు ఎలుఁగు నెడల విశ్వాసఘాత మొనర్చి, నిద్రించుదానిని గ్రిందకు దొర్లిం చెను. ఎలుఁగులకుఁ జెట్లమీద నిద్రించుట అభ్యాసమే. క్రింద పడకయే ఒక కొమ్మను బట్టుకొని తన్నుఁ దా రక్షించుకొనెను. ఇప్పుడు సింహము మిత్రభేద మొనర్పఁ బ్రారంభించెను. అది ఎలుఁగుతో నిట్లనెను :— చూచితివా ఈ మానవుని మంచితనము. నీ వీతని కుపకార మొనర్చినను వీఁడు నీకు విశ్వాసఘాత మొనర్చెను. స్వకృతాపరాధమునకు ఫలమనుభ వింపవలెను. వీనిని గ్రిందకు పడఁద్రోయుము."

అంత భల్లూక మిట్లనెను :— "మృగరాజా! నీవు నాకిట్టి యన్యాయపుటాజ్ఞ నొసంగకుము. వీఁడు మూర్ఖుఁడై ధర్మమును బోనాడిన నేనును మూర్ఖించునా, మిత్రభావముచే నాత్మసమర్పణము కావించిన వానికి నేనెన్నఁడు నన్యాయమును జేయను. వాని కనిష్టము రానీయను. దూతలారా! ఎలుఁగుయొక్క యిట్టి యుక్తి యుక్తములగు వాక్యము లను విని సింహము వెళ్ళిపోఁగా నా మానవుఁడు క్షేమముగ నింటికిఁజేరి నాఁడు. కావున నీ నిషాదుని ధర్మరాజు తెమ్మనినచో నాతఁడు నధర్మ మున జీవులయెడ విశ్వాసఘాత మొనర్చుచున్నాఁ డనవలెను."

దూత లిట్లనిరి :— "మీరు వీనిని నిష్పాపుఁడని యెట్లను చున్నారు ? వీఁడు మహాపాతకి. పాపము చేసినను వానికి శాస్త్రోక్త ప్రాయశ్చిత్తము జరిగి శుద్ధుఁడై యుండిన మేము తీసికొనిపోము. ఈతడు పాపమొనర్చి ప్రాయశ్చిత్తమును గూడా చేసికొనలేదు. కావున వీనిని గొనిపోవుట అన్యాయము కాదని మా యూహ."

విష్ణుపార్షదులు తమ మాటపై నిలువఁబడి యిట్లనిరి :— "అందుకనియే మీకు తెలియదని మేమనుచున్నది వీఁడు పాపియను సంగతిని మేమంగీకరించెదము. కాని యిప్పుడు వీఁడు పాపికాఁడు. ఈతఁడు తన పాపములకుఁ బ్రాయశ్చిత్త మొనర్చుకొనినాడు."

దూత లాశ్చర్యముతో నిట్లనిరి :— "ఈతడు ప్రాయశ్చిత్తము చేసికొనినాఁడా ?" విష్ణుపార్షదు లిట్లనిరి :- ఈతఁడు శుద్ధ స్పష్ట స్వరముతో "నారాయణ" యను నాల్గు యక్షరములు గల సుమధుర భగవన్నామమును నంతిమ శ్వాసతోఁ బలికినాఁడు. వీని కింతకు మించిన ప్రాయశ్చిత్త మేమున్నది ?"

అంత యమదూతల వాక్కులై విష్ణుపార్షదుల వైపట్లే చూచుచు విస్మయ స్వరమున నిట్లనిరి :- "భగవన్నామ స్మరణము వలన నే యే పాపములకుఁ బ్రాయశ్చిత్తమగును ?"

అంత మేఘ గంభీర స్వరమున విష్ణుపార్షదు లిట్లనిరి :— "మరణకాలమున నొక్కసారి యవశుఁడయ్యుఁ బరమ పావన భగవన్నామోచ్చారణమును గావించినచో సమస్త దొంగతనములు చేసిన పాపము తొలఁగిపోవును. సురాపాన పాపము వానికడ నుండి పారిపోఁగలదు. మాతృ, పితృ, గోహత్యాది మహాపాపము లన్నియు నీ నామ ధ్వనిని

వినఁగానే యీ దేహమును వదలిపోవును. అట్టివాఁడు గురుపత్నీ గమన పాపము నైనను బోఁగొట్టుకొనును. ఇంతయేల ? అంత్య కాలమున భగవన్నామమును బలికెనా సర్వపాపములకుఁ బ్రాయశ్చిత్తము చేసికొనిన వాఁడే కాఁగలఁడు. అట్టివాఁడు పాపమునుండి విశుద్ధుఁడగును."

యమదూత లిట్లనిరి :— "స్వాములారా ! అదెట్లు ? నామ మహిమను మేమంగీకరింతుము; కాని యాతఁడు జ్ఞానపూర్వక సంకల్ప పూర్వకముగ నామాపరాధములు లేకుండఁ బలికియుండిన నది ఫల మొసంగియుండును. ఇట్లవశుఁడై నామమొనర్చి యుండిన నేమిలాభము? శవవాహకుఁడును రామనామమును బలుకును."

ఇది విని విష్ణుపార్షదులా భయానక యాకృతిగల యమదూతలను గద్దించి యిట్లనిరి :— "ఓరీ ! మీరు గొప్ప చండాలురరా ? నామ మహత్త్వమును గించపఱచుచున్నారు. నామమును గూడ బంధనములో బంధింపఁ జూచుచున్నారు. ఇది నామ మహత్త్వముకాదు, నామాపరాధ మహత్త్వమైనది. నామమున కెప్పుడైన నపరాధముండునా ? అది సదా విశుద్ధమైనది. దానికి విధి నిషేధములు కాని, నియమములుకాని, పాత్రా పాత్ర విచారములు కాని లేవు. మరణకాలమున నెట్లు నోటినుండి వెలు వడినను నది సమస్త పాపములను జిన్న అగ్నికణము దూదికొండను నిమిషములో భస్మము చేసినట్లు చేయును.

నామమును విధి పూర్వకముగను, బవిత్రముగను, నామాపరాధ రహితముగను, పవిత్ర ద్విజాతుల చేతనే చేయఁబడవలెనను బుద్ధి విశుద్ధ మైనదే. అట్లుచేసిన బంగారమునకుఁ దావి యబ్బినట్లే. కాని యింతటి పవిత్రుఁడు కానివాఁడు భగవన్నామమును బలుకఁ గూడ దనుటెట్లు?

ఇంక సాధారణ జీవులకు నిష్కృతి యుపాయ మేమున్నది? ఇంక నామము సర్వసుగమము సర్వోపయోగ సాధన మనునదెట్లు? సార్థకము కాఁగలదు? ఇదియు విధివిధానమున కధీనమైనది కదా? యజ్ఞ యాగాదుల విధిపూర్వకముఁ జేసిన నిరర్థక మగుటయేకాదు విధిహీన యజ్ఞము వలన గర్త వెంటనే పరమార్థ పదచ్యుతుఁడగును. ఇది భగవన్నామ కీర్తనములో లేదు. దీనిని భావముతోఁ గానిండు కుభావముతోఁ గానిండు, సావధానమున గానిండు, అలసతచేఁ గానిండు, జ్ఞానముచేఁ గానిండు, అజ్ఞానముచేఁ గానిండు పలుకవచ్చును. జ్ఞాని, అజ్ఞాని, బ్రాహ్మణుఁడు, చండాలుఁడు, శుచి, అశుచి, ధర్మాతుఁడు, పరమాత్ముఁడు యెవరైనఁ గానిండు గ్రహింపవచ్చును. బ్రహ్మవర్త ఋషి దేశమందునను, కీకట మగధాది నిషిద్ధ దేశములందునను బలుకవచ్చును. దానివలన నిరర్థక మనున దెన్నటికిని లేదు. ఇది శాస్త్రనిర్ణయము, పురాణములు దీనిని ఢంకామీఁద దెబ్బకొట్టి ప్రచారము చేయుచున్నవి. ఏ పురాణమునైనఁ జూడుఁడు దానిలో భగవన్నామ కీర్తన విషయమున నిట్టి యుదార వచనములు లభింపఁగలవు. దానిలో సంకుచితత, సంకీర్ణత, సాంప్రదాయికత వాసనకైనను లేదు. భగవన్నామమునకు నియమము లేదు. దేశకాల పాత్రాపేక్ష లేదు. కేవలము జిహ్వతో నామమును బలికినఁ జాలును. ఆ నామమే సమస్తమును జేయఁగలదు. రోగి వైద్యుని పల్కులను విశ్వసింపవలెను. అతఁడు మాత్రలోఁగల మందు దినుసులన్నిటి విషయమును దెలిసికొని తినదలఁచిన ఈ మాత్రలో నేమి మందులు కలవు? యివి యెచ్చట దొరకఁగలవు? వీనిలో నేమి గుణము కలదు? వీని సత్తు నెట్లు తీయుదురు? వీటినన్నిటిని విచారించి అతఁడు మాత్రను సేవింపఁ దలఁచినచో రోగము పోనేపోదు. కన్నులు మూసికొని గొంతులో మాత్రను వేసికొనిన నది కడుపులోనికిఁ బోయి దానిపని అది చేసితీరును

దానికొఱకై ప్రయాస పడవలసిన పనిలేదు. వైద్యుఁడు చెప్పినట్లు సదా మాత్రను గొంతులో వేసికొనుటయే కర్తవ్యము. మిగిలిన పనియంతయు మాత్రయే చేయును. భగవన్నామములో ననంతమగు శక్తి కలదు! మరణకాలమున నే భాగ్యశాలియైన నోట రామనామమును బలికిన, వాని పాపములన్నియు ఆ క్షణముననే విలీనము నగును. వీడట్లే చేసినాఁడు. మరణించునపుడు వీడు విశుద్ధమగు 'నారాయణ'యను శబ్దమును నార్తుడై పెద్దగనేడ్చుచు బలికినాఁడు, ఇఁక వీఁడెట్లు పాపి కాఁగలడు ? మీరు వీని నింకెట్లు పట్టుకొన సాహసించుచున్నారు ! అందుకనియే మేము మీ వీపు లను విమానపు మోఁత మ్రోగించినాము. ఇంకఁ జేయిపేసితిరా మెడబట్టు కొని గెంటివేసెదము. యమదూతత్వమును మఱచిపోవలసినదే. తెలి సినదా !"

శుకదేవుఁ డిట్లనెను :— "భగవంతుని పార్షదుల నోటినుండి అలత్యకాలమున భగవన్నామోచ్చారణ మహిమను గూర్చి విని యము దూత లవాక్కులైరి. వారు భయముచే వణఁకుచు విష్ణుపార్షదుల వైపు అట్లే చూచుచు నిలువఁబడిపోయిరి.

## హరినామమే ఆత్యంతిక పాపనివృత్తి కావించును

## 360

శ్లో॥ నైకాంతికం తద్ధి కృతేఽపి నిష్కృతే
మనః పునర్ధావతి చేదసత్పథే ।

తత్కర్మ నిర్హార మభీప్సతాం హరే
ర్గుణానువాదః ఖలు సత్త్వభావనః ॥

శ్రీ భాగ ౬ స్కం. ౨ అ. ౧౨ శ్లో.

సీ॥ — — — కాని

తత్పాప చయములు దలఁపలేవు

సర్వకర్మంబుల సంహార మొనరించి

చిత్తంబునకుఁ దత్త్వసిద్ధినొసఁగు

గీ॥ నొనర నీశుసేవ యోగిమానస సరో

వాసుసేవ హేమ వాసుసేవ

వేద వేద్యు సేవ వేదాంత విభుసేవ

పరమపురుషు పాద పద్మసేవ

శ్రీమదాంధ్రభాగవతము.

మానవుఁడు పాపమేల యొనర్చును ? వాసనకు వశీభూతుఁడై మనస్సులో విషయవాసన నుంచుకొనుటయే బీజము. పాపము దాని ఫలము. ఒక విషవృక్షమునకు ఫలములు ఫలించిన వనుకొన్నుడు. అప్పుడా క్షేత్ర స్వామి యీ విషఫలములను దిని యెవరైనఁ జత్తురని వాటిని శస్త్రముతోఁ గోసి తగులబెట్టెను. వృక్షఫలములు నశించినవి. కాని వాటి ఉద్గమమునశింపలేదు. మరల మరుసటి సంవత్సరము వర్షము కురియఁగానే మరలఁబూలు, పండ్లు కాయనారంభించును. ఆ వృక్షమును సమూలముగ నఱకనంత వఱకు అది ప్రతి సంవత్సరము ఫలములను నశింపఁజేసినను ఫలించుచునే యుండును. ఇట్లే పాప ప్రాయశ్చిత్తమును

నీవు లక్ష ప్రాయశ్చిత్తము లొనర్చుకొనుము. ప్రాయశ్చిత్తము వలన నరకములో నలమనుభవింపకుండ వచ్చును. కాని వాసన యుండనే యుండును. భగవద్గుణానువాదనము నాశ్రయించుట చేతను, భగవత్కథలను, ఆతని సుమధుర నామములను ప్రేమ పూర్వకముగఁ గీర్తనము చేయుట చేతనే వాసనలు నశించును.

శ్రీ శుకదేవుఁ డిట్లనెను :— "రాజా ! విష్ణుపార్షదుల ముఖమునుండి "నారాయణ" నామ మాహాత్మ్యమును విని యమదూతలేమియును నిర్ణయము చేయఁజాలకపోయిరి. వారికి ప్రత్యుత్తరము తోఁచ లేదు. వారు వినీత భావముతో భగవానుని ప్రియపార్షదుల నిట్లడిగెను :— "అయితే స్వాములారా ! మాకేమి యాజ్ఞ నిచ్చెదరు ?"

గద్దించి విష్ణుపార్షదు లిట్లనిరి :— "ఆజ్ఞ యేమిటి ? ఈ మహాత్ముని దీసికొనిపోరాదు. ఈతఁడు సమస్త పాపములకుఁ బ్రాయశ్చిత్తము చేసికొనినాఁడు. మరణకాలమున నితని నోటినుండి భగవన్నామము వెలువడినది, ఇఁక నీతఁడు పాపి యెట్లైనాఁడు ?"

చేతులు జోడించి యమదూత లిట్లడిగిరి :.... "స్వాములారా ! మీ యాజ్ఞను శిరసావహింప వలసినదే; కాని మాకొక సందేహ మున్నది. ఆజ్ఞ యగుచో నడిగెదము."

విష్ణుపార్షదు లిట్లనిరి :— "మంచిది, అడుగుఁడు. భగవత్సంబంధమైన విషయమునే యడుగవలెను. ఈ యీ విషయవార్త లడుగ రాదు."

యముడూత లిట్లనిరి :— "లేదు స్వాములారా ! విషయ వార్తల విషయము కాదు. మీరు భగవన్నామము విషయమును గూర్చి

చెప్పుచున్నారు, ఒప్పుకొన్నాము. కాని యీతడు భగవన్నామమును బలుకలేదు. భగవానుని బిలువలేదు. ప్రాయశ్చిత్త మెట్లైనది? భగవద్రూపమును ధ్యానించి, చిత్తమును విషయముల నుండి మరల్చి శంఖచక్రగదాపద్మధారియగు నారాయణుని బిలిచి యుండిన బాగుగనే యుండెడిది. పిలిచినది పుత్రుని, మీరు భగవన్నామ కీర్తన చేసినాఁడనుచున్నారు ఇది మా కర్థము కాలేదు."

విష్ణు పార్షదు లిట్లనిరి :— "మీరు జడులవలె నున్నారే. విధి విధానమున జేసియుండిన మంచిదే; కాని భగవన్నామ మమోఘమైనది. వీని నోటినుండి మరణ కాలమున భగవన్నామము వెడలినదను సంగతిని గమనింపరేమి? మరణకాలమున నామము వెలువడుట సహజవిషయము కాదు. బెల్లమును కన్నులు మూసికొని తినుము, చీకటిలోఁ దినుము, వెలుగులో దినుము, ఇంటిలో దినుము, బయట దినుము, స్నానముచేసి తినుము, స్నానముచేయక దినుము అది తీపిగనే ఉండును. అట్లేవిధముగ భగవన్నామమును తెలిసి పలుకుము, తెలియక పలుకుము, సంకేతముగఁ బలుకుము, నవ్వులాటకుఁ బలుకుము, గానాలాపము పూర్తిచేయుటకుఁ బలుకుము, అవహేళనము కొఱకు బలుకుము అది పాపముల నాశమొనర్చుటకు సమర్థమై యుండుము. కావున మీరు దీనిని శంకింపకుడు. నామము నెట్లు పలికినను భగవన్నామమే."

ఇది విని శౌనకుఁ డిట్లనెను :— "సూతా! సంకేతమున నామము నెట్లు పలుకుదురు?"

సూతుఁ డిట్లనెను :— "స్వామీ! సీతారామ ప్రసాదము తీసికొనుడు, మా రాముడు ప్రసాదమును గైకొనినాడు అని పల్కుటకు

సంకేతమనిపేరు. అనఁగా భగవన్నామమును సంకేత మొనర్చి పలుకుట. ఒకచోట దొంగలున్నారు. ఒకానొకనికడ ధనమునుగాంచి "నారాయణ నారాయణ" అని అఱచును. అనఁగా అతని దగ్గఱ నాణెముల నారాయణ కలఁడని అర్థము. రెండవవాడు "వాసుదేవ వాసుదేవ" యనును. అనగా వాసము తీసికొనివచ్చి యీతనిని తఱుముమని అర్థము. మూడవవాడు "దామోదర దామోదర" అనును. అనఁగా నీతని నడుమునకు త్రాడును గట్టి బంధించుమని అర్థము. నాల్గవవాడు "హరి హరి" అనగా వీనివద్ద నున్న సొమ్మును హరించుమని అర్థము.

ఇంకొక సంకేతము మనస్సుతో భగవంతుని స్మరించుచు, బయటకు నామమును నోటరానీయకుండుట. ఈ విషయమున మీకొక దృష్టాంతమును వినుడు. ఒక ముసలిదానికి చాలమంది పిల్లలు కలరు. ఆమె మంచిదేకాని ఆమెలో నొక మూర్ఖతకలదు. ఆమె యెన్నడును భగవన్నామమును బలుకదు. అంతేకాదు భగవన్నామమునే పేరుగాఁ గలవారిని గూడ వారినామముతోఁ బిలువదు. ఒకనిపేరు హరిప్రసాదు అనియుండిన వానిని "పిస్సూ" అనును, భగవాన్ దాసని యుండిన "దస్సూ" అనును. కృష్ణచంద్రుఁడని యుండిన "చందూ" అనును. దీనికై కొడుకులు పరితపించుచుండిరి. పొరపాటుననైన భగవన్నామమును బలుకదు. ఈమె తప్పక నరకమునఁ బడునని వారి యూహ. ఒక్కసారి నే విధముగనైన నీమె నోటినుండి భగవన్నామము వెడలెనా నరకమునుండి రక్షింపఁబడునని కొని వారామెను మఱపించి యడవికి గొనిపోయిరి. అచ్చట హరిణమునుజూపి వారిట్లనిరి :- "అమ్మా! ఇదేమి పశువు" ఆమె హరిణమన్ని పలుకుననియు ఆ నామములో హరియను నామముకలదు కనుక ఆమె తరించుననియు వారి యూహ. కాని ముసలిది జాగ్రత్తకలది అమె యిట్లు

నెను :— "బిడ్డలారా ! ఇది కుదుపరియనెను. అనఁగా నది కుదుకుచు వెళ్ళును. గావున కుదుపరి యైనది."

కొడుకు లిట్లనుకొనిరి :- "అమ్మ గొప్ప మొండిది" అంతలో నొక అరామము కనబడెను. "అమ్మా ! ఇదేమి"టని యడిగిరి. అది చెట్లగుంపనెను.

ఈమె యిట్లు పొరపాటు పడదని గ్రహించి, యీమెనొక పాడు బావిలోఁ బడవేసిన "హా రామా !" అనియైన నందుఅవలె నలుచునని ఒక నీరులేని బావిలోఁ బడవైచిరి. దానిలోఁబడి ఆమె "వాహ్ వాహ్ వాహ్ వాహ్" అని యరవసాగెను. అప్పుడామె నిష్ఠకు సంతోషించి భగవంతుడు చతుర్భుజ రూపమున దర్శన మొసంగెను."

ఇట్టి కథయే యింకొకటి కలదు. ఒక మంచి రాజు కలడు. కాని యాతఁడెన్నడును భగవన్నామమును బలుకడు. పతివ్రత యగు నాతని రాణికి దుఃఖము చెందుచుండెను. ఆమె అనేకోపాయము లొనర్చినను అతని నోటినుండి భగవన్నామము రాలేదు, ఒక దినమున రాత్రినిద్రలో రాజు "రామ" అనెను. దానికామె సంతసించి ప్రాతఃకాలమున గొప్ప ఉత్సవము గావించెను. రాజిట్లడిగెను :- "ఇవ్వేళ ఉత్సవ మెందులకు?" రాణి సంతోషముతో నిట్లనెను :— "రాత్రి మీ నోటినుండి "రామ" అను శబ్దము వెలువడినది. ఆశ్చర్యముతో రాజిట్లడిగెను :- "ఏమి ? నా నోటినుండి "రామ" అను శబ్దము వెలువడినదా ? యని రామయని ప్రాణము విడిచెను. ఇదియునొక విధమగు నామనిష్ఠయే కాని నామమాహాత్మ్యమందిట్టి నిష్ఠ ఉత్తమమని చెప్పఁబడలేదు. నామనిష్ఠలో నుత్తమ నిష్ఠ యేమనఁగా నున్నదున్నట్లుగా భగవానుని సుమధుర నామములను బలుకుడయే. ఏదైన సంకేత మొనర్చిన భగవన్నామముతోడనే సంకేత

మొనర్పవలెను. ఎవరినైనఁ బిలిచిన భగవన్నామము తోడనే పిలువ వలెను.

అంత శౌనకుఁ డిట్లనెను :— "సూతా! పరిహాసమున భగవన్నామము నెట్లు బలుకుచుందురో మాకు చెప్పవలయును."

ఇది విని నవ్వుచు సూతుఁ డిట్లనెను :— "మహారాజా! ఇది చాల మనోహర విషయము. దీనిని నేను మీకు మంచి దృష్టాంతముల నిచ్చి చెప్పెదను. మీరు శ్రద్ధగా శ్రవణము చేయవలయును."

## నవ్వులాట కనిన భగవన్నామమును శ్రేయస్కరమే

## 361

శ్లో॥ సాంకేత్యం పారిహాస్యంవా స్తోభం హేళన మేవ వా।
వైకుంఠ నామగ్రహణ మశేషాఘహరం విదుః ॥

శ్రీ భాగ. ౬. స్కం. ౨. అ, ౧౪ శ్లో॥

గీ॥ బిడ్డపేరు పెట్టి పిలుచుట విశ్రామ
కేలినైన మిగులఁ గేలినైనఁ
బద్యగద్యగీత భావార్థములనైనఁ
గమల నయనుఁదలఁపఁ గలుషహరము ॥

శ్రీమదాంధ్రభాగవతము.

లోకములో నెగతాళికైనను భగవన్నామమును బలికినవాఁడే ధన్యుడు. మానవు దేవస్తువును చినిన నట్టి లేపే వచ్చును. విషయాసక్తు లెల్లప్పుడు విషయములందే నిమగ్నులై యుందురు. అందువలన వారు నవ్వులాటకైనను నట్టి ఘృణిత వాక్యములనే పలుకుచుందురు. తల్లి, చెల్లెలు, కూఁతురు వరుసలతోఁ దిట్టుచుందురు. కర్ణ, నయన, ముఖ, హృదయాదులను లక్షించి ఘృణిత సంకేతము లొనర్చి, వానిని గూర్చి యనకూడని వాక్కులను బల్కుదురు. ఇట్లు చేయుటచే వారికి సుఖము కలుగును. ఇట్టి దుర్వినోదము లొనర్చి వారు వాతావరణమును దూషిత మొనర్తురు, దీనికి విపరీతముగ సాధుసజ్జనుల వినోదము భగవత్సంబం ధముగ నుండును. వారు నవ్వులాటలకైనను భగవన్నామ గుణములనే కీర్తించుచుందురు. ఏలననఁగా వారికి రోమరోమమున రాముడే రమించు చున్నాడు.

శౌనకుఁ డిట్లడిగెను :— "సూతా! పరిహాసముననను, నవ్వు లాలకును భగవన్నామము నెట్లు పలుకుదురో చెప్పుము ?"

అంత సూతుఁ డిట్లనెను :— "స్వామీ! మీరు చూచియేయుందు వచ్చును. కొందరు సాధువుల యెదుట "రాధేశ్యామ్" అని యంటిమా కోపపడి, కొట్టవచ్చెదరు. అట్టివానినిఁ జూడఁగనే పిల్లలు 'రాధేశ్యామ్, రాధేశ్యామ్' అని కేకలు వేయుచుందురు. అప్పుడాతడు వారి వెంబడిపడి పరువిడి కొట్టఁబోయి "సీతారామ్ సీతారామ్" అనుమనును, వారందరు నుల్లాపమున "రాధేశ్యామ్ రాధేశ్యామ్" అని కవ్వించెదరు. అంత నాతడు వారిని 'సీతారామ్' అనుమనును. వారు "బాబాజీ! రాధేశ్యామ్ రాధేశ్యామ్" మీరనుఁడని పలికెదరు."

వాస్తవమున నాతని ప్రయోజనము రాఘవేశ్యాసునినఁ గోపమునఁ గాదు. ఏదోవిధమునఁ బిల్లలచే భగవన్నామమును జేయించుటయే తాత్ప ర్యము. సాధువులు పరస్పరము నిట్టి వినోదమునే చేసికొనుచుందురు. మునులారా ! ఈ విషయమున నేను మీకొక ప్రాచీనమైన వినోదకరమగు నితిహాసమును వినిపించెదను. దానిని మీరందఱు దత్తచిత్తులరై వినుడు."

ఇద్దరు వైష్ణవులుండిరి. ఒకడు రామభక్తుడు, రెండవవాడు కృష్ణ భక్తుడు. ఇద్దరును భగవంతుని కనన్యభక్తులే. ఇద్దరకును భగవత్సాక్షా త్కారము కలదు. మార్గములో నొక్కమనస్సు కలవారిద్దరు పయనించు చుండినచో నాడుచుఁ బాడుచుఁ బోవచ్చును. అప్పుడు ప్రయాణపు శ్రమ యుండఁజాలదు. ఇద్దరు పరస్పరము ప్రేమించుకొనుచుండిరి. ఇద్దరును తోడు తోడుగా యాత్రఁ జేయఁదలఁచిరి.

సూతుఁ డిట్లనెను :— "మునులారా ! కొందఱెల్లప్పుడును ముఖమును మాడ్చుకొనుచుందురు. వారినిఁ జూడఁగనే భయము వేయు చుండును. ఎవ్వరితోడను నవ్వరు, పలుకరు, సింహమువలె నెల్లప్పుడును గర్జించుచుందురు. సర్పమువలె బుసలు కొట్టుచుందురు. ఇట్టి శుష్క ప్రకృతిగల వారికడ కెవ్వరును స్వేచ్ఛగా బోరు. వారితో నేదైనఁ బని యుండిన నది వేఱుమాట. దీనికి విరుద్ధముగా కొందఱు సరస ప్రకృతి కలవారుందురు, వారి ముఖ మెల్లప్పుడును పుష్పమువలె వికసించి నవ్వు చునే యుండును. మాటలాడుచో నవ్వుచు మాటలాడుచుందురు. ప్రతి మాటకు పకపక నవ్వుచు వినువారి చిత్తమానందించునట్లును, ద్రవించు నట్లును, సరస వినోదపూర్ణమును, పూర్ణ సాహిత్యక భద్రభాషలో సంభా షించుచుందురు. ఇట్టివారింక కొంచెము మాటలాడినఁ జాలుననిపించు

చుండును. పిల్లలుకూడ ఎవరినిగాంచి చనువుగా మాటలాడుట కిచ్ఛగించె
దరో యువకులు తమ తోడివాఁడని నిస్సంకోచముతో మాటలాడెదరో,
వృద్ధులును దమ సన్నిధానమున నుండుటను గాంచి సంతోషించెదరో అట్టి
పురుషులే సర్వప్రియు లగుచుందురు. ఇట్టివారి కద కెన్నడును విషాదము
రాదు వారెల్లప్పుడును మగ్నులై యుందురు. ఇట్టివారు లోకములోఁ
బ్రతిష్ఠను సంపాదించెదరు. ఇట్టి ప్రకృతి గలవారు భగవద్భక్తులేయై
యుండిన నింకఁ గావలసినదేమున్నది ? ఈ యిద్దరు వైష్ణవు లట్టివారే.
ప్రతిమాటకు వినోదము గావించుచు సుఖముగఁ దమ కాలమును గడుపు
చుండిరి. ఇద్దరును బరస్పరము పరియాచకము లాడుకొనుచుందురు.
రామభక్తుడు నిద్ర లేవగానే యిట్లనును :- "జయ జయ సీతారామ"
కృష్ణభక్తుడో "జయ శ్రీ గోపాలకృష్ణకు జయ" అనును. అతఁడిట్ల
నును :- "నీవు లేవఁగానే యే చోరుని నామమును బలుకుచున్నావు ?"
కృష్ణభక్తుఁ డిట్లనును :- "కోఁతి కలలోఁ గనబడెనా ఆ దినమంతయు
ననిష్టము జరుగవలసినదే. అటియెడ నీవు వానరనాథుని నామమును బలి
కితివి" అని యీ విధముగ నవ్వులాట లాడుకొనుచుందురు"

ఇద్దరును బృందావనములో నివసించుచుండిరి. రామభక్తుఁ డిట్ల
నెను :— "సోదరా ! ఈ అరణ్యములో నెచ్చట నుండెదవు? ఇచ్చట
మంచిచెట్టును లేదు. మృదువగు నేలయును లేదు. వృక్షములన్నియుఁ
దుమ్మ, సీమచింత, జెముడు మొదలగు కంటకయుతములే, నేలయంతయు
రాళ్ళు, రప్పలతోఁ గూడినది. ఒక్కసారి మా రఘుకులమండన మహా
రాజాధిరాజు శ్రీరామచంద్రుని రాజధానియగు నయోధ్యాపురిని దర్శిం
పుము. దానిఁ జూడఁగానే నీ వీ కంటక వనమును మఱచిపోఁగలవు.
అచ్చటి మృత్తిక యెంత మెత్తనిది ! పతితపావని యగు సరయూనది

జలమెంత నిర్మలమైనది! అచ్చటి వారెంతటి సభ్యులు రాజధాని యా రాజాధిరాజుది కదా! గొల్లల గోవులమందగాని, కొట్టములుగాని అచ్చట లేవు. ఇచ్చట సౌధప్రాసాదము లేవియును లేవు. నెత్తిన బెట్టుకొనిపోవు గూడలు మాత్ర మున్నవిచ్చట. ఒక వనము నుండి యా వనమునకును, ఆ యడవినుండి యీ యడవికిని వెళ్ళుచుండవలసినదే కదా కుంపటివలె ఎచ్చటికి వెళ్ళిన నచ్చట అన్నము మూట చిక్కములు పోవలసినదే కదా!"

అంత కృష్ణభక్తుఁ డిట్లనెను :— మీ రాజరాజేశ్వరుని కడకు యాచకులును, న్యాయకాంక్షులు వెళ్ళవలసినదే కదా! నాకు మాగోపాలుని తోడనే పనిగలదు. అయితే అయోధ్యను జూడవలయునని నాకునుగలదు, ఏలననఁగా నది మా గోపాలుని యత్తవారిల్లు. మా కమ్మమ్మగారిల్లు.

కోపముతో రామభక్తు డిట్లనెను :— "పో, పో, అమ్మమ్మ గారట గొల్లవారు రాజకన్యకలను బెండ్లాడుట యటుంచుము, రాజభవనము లోనికి అడుగిడుటకు వీలున్నదా ?"

అంత నవ్వి కృష్ణభక్తుఁ డిట్లనెను :— "నీవు శాస్త్రీయవిషయ మున గూడ అసత్య మనుచున్నావే. రాధాదేవికంటెఁ గృష్ణున కన్యమగు భార్య యున్నదను సంగతి నాకిదివఱలోఁ దెలియదుకాని నేనొక దినమున భాగవతమును జదువుచుండగాఁ శ్యామసుందరుడు ద్వారకాధీశుని వేష మును ధరించి కోసల రాజకన్యను వివాహమాడిన సంగతి తెలిసినది. ఇంకను నబద్ధ మనుకొనినఁ బండితుల నడుగుము."

రామభక్తుఁ డిట్లనెను :— "నీ యిష్టము ప్రకారమేనులే పోవుదము పద."

ఇద్దరును నవ్వుచుఁ బాడుచుఁబోయిరి. ముందుకుఁబోఁగా ఒకనగర సమీపమున సరిహద్దు శుల్కమును వసూలు చేయుచోట వస్తువులను దూచుటకొక పెద్ద తక్కెడ కట్టఁబడియుండెను. రామభక్తుఁడిట్లనెను :— "మా సీతారాములు చాల గొప్పబరువు" అంతఁ గృష్ణభక్తుఁ డిట్లనెను :— "ప్రోవొమ్ము! ఎక్కడివాఁడవయ్యా! మీ మహారాజుకు రాత్రింబవళ్ళు రాజ్యపు చింతయే. అతఁడెట్లు గొప్పబరువు కాఁగలడు? ఏ చింతయుఁ జీకును లేని మా గోపాలుఁడే గొప్పకాగలడు. ఆనందముగా గోవులను గాచుకొని, పాలుత్రాగును, కఱ్ఱసాముచేయును, మల్లయుద్ధ మొనర్చును, హాయిగాఁ బరుండును, "చింతా సమాన శరీర శోషణమ్" అంత రామ భక్తుఁడిట్లనెను :— "అబ్బాయీ! పోనీయవయ్యా! ఎందుకు బడా యిలు కొట్టెదవు ఎక్కడనైన జోరుఁడు గొప్పవాడు కాఁగలఁడటయ్యా! దొంగసొమ్ముతో గొప్పవాఁడైన వాఁడెచ్చటనైనఁ గలఁడా? పురుషార్థ ములచేఁ దిను రాజాధిరాజే బలియును" అంతఁ గృష్ణభక్తుఁ డావేశముతో నిట్లనెను :— "మా ప్రజ మండలములోనే మా గోపాలుని దుర్బ లునిగాఁ బలుకున్నావే. తూచుము." అనుచు నొక్క దుముకు దుమికి కృష్ణభక్తుఁడు "జయగోపాల" యని తక్కెడకు ఒక పళ్ళెరములోఁ గూర్చుండెను. ఇంతలోనే రామభక్తుడు కూడ "జయ సీతారామ" యని రెండవ పళ్లెరములోఁ గూర్చుండెను. చూచుచుండఁగనే కృష్ణభక్తుని పళ్లెరము పైకిలేచిపోయెను. రామభక్తుని పళ్లెరము నేలపైకి కూడ లేవ నంత బరువయ్యెను. అప్పుడు రామభక్తుడు చప్పట్లు చఱచుచు "నవనీత చోరుని బలము బయటపడినది. మా గోపాలుఁ డిట్టి వాఁడట్టి వాఁడని తెగ కేకలు వేసితివే. నేను మొదటనే చెప్పలేదా రాజు రాజే గొల్ల గొల్లయే నని వన వనమునఁ దిరుగుచు గోవులను కాయువాఁ డెక్కడ? ఛత్ర

చామర మందిరుఁడై సువర్ణ రత్నఖచిత సింహాసనమునఁ గూర్చుండి రాజ్యముచేయు వాఁడెక్కడ ? వీరిద్దరకును నాకాశ పాతాళముల కున్న అంతరమున్నది."

ఇట్లు జరుగుటచేఁ గృష్ణభక్తుని ముఖము వాడిపోయెను. చాల చింతగానుండెను, ముఖము వ్రేలవేసికొని ఒక ప్రక్కకుఁబోయి నిలువ బడియుండెను. ఇంతలోనే నల్లని కంబళిని ధరించి, చేతఁగఱ్ఱను బట్టు కొని శ్యామసుందరుఁడు కనఁబడెను. రాఁగానే అతఁ డిట్లనెను :— "ఏలనయ్యా చాల చింతగానున్నావు ?"

ప్రేమ కోపమున భగవంతుని గద్దించుచు భక్తుఁ డిట్లనెను :— "పో పొమ్ము ; నాతో మాటలాడవలదు. నేడు నీవు నా పుట్టి ముంచితివి. ఇప్పుడింత తేలికయైతివి. తృణావర్తుఁడు నిన్నెత్తుకొని పోవునపుడు బండవలె బరువైతివి. అంత గోవర్ధన పర్వతమును వ్రేలిపై ధరించితివి. ఇప్పుడు పూవుకంటె నతిసుకుమారుఁడ వైతివి ?"

గోపాలుఁ డత్యంత ప్రేమతో నిట్లనెను :— "ముందుగా నా మాటను వినుము. సీతారాము లిద్దరు వధూవరులు. నేనొక్కఁడను. అందులోఁ బిల్లవాఁడను. వారితో నెట్లు సరితూగ గలను ? సరిగా నాలో చింపుము. నన్ను గూడ వధువుతోఁ గూడి పిలిచినచో నా శక్తి చూడవ చ్చును. మైథిలీ సీతాదేవి దుర్బల, బక్కది అత్యంత సుకుమారి. కాలి నడకలు నడచుటకు సంకోచించును. నిరంతరము పాలు, పెరుగు, వెన్నను దిను గోపికతో నామె యెట్లు సరిపోలఁగలదు ? పొరపాటు నీదియా నాదియా ?"

ఇది వినఁగానే కృష్ణభక్తుఁడు పరువిడిపోయి "జయ జయ రాధే

శ్యామ్" అనుచు మరల ౘ్రాసులోఁబోయి కూర్చుండెను. కవ్వించి కృష్ణ భక్తుఁడు "ఇప్పుడురమ్ము తెలియు"ననెను.

నవ్వి రామభక్తుఁ డిట్లనెను :— "అబ్బాయీ ! వీరములు పలుకకు, ఎవ్వరైన నేర్పిపంపినారా యేమి నీకు ? పందెమనిన నొక్కసారియే యుండును. సరకు తరాజుమీఁద నొక్కసారియే వేయవలెను. జయ పరాజయ నిర్ణయ మొక్కసారియే జరుగును. ఇప్పటికి అయిపోయినదేమో అయినది. ఇఁక నీ పప్పులుడుకవు," అనుచు రామభక్తుఁడు ముందు నడచెను. అతని వెనుకనే గంత్కబొంత, కమండలును దీసికొని కృష్ణభక్తుఁడును బయలుదేరెను.

నగరమును దాఁటి యిద్దరును పచ్చనిగరిక దుబ్బులుగల యమునా పులినమును జేరిరి. మరకత మణివలె నీలవర్ణముగల గరిక సూర్యనందని యగు యమునా తటమున దూరమువఱకు నీలవర్ణ జలద్యుతితోఁ బాటుగా నత్యంత దీప్తమతియై ప్రకాశించుచుండెను. ఇట్టిసుందర దూర్వనుగాంచి రామభక్తుఁ డిట్లనెను :— "ఆహా ! ఎట్టి సుందరమగు పచ్చగడ్డి ! దీనిలో మా రాజాధిరాజును కౌసల్యా కిశోరుఁడునగు శ్రీరామచంద్రుని గుఱ్ఱములు మేయవచ్చును. చక్రవర్తి గుఱ్ఱములు ఈ పచ్చని గరికను దిని చాల ప్రసన్నతను జెందును.

అంతఁ గృష్ణభక్తుఁడు మండిపడి యిట్లనెను :— "పోవయ్యా ! వచ్చినాఁడు గుఱ్ఱముల మేపుట కెచ్చటినుండియో ! గుఱ్ఱము లిచ్చట నడుగిడెనా మా గోపాలుని గోవులు వాని పొట్టలలోఁ దమ సునిశిత శృంగాగ్రములచేఁ బొడువఁగలవు. పచుల గడ్డిని మేసవలయునని మనస్సులోనైన ననుకొనరాదు."

రామభక్తుఁడు తీవ్రమునకు వచ్చి యిట్లనెను :— "ఒడలు దగ్గఱ పెట్టుకొని మాటలాడవలెను. పరులగడ్డి యెచ్చటిది? మా చక్రవర్తి మహారాజు ఈ సమస్త భూమండలమునకును స్వామి సమస్త నదనదీ శైలకాననయుతమగు వసుంధర కాతఁడ ధీశ్వరుఁడు. సమస్త బ్రహ్మాండమున నాతని కాధిపత్యము కలదు. సమస్తమున కాతఁడు ప్రభువు. ఇట్టి గొల్లలెంద ఱాతని రాజ్యములో నివసించుచున్నారో అతఁడీ వనమునకే కాదు. త్రిలోకాధీశ్వరుఁడు. గుఱ్ఱముల నెచ్చట మేపు కొన్నను నాతని నడ్డగించు వారెచ్చటనున్నారు ?"

కృష్ణభక్తుఁ డిట్లనెను :— "ఇదిగో, మితిమించి మాటలాడకుము. బడాయిలు కొట్టకుము. మీ రాజు త్రిలోకాధీశ్వరుఁడైన నగుఁ గాక; కాని మా మధుర మూఁడు లోకములకు మించినది. ఇచ్చటికెవ్వరి గుఱ్ఱములు వచ్చినను వాని పొట్టజీల్చి పారవేయఁబడును. ఒక్కదానినైన గొంచెమైన ముందుకుఁ బోనీయము. పైఁగాఁ గొఱడాలతో బాదెదము. అటునిటు బరుబిడఁ జేతుము."

అప్పు డింకేమున్నది? రామభక్తునకుఁ గోపము వచ్చి యిట్లనెను :— "మా గుఱ్ఱములను గొఱడాలతోఁ గొట్టగల వాఁడెవఁడయ్యా ఇచ్చట రవికులభూషణ, దశరథనందన, చక్రవర్తి కౌసల్యానందవర్ధనుని హృష్టపుష్టములగు గుఱ్ఱములు మేయును. వాయు ప్రసారమున మేఘపంక్తులు విడిపోవునట్లు వానిముందు గోవులు పాఱిపోఁగలవు. తోడేళ్ళు రాఁగానే గొఱ్ఱెలు పాఱిపోవునట్లు పాఱిపోవలసినదే."

అప్పుడు కృష్ణభక్తుఁడు కోపోద్రిక్తుడై యిట్లనెను :— "ఇదిగో, ఇఁక నీవు నోటికి తాళము వేసికొనవలెను. ఇచ్చటికి గుఱ్ఱము లడుగైన

విడలేవు. తినుట సంగతి యట్లుంచుఁడు గుఱ్ఱములీ వైపునకుఁ జూడనైన జూడఁజాలవు,"

అంత రామభక్తుఁడు మండిపడి యిట్లనెను :— "నీవేమైన నను ము గుఱ్ఱములు మేసితీరగలవు."

కృష్ణభక్తుఁ డిట్లనెను :— "గుఱ్ఱములు మేయలేవు, మేయలేవు ముమ్మాటికిని మేయఁజాలవు."

అంత రామభక్తుఁ డిట్లనెను :— "మా రాముని గుఱ్ఱములవశ్యము మేయఁగలవు. మేయగలవు ఆవశ్యము మేయఁగలవు. నీవుచేయగలిగినదేమో చేయుము."

అంత నేమైనది. కృష్ణభక్తుఁడు లేచి రామభక్తుని బడవైచెను. రామభక్తుడు కొంచెము బలముకలవాడు. అతడు కృష్ణభక్తుని గ్రిందపడ వైచి పైనఁ గూర్చుండెను. అతడు మోఁకాళ్ళతో నలుపుచు "ఇప్పుడు చెప్పుము గుఱ్ఱములు మేయునా అవులు మేయునా ?" యనెను.

ఇప్పుడు క్రిందనున్న కృష్ణభక్తుని పనియైపోయెను. అపజయమును బొందనవానికి హరినామము తప్ప యింక గతి యేమున్నది? అతడు పెద్దగా నఱచుట ప్రారంభించెను. "గోపాలా ! రావయ్యా ! రావయ్యా ! గడ్డిమీఁద యధికారము పోవుచున్నది. గుఱ్ఱముల గడ్డిని మేయనీయకదయ్యా."

కృష్ణభక్తుడు తన స్వామినిఁ బిలుచుటను గాంచి రామభక్తుడును బిలువసాగెను :- "రఘుకులమండన మహారాజాధిరాజ శ్రీ రఘుకుల తిలక శ్రీరామచంద్రా ! గడ్డిమీఁద గోపాలున కధికారము వచ్చుచున్నది త్వరగావచ్చి స్వాధీనపఱచు కొనవయ్యా !"

ఇంతలోనే ఒక పెద్ద గోవులమంద వచ్చుట కనఁబడెను. బాగుగా బలిసిన అందమైన గోవులు వాటి గంగడోళ్ళు నూగించుకొనుచు, పూడ

లతో మంథరమువలె వచ్చుచుండెను. వాటివెనుక మయూర మకుటధారియు వనమాలియు, మురళీధారియు, గోపవేషధారియు నగు గోపాలుడు కఱ్ఱబట్టు కొని వచ్చుచుండెను. ఇద్దఱు వైష్ణవులు పోరాడుకొనుటనుగాంచి యాతడు నిలుచుండి సరళ స్వభావముతో నిట్లనెను :- "ఏలనయ్యా ? మీరిద్దఱు తగవులాడుకొను చున్నారు ?"

కృష్ణభక్తుని సంతోషమునకు మేర లేకుండెను. ఎదుట తనకున్న బలమును జూచుకొని యాతడు పులివలె గర్జింపసాగెను. రామభక్తుడు పిరికివాఁడయ్యెను. వెంటనే వానిని వదలి యపరాధివలె నిలువఁబడెను.

భగవానుఁ డిట్లనెను :— "ఓయీ ! మీరిద్దఱును వైష్ణవులయ్యు పోరాడుకొను చున్నారేల ?"

ధైర్యముతో కృష్ణభక్తుఁ డిట్లనెను :- "అసలు పోరాట మేమనఁగా స్వామీ ! ఇతడు గుఱ్ఱములువచ్చి గడ్డిమేయు ననుచుండెను. గుఱ్ఱములెట్లు మేయఁగలవు ? గడ్డి గోవులది. గుఱ్ఱములు వచ్చినవా కేశికి పట్టిన గతియే పట్టునంటిని."

ఇది విని భగవానుడు నవ్వి యిట్లనెను :— "ఏమయ్యా ! పోట్లాడుకొనవలసిన పని యేమున్నది ! గోవులగడ్డి అగునుగాక ! అవి మేయుచునే యున్నవి. పోట్లాడుకొనకుడు. భగవన్నామమును స్మరింపుఁడు."

ఇట్లు మాట్లాడుచుండఁగనే గోవులు దాఁటిపోయెను. వాటిని మళ్ళ వేయుటకు గోపాలుడు పరుగిడి, అచ్చట నిమిషములో నదృశ్యుడయ్యెను.

ఇంతలో నాలుగు గొప్ప శ్వేతాశ్వములు మిక్కిలి వేగముగ వచ్చుటను వైష్ణవు లిద్దఱును గాంచిరి. ముందునున్న గుఱ్ఱముమీఁద

గిరీట మకుటాంగదములను ధరించి ధనుర్బాణములతో అయోధ్యాపతియు రఘుకుల తిలకుడును, కౌసల్యానంద వర్ధనుడునగు శ్రీరామచంద్రుడు విరాజిల్లుచుండెను. వెనుకనున్న మూడు గుఱ్ఱములమీఁద లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు అంగరక్షకులవలెఁ బయలుదేరి వచ్చుచుండిరి. రాఁగానే మహారాజాధిరాజగు నయోధ్యా నగర చక్రవర్తి శ్రీరామచంద్రుఁ డిట్లనెను :- "ఏమిటయ్యా ఈ గోల."

రామభక్తుడు రోషముతో నుండి ముఖము త్రిప్పుకొని అలిగి యిట్లనెను :— "ఏమున్నది పట్టి ? ఇప్పుడేమున్నది ? కావలసిన దేమియో అయిపోయినది. గద్దిమీఁద గోపాలున కధికారము ప్రాప్తించి నది. ఇప్పుడు గోవులు మేయుచున్నవి. జాగ్రత్త కలవారంతయును బొందిరి. నిద్రించువాడు నిద్రించెను. వెనుంబడినవాడు వెనుకనే బడి పోయెను."

శ్రీరామచంద్రు డత్యంత స్నేహ స్వరముతో నిట్లనెను :— 'అయ్యా ! నా మాటను ముందువిను. ముందు నా మాట వినిన తర్వాత గోపపడవచ్చును. గోపాలు రెల్లప్పుడును వనములలోనే చరించుచుం దురు. వినఁగానే పరుగిడివచ్చెను. నీవు నన్ను చక్రవర్తిఁ బిలిచితివి. అందువలన మొదట నీ సంగతి మంత్రికడకుఁ బోయెను. అంత సప్త ప్రాకారములు దాటి అంతఃపురమున కీవార్త యందెను. అచ్చట నుండి గుఱ్ఱములను సిద్ధపరుప వలయునను నాజ్ఞ యీయబడినది. ఇవన్నియు సిద్ధమైన తర్వాత రాజ లాంఛనములను ధరించి మేము వచ్చితిమి. ఇంత లోనే గోపాలుఁ డధికారమును సంపాదించెను. ఇప్పుడు పోట్లాడుకొన వలసిన పనిలేదు. సగము గోవులును సగభాగము గుఱ్ఱములును మేయఁ గలవు."

ఇప్పు డిద్దరును ముందుకుబోయిరి. వెళ్ళి వెళ్ళి అయోధ్య కీవైపు నకుఁ జేరుకొనిరి. ఇద్దరును నౌకనెక్కి యావలి యొడ్డునకుఁ వెళ్ళవలసి యుండెను. ఇద్దరును నౌకనెక్కి యావలి యొడ్డునకు జేరుకొనిరి. ఆ వైపునఁ గొంచెము బురదకలదు. నీరు మోకాళ్ళలోతు కలదు. అందరును నౌకనుండి దిగి ఆవలియొడ్డున నున్న జలములో దిగి వెళ్ళసాగిరి. రామభక్తుడును నావలి యొడ్డునకుఁ జేరుకొనెను. కేవలము కృష్ణభక్తుడు మాత్రము నౌకలోఁ గూర్చుండెను. ఒడ్డునఁగూర్చుండి రామభక్తుడునవ్వి యిట్లనెను :- "ఇంతేనా నీ ధైర్యము. మోకాళ్ళలోతు నీటిలో దిగిరాలేవా యేమి!" కృష్ణభక్తుడక్కడే కూర్చుండి యిట్లనెను :— "నేను రూపాయి నిచ్చెదను లేదా రెండురూపాయి లిచ్చెదను. నన్నెవరైన భుజముమీఁద గూర్చుండఁ బెట్టుకొని యావలి యొడ్డునకుఁ జేర్చుడు" రామభక్తుడిట్లనెను :— "ఇచ్చట మహారాజాధి రాజుయొక్క రాజధాని కలదు. బలవంతులైనవారు స్వయముగ దిగిరావలయును."

కృష్ణభక్తు డిట్లనెను :— "అన్నా! ఏమి చెప్పుమును. నేనిచ్చటికి వచ్చి యిరుకుకొని పోయితిని. నేను మోకాటిలోతు నీటికొఱకు భయపడుటలేదు. యమునానది యైనచో నేను వర్షాకాలములో నైనను, వరదలలో నైనను నేనావలి యొడ్డునకుఁ బోఁగలను. సరయూనదీజలము శరీరమునకు సోకెనా అట్టివారు సాకేతమునకుఁ బోగలరని వినియున్నాను నేను సాకేతమునకుఁ బోను. నేను గోలోకమునకుఁ బోవలయును. అందువలన నేను సరయూనదీ జలమును స్పర్శింపను."

ఇది వినఁగానే రామభక్తుడు వాని పాదముల మీఁదఁ బడెను. "సోదరా! నీకిట్టి నిష్ఠ యుండినందులకు నీవెంతయో ధన్యుఁడవు.

నాకుఁగూడ నట్టి నిష్ఠ కలుగునుగాక :" ఈ విధముగా వారు శ్రీరాముని శ్రీకృష్ణుని బెట్టుకొని పరస్పరము హాస పరిహాసములు చేసుకొనుచుండెడి వారు.

సూతుఁ డిట్లనెను :— "మునులారా ! పరిహాసమునకైనను భగవన్నామమును బలికిరా వారికి మేలే కలుగఁగలదు. భగవానుఁడు వారి యెడల గృప కలిగియుండును. భజనము సంగీతము పాడునప్పుడు "రామా — —" "కృష్ణా — —" అని రాగాలాపనము చేసినను; రామ రామయనిన నేమి ప్రయోజనమని యవహేళన మొనర్చినను భగవదనుగ్రహమునకుఁ బాత్రులగుట కేవిధమగు సందేహమును లేదు. ఇంత సేపూరక కృష్ణకృష్ణయని కొట్టుకొనెదరేమి" యన్నను భగవదనుగ్రహ పాత్రులై ఉద్ధరింపఁబడుదురు.

## హరి నామోచ్చారణము చేతనే పాపహరణ మగును

## 362

శ్లో॥ పతితః స్ఖలితో భగ్నః సందష్ట తప్త అహతః॥
హరిరిత్యవశేనాహ పుమాన్నార్హతి యాతనామ్॥

శ్రీ భాగ. ౬ స్కం. ౨. అ. ౧౫ శ్లో॥

ఉ॥ కూలినచోటఁ గొట్టువడి కుందినచోట మహాజ్వరాగులం
బ్రేలినచోట సర్పముఖ పీడల నందినచోట నార్తులై
తూలినచోట విష్ణు భవమూరునిఁ బేర్కొని రేని మీఁద న
క్కాలుని యాతనావితతిఁ గానరు పూనరు దుఃఖభారముల్

శ్రీమదాంధ్రభాగవతము.

అస్తిత్వము కలవాఁడు నామము తనకుఁ గావలయునని గోరును నామమును గోరని వానికి అస్తిత్వమేలేదు. జ్ఞాని దృష్టిలో నామరూపములు మిథ్యలు. కావున నతఁడేమియును గోరడు. జ్ఞాని మోక్షమును గూడ కోరడు. బంధముండినఁగదా మోక్షమును గోరుటకు జ్ఞానిదృష్టిలో బ్రహ్మాతిరిక్తమగు వస్తువేదియును లేదు. కాని భక్తుని దృష్టిలో రెండు వస్తువులును సత్యములే. అది భగవంతుని నామరూపములు. నోట భగన్నామోచ్చారణము జరుగుచు, హృదయమందాతని యనుపమ సౌందర్య మాధుర్యయుక్త మనమోహన రూపమాధుర్యము వ్యాపించి, యీ ఇంద్రియములు మనస్సు ఆతని నామరూప చింతనమందు నిమగ్నమగుట తప్ప భక్తుడు మోక్షమునుగాని వైకుంఠమునుగాని కోరడు. వానికిఁ బునర్జన్మ భయమును లేదు. జన్మ మృత్యు భయము లేదు. మనకు లక్ష జన్మలు వచ్చునుగాక ! దేవ, మనుష్య, పశు, పక్షి, కీట, పతంగ, శూకర, శ్వానాది జన్మలేవియైన లభించునుగాక, శ్రీకృష్ణ నామరసపానము లభించినఁజాలును. మనస్సు వశమగుచో నన్య సాధనాపేక్ష యేమి కలదు ? అప్పుడాట సమాప్తమైపోవును. మనస్సు భగవంతుని వైపునకుఁబోదు,

విషయముల వైపునకుఁ బరువిడుచుండును. మనస్సుతోనైనను నామోచ్చారణ మొనర్చినఁజాలును. స్వేచ్ఛచేఁ గాకున్నను బరేచ్ఛనైనను, జ్ఞానముచేఁ గాకున్నను నజ్ఞానముచే నైనను భగవన్నామమును జేయవలెను అంధకారములోఁ బడియుండిన సర్పమును నజ్ఞానముచే దానిపై నడుగిడినను నది కాటువేసితీరును. ఏలననఁగా దాని స్వభావమది. అదేవిధముగ హరినామ స్వభావము పాపములను హరించుట; దానినెట్లు సేవించినను నది దాని స్వభావమును వదలదు. ఏలననఁగా స్వభావము దుస్త్యజ్యమని శాస్త్రములు పచింపుచున్నవి."

శుకమహర్షి యిట్లనెను :— "రాజా! యమదూతలను గనుఁగొని నారాయణుని ప్రియపార్షదు లిట్లనిరి :— "మీ రీ నారాయణ పరాయణుని బంధించి నరకమునకుఁ గొనిపోవఁ జూచుచున్నారు. ఛీ ఛీ! చాల విచారకరమగు విషయము. ధర్మరాజు శాసనములోనే యిట్టి యధర్మము సంభవించుచో లోకములో నిఁక ధర్మలోపమైపోవును."

అంత యమదూత లిట్లనిరి :— "మంచిది; నిజమే, కాని యతడు పుత్రమిషచేతనైనను భగవన్నామస్మరణ మొనర్చినాడు. మేమంగీకరించితిమి కాని యీతఁడు స్వచ్ఛచిత్తముతో సావధానుఁడై నామమును బలుకలేదు. వివశుఁడై యాతనాకష్టమున నచేతనావస్థలోఁ బలికెను. స్వాములారా! అచేతనావస్థలో నెవనికైన దానపత్రమును వ్రాసి చేవ్రాలు చేయుచో నది చెల్లనేరదనియు నది దానమునకు విరుద్ధమనియుఁ జెప్పుదురు. అందువలన నీతఁడు చేసిన నామమును నియమ విరుద్ధమే యగుచున్నది."

విష్ణు పార్షదు లిట్లనిరి :— "ఈ విషయము లౌకిక సంపత్తు విషయములో సత్యమైనఁ గావచ్చునేమో కాని నామ సంబంధములో నిది

సత్యముకాదు. నామము విషయములో నియమ మేమనఁగా నేవిధముగ నైన నోటివెంట నామము వెడలినను, స్వవశుఁడై యే యదృష్టవంతు డైన నామమును స్మరించినను, వోనిండు వశమున్నంతవఱకు మానవుడు విషయ సంబంధమగు సామగ్రి నేకత్రిత మొనర్చుటకుఁ బ్రయత్నించు నపుడవశుఁడై యుండఁగా నోటివెంట భగవన్నామము వెలువడినచో వానిని గొప్ప యదృష్టవంతుఁ డనవలెను. నిండుగా నామమును బలికి నను సరియే కొంత పలికినను సరియే. శుద్ధముగఁ బలికినను నశుద్ధో చ్చారణమునఁ బలికినను నది కల్యాణమే.

ఒక యవనుడు శౌచక్రియ నొనర్చుచుండెను. అప్పుడొక యడవి పంది వాని ననుగ్రహించుటకుఁ బరువిడివచ్చెను. వామనావతారమున నుండిన స్నానముచేసి వచ్చెడిదే. వరాహమునకు శుచియనియు, నశుచి యనియు నేమున్నది ? వెనుకనుండి ముట్టెతోఁ గొట్టినది. వాడు భయపడి వివశుఁడై యార్తస్వరమున "హరామ్ హరామ్ హరామ్" అనిపలికెను. వీడు "హా రామ్ హా రామ్" అని అఱచుచున్నాఁడని యమదూతలు పారి పోయిరి. అంత భగవానుని పార్షదు లాతనిని దమ లోకమునకుఁ గొని పోయిరి. ఇది నామప్రభావము.

ఇది విని శౌనకుఁ డిట్లనెను :— "మహాభాగా ! అంత్యకాల మున నామస్మరణము మొదటినుండియు జ్ఞానపూర్వకముగఁ జేసినవానికే కలుగును. అజామిళుడు "నారాయణ నారాయణ" యని నిత్యము సర్వదా పలుకుచుండెడివాడు! కాని పుత్రుని నామమను భావముననే. అందువలన నంత్యకాలమున వీనికి నారాయణ నామము స్మరణమునకు వచ్చినది, ఇతరులకు మరణకాలమున నామస్మరణము రాదు,"

అంత సూతుఁ డిట్లనెను :— "స్వామీ ! మరణ కాలమున

నభ్యాసమగు వస్తువే స్మరణకువచ్చును. అందుకనియే సాధువులు స్పష్టోపదేశము నొసంగరు. రుచి ననుసరించి సాధకునకుఁ జెప్పెదరు. ఒకకవి యుండెడువాఁడు. అతని కతని భార్యయందత్యధికమగు ననురక్తి. భార్యను జూడక అతనికిఁ గాలము గడిచెడిదికాదు. ఒక్క క్షణమామెను జూడఁజాలకున్న నాతనికి వ్యాకులము కలిగెడిది. సత్సంగియగు తన బావమఱది ప్రేరణ సాధుని కడకుఁ బోయెను. వెళ్ళి కొంచెముసేపు కూర్చుండి తిరిగి వచ్చుచుండెడివాఁడు. వెంటనే సాధువునకు వానిపైఁ గృపాదృష్టి గలిగి, వాని వైపునకుఁ జిత్తముపోయి యిట్లనెను :— "నీవు కొంచెము సేపైనఁ గూర్చుండవు. కొంచెము సత్సంగము చేయుచుండుము"

అతఁడిట్లనెను :— "స్వామీ ! గృహిణియొక్క దేవదుర్లభ దర్శనమే నాకు గొప్ప సత్సంగము. నేనీ సంబంధ సంకోచముచే నిచ్చటికి వచ్చి వెళ్ళుచున్నాను. కాని నాకిచ్చట తోఁచుటలేదు. హృదయము వ్యాకులము చెందుచున్నది. నే నామెను క్షణమైన వీడఁజాలను."

అంత సాధువు నవ్వి యిట్లనెను :— "ఆమె వెంట్రుక లెట్లున్నవి ?" అతఁడు కవి కావున వెంట్రుకలను వర్ణింప మొదలిడెను. "స్వామీ ! వెంట్రుకల వర్ణన మేమిచేతును ? అవి నల్లపట్టుకుచ్చులవలె, ముంగరములు తిరిగి, ముద్దుగా, నందముగ, నునుపుగ, మెత్తగా, నెంతో మనోహరముగ, సుదఖస్పర్శగా—" అని యిట్లు మిక్కిలిగ వర్ణింప సాగెను.

సాధు విట్లనెను :— "మంచిది, రేపు దీనిమీఁద నొకచక్కని పద్యమాలికను రచించి తేవలయును. ఇఁక బోవచ్చును."

కవి వెడలిపోయెను. చెంద్రుపల ధ్యానములోఁ దన్మయుఁడయ్యెను. ఒక చెట్టుక్రిందఁ గూర్చుండి కవిత్వము వ్రాయుచుండెను. మఱునాడు వచ్చి సాధువునకుఁ జూపించెను. సాధువునకు మలరూపములగు గేశములతో నేమిపని ? కాని యాతనిని సరియైన త్రోవకు తీసికొని రావలయునని యిట్లనెను :- "వహ్వా వహ్వా ! నాయనా ! నీవుచక్కని కవిత్వమును వ్రాసితివి. ఏమి చెప్పుదును ? కొంచెము చదివి వినిపించుమయ్యా !"

సూతుఁ డిట్లనెను :— "స్వామీ ! తమ ప్రశంస అందఱకును బాగుండును: కాని కవి యోగ్యవ్యక్తి ద్వారా తన కవితా ప్రశంసను విని యానంద కందళితుఁ డగును. ఆ న్యాయముచేఁ గవి మిక్కిలి ప్రసన్నుడయ్యెను. ఆ సాధువు ప్రతిదినము తన భార్య యొక్క ఒక్కొక్క యంగమును వర్ణింప ప్రోత్సహించెడు వాడు. అతఁడా యాశ్రమములోనే కూర్చుండి యామె యంగ ప్రత్యంగములను ధ్యానించుచుఁ గవిత్వము వ్రాయుచుండెను. ఇప్పుడాతనికి వెఱ్ఱి తొందలలేదు. చక్కనికవిత్వము వ్రాయవలయుననియే అతని చింత. ఒక దినమున సాధు విట్లనెను :— "నీవు రెండుదినములు బాగుగా ధ్యానముచేసి నఖశిఖ పర్యంతము సుందర వర్ణనము గావింపుము." కవి సాధుపుంగవుని యాజ్ఞను శిరసావహించెను. రెండు దినములవఱకాతడు తన భార్యయొక్క అంగ ప్రత్యంగములను ధ్యానము చేయసాగెను. అతడు ధ్యానమగ్నుఁడైనపుడు సాధువు అతని దేహమును గదల్చుచు నిట్లనెను :- "అయ్యో ! నీవింత ప్రొద్దెక్కినను నింటికి వెళ్ళనేలేదే." అతఁ డిట్లనెను :- "స్వామీ ! మీరు నన్ను ధ్యానము చేయనీయుఁడు. మంచి ఆనందము కలుగుచున్నది. ధ్యానములో నామె రూప సౌందర్యము జూచుచున్నప్పటి యానందము ప్రత్యక్షముగ జూచుచున్నప్పుడు కలుగుటలేదు, నన్నిప్పుడు ధ్యానము చేయనిండు."

ఈతనికి తన భార్య యంగములందు మనస్సైకాగ్ర మైనదని గ్రహించి సాధువిట్లనెను :— "ఏమయ్యా ! ఎముకలను మాంసమును ధ్యానించుచున్నావా ? భగవంతుని దివ్యరూపమును ధ్యానించుము. ఆ రూపము ముందీ రూపము తుచ్ఛమైనది, క్షణభంగుర మైనది, అనిత్యమైనది." సాధువుయొక్క యీ యుపదేశ ప్రభావము ఆతనిమీఁదఁ బడెను. చివర కాతడు గొప్ప పారమార్థిక కవియు, సత్యచ్ఛస్థితి కలిగిన మహాత్ముఁడుగ నయ్యెను.

స్వామీ : తెలియక ధ్యానము చేసినపుడు ధ్యానాభ్యాసము కాఁగాఁ దెలియక నామస్మరణము కావించిన నామాభ్యాసము కాదా ? ఇది రూప విషయమున దృష్టాంతము. ఇట్లే నామవిషయమునను మీ యాజ్ఞయగుచో నొక దృష్టాంతమును జెప్పెదను."

శౌనకుఁ డిట్లనెను :— "సూతా ! నీవు తప్పక చెప్పవలయును. దృష్టాంతముల వలన విషయము మిక్కిలి సరళముగ నర్థముకాఁగలదు. స్పష్టము కాఁగలదు. బుద్ధి దానికవియే గ్రహించును.

ఇది విని సూతుఁ డిట్లనెను :— "స్వామీ ! విదర్భ దేశమున నొక చక్కని చుక్కయగు వేశ్యయుండెను. ఆమెకు రూపఖ్యాతిగలదు. ఎందఱనో ధనికులనామె నిర్ధనులఁ గావించినది. ఎందఱనో యువకుల కామె బలవీర్యనాశము కావించినది. పేదవారామె దర్శనమైనఁ జేయఁ జాలకుండిరి. ఆమె రాజవేశ్య.

రమువలెఁ బచ్చగా నుండెను. దాని ముక్కు దొండపండువలె నెఱ్ఱగా నుండెను. గళమున నెఱుపు, నీలము కలసిన రంగుగల కంఠీయుండెను. అది మనుష్యులు పలికినట్లు స్పష్టముగఁ బలుకఁగలదు.

వేశ్య యా చిలుకను గాంచి మిక్కిలి యాశ్చర్యమును జెంది, వ్యాధునిఁ బైకిఁ బిలిచి, యా చిలుకను గొనుటకు బేరమొనర్చెను. మునులారా! ప్రాణులెట్టి క్రూరులైనఁ గానిండు, నిందితులు గానిండు, హింసకులు గానిండు, అందఱును దేనినో ఒకదానినిఁ బ్రేమించుచుందురు. అందఱిలోను బ్రేమించు స్వాభావిక స్పృహ కలదు. చిన్న చిన్నపిల్లలు పరస్పరము మిత్రులై, మరల నల్పకాలముననే జగడము లాడుకొందురు. ఏలననఁగా మిత్రత్వము చిరస్థితికై యేర్పడును. ఒకానొక పిల్లవానికి తల్లి మిఠాయినిఁ బెట్టెను. అతని మిత్రుడు దానిని పెట్టమని యడిగెను. వానికి నోరూరుటచే దానిని పెట్టలేదు. ఈ మూలమున మిత్రత్వమునకు విరుద్ధమగు నాచరణమును గావించెను. స్నేహితుఁ డడిగిన దీయకున్నచో నాతడు విరోధించును :- "నాలుక పీఁకివేసెదను, బుగ్గలు బగులఁగొట్టెదను, ఇట్టివానితో నేను మాట్లాడనే మాట్లాడను. థూ! థూ! నీకు నాకు మాటలులేవు థూ!" ఇంకేమున్నది సహవాసము పోయినది. ఇది పిల్లలాట యని పెద్దవారనుకొనుచుందురు; కాని మనము నిత్యమీ విధముగ మన స్వార్థముల కాఘాతము తగిలినప్పుడు మిత్రత్వమును విరోధముగ మార్చుకొనుచుందుము. బాల్యకాలము నుండి సహవాసము లొనర్చుచుఁ బ్రేమించుకొనుచుఁ బోరాడుకొనుచుఁ జివరకు బ్రపంచమున నందఱును స్వార్థమునకే మిత్రులనిన నిర్ణయమునకువచ్చును. అయినను స్నేహ మొనర్పక మానదు. స్త్రీ మొదట నొకనితో స్నేహము చేయును. రాజద్వారము కడకుఁబోయి యచ్చట వ్రాసియిచ్చి యింకొకని వివాహ మాడును. వానినిఁ బరిత్యజించి యింకొకనితో మరల సంబంధము పెట్టు

కొని నాశమొనర్చును. అతడు నిర్ధనుడు కాఁగానే విపత్తులలో ముంచి వదలి మూఁడవ వానితో దైతక్కులాడును. దానితోఁ దగాదా రాఁగానే నాల్గవవానిని జేపట్టును. అతనికిఁ గన్నులు తెలియని స్థితిలో మిత్రత్వ మును బ్రదర్శించి ప్రేమనటన గావించును. వెనుకవారికిఁ బట్టిన గతియే తనకును బట్టునని వీనికిఁ దెలియదు. పురుషుల స్థితి యిట్టిది. స్త్రీపైఁ బురుషునకుఁ బ్రేమ కలిగిన నామెను హృదయేశ్వరి, అంతఃకరణ సామ్రాజ్ఞి, ప్రాణప్రియ యని యిట్లెన్ని విధముల బలుకునో చెప్పలేము తన మనస్సునకు నచ్చిన దింకొకతె లభించెనా పాలలోని ఈఁగకువలె దానినిఁ దీసి పాఱవేయును. ఈ కపట ప్రేమ నటన మరల దానిదగ్గఱ కూడ బ్రదర్శించును. స్వార్థపరుడు, కాముకుడు, విషయాసక్తుఁడగు వాఁడెన్నడు నెవరితోడను స్నేహము చేయడు. వాని మిత్రత్వము కామ మును బట్టియు, స్వార్థమును బట్టియు నుండును. ఇట్లనుభవము కాఁగా యువావస్థ దాఁటిపోయిన తర్వాత మానవుఁ డెవ్వరినిఁ బ్రేమింపడు. వాస్తవమునఁ బ్రేమింపఁదగిన దేదియును లేదు. క్షణభంగుర విషయము లను బ్రేమించ్నవాని మిత్రత్వ మెన్ని దినములు సాగును. వానితోఁ బెట్టుకొనిన ప్రేమ యెన్ని దినములు స్థాయిగా నుండగలదు. ప్రేమింప దగినవి వృక్షములు. ఏలననఁగా - నవి మాటలాడఁజాలవు. తిట్టజాలవు, కొట్టఁజాలవు. నిన్నే విధమునను నెదుర్కొనవు, విరోధింపవు, వాటికి మురిగిన చెత్త చెదారము, యెఱువును వేసినఁ జక్కఁగఁ బూసి ఫలిం చును, నఱుకుచో నీకు వంట చెరకుగాఁ బనికివచ్చును. కాల్చి మసిచేసిన నీకు ఎరువుగాఁ బనికివచ్చును. సారాంశమేమనఁగా దానిలో స్వార్థభావన లేదు. పరమార్థ భావన కలదు. అందుకనియే సాధు సత్పురుషులుండు

వోటను, ఆశ్రమము లందును నానావిధములగు పత్ర, పుష్ప, ఫలాదు లొసంగు వృక్షములుండును. మేసిన వెంటఁబడి తిరుగు సరళములగుఁ బశు పక్ష్యాదులును బ్రేమింపఁ దగినవే. అందుకనియే సాధు సజ్జనులకడ నెంపుడు పశువులుండును. గృహస్థులకడ వివిధములగుఁ బశువులు పక్షు లుండును. కొందఱకుఁ గుక్కలనినఁ బ్రీతి. వారు వాటినిఁ బుత్రులవలె దమవద్దనే పరుండఁ బెట్టుకొందురు. భోజనము పెట్టుదురు. వివిధ వస్తువులతో స్నానము చేయించెదరు. తమ ప్రక్కనే వాహనములపై నెక్కించుకొందురు. నిజమునకుఁ బ్రేమించుటకు యోగ్యులు నిస్స్వార్థులగు సాధువులు. ఏలననఁగా – వారికి సాంసారిక స్వార్థము లేదు; వారి కామము పరమార్థమునకే వినియోగించెదరు. పరోపకార ప్రేరితులై కార్యము లొనర్తురు,

ఆ వేశ్య నిత్యము గొప్ప గొప్ప ధనిక యువకులను జూచెడిది. దానికి సుందర సుకుమార ధనిక యువకులతోడనే పని. వారామెకు ధనము, వస్త్రములను, రత్నజటిత సువర్ణాభరణములను భోగము నొసంగెదరు. శయ్యా పరిధానములతోఁ బాటు హృదయ మర్పించుటకును నటించెదరు. కాని తాను హృదయ మర్పింపనప్పుడు తనకెవరు హృదయమును సమర్పించెదరు? ఈ సంగతి ఆమెకు బాగుగఁ దెలియును. ఇవన్ని గాపట్యక్రీడలు స్వార్థపు చేష్టలు. అది నవ్వుకొని వచ్చినవానినిఁ బ్రేమింపఁగోరి అరమరయుఁ గపటమును లేకయే హృదయము విప్పి మాటలాడును. ఆమె యా సుందర కీరమును అడిగిన వెలనిచ్చి యా వ్యాధుని దగ్గఱనుండి కొనెను. దానిని స్వర్ణపంజరమున నుంచెను. అది ఒక భక్తునికడ నున్న చిలుకయని తోఁచుచున్నది. అది యే కారణము చేతనైనను దప్పించుకొని యుండవచ్చును; అప్పుడా వ్యాధుడు దాని

సౌందర్యమును సుస్పష్టమగు మధురవాణిని( గాంచి పట్టుకొని యుండ వచ్చును. దానికింతటి ధర పలుకునప్పటికి వాడుపొంగెను. అతని యానందమునకు మేఱ లేకుండెను. ఆనందోల్లాసముచే నాతనికి కాలు నేలపై న్సాలేదు. ఆత( డత్యంతానందమును జెంది యింటికి వెళ్ళి పోయెను.

ఇచ్చట వేశ్య దానిని దన చేతులతో( బాలను ద్రావించును ఫల ములను, సెనగలనుంచును. పాలను ద్రావి చిలుక తన స్వభావానుసార ముగ నిట్లు పలుకసాగెను :-

గీ॥ ఇమ్ముగా చిత్రకూట ఘట్టమ్మునందు
సాధుసజ్జన సంఘంబు - సందడించె
తులసిదాసుండు చందనం - బలదుటకును
నఱగదీసి - తిలకమిడెను రఘువరునకు ॥

మాటిమాటికి మధురమగు "సీతారామ సీతారామ" యనుచుండును. వేశ్య కొసందను వేయుచుండెడిది. మధురమగు "సీతారామ" యనుచును చుండును. "రామరామ" అని యన(గానే వేశ్యకు( జాల యానందము కలిగెను. దాని యింటికివచ్చిన యువకులందఱు నెగతాళికి "రామరామ" యనుచును చుందురు. "రామ రామ" యనుచు వేశ్య నిద్దుర లేవ(గానే చిలుకయు "రామ రామ" యనును. అది కవ్వించి కవ్వించి "రామ రామ" యని పలికిన మరలనది "రామ రామ" యని కవ్వించి యనును. నీకు వేయేండ్లు రామ రామ. నీవు చిరంజీవివై యుండుము రామ రామ. నీ వెల్లప్పుడును "రామరామ" యనుచుండుము. నీ నోటినిండ పంచదార

"రామ రామ" నీ వెల్లప్పుడును "రామ రామ" యను మధురవాక్కును బలుకుచుండుము."

ఒక్కొక్కప్పుడు చిలుక నిద్రించిన దానికడకుఁ బోయి, కీర రాజమా! రామ రామయని జపము చేయవా? రామ రామ అనవమ్మా!"

సూతుఁ డిట్లనెను :— "స్వాములారా! ఆ వేశ్య రామభజన చేయవలయునని కాదు; రామ రామ యనుట సమస్త పాపములను క్షణములో నాశముజేయు రామనామమును జేయుచున్నానను జ్ఞానమామెకు లేదు. నిందిత పాపకర్మములోఁ బడిన వేశ్యగానే తనను భావించుకొనుచున్నది. చిలుకతో నాడుకొనుచు ననిచ్ఛా పూర్వకముగ నజ్ఞానమున గేవలము వినోదార్థము ఆమె రామ రామ యనుచున్నది. తమోగుణమున మూఢురాలగుటచే నామె యజ్ఞానమున నుండిన నుండవచ్చును. గాని చైతన్య ధనమగు నామము ప్రమాదము పడదు. అది దాని ఫలమది చూపించి తీరవలయును. క్రమ క్రమముగ నామ ప్రభావముచే నామె యంతఃకరణము శుద్ధము కాసాగెను. ఆమె పాపములు పోసాగెను. మానవునకుఁ బాపములు నశించిన కొలఁది సాధు సమాగమమును, సత్పురుషులతో సత్సంగము సంభవించును.

హఠాత్తుగ నొక దినమున నామెకు తీవ్రజ్వరము వచ్చెను. చాల దినము లొడలు తెలియక పడియుండెను. జ్వరములో స్పృహ లేక ప్రలాపింపసాగెను. ఆమె శరీరము పాలిపోయి, సౌందర్యమంతయు నశించెను. ముఖమునుండి దుర్గంధము రాసాగెను. అంగప్రత్యంగములు శిథిలములై, తిండి లేకపోవుటచే గ్రుడ్లు వెళ్ళుకొని వచ్చెను. ముఖము మలినమైపోయెను. కాముకు లెవతెనుగాంచి తమసర్వస్వము నర్పించెడు వారో ఆమె నిప్పుడు చూచిన నేవగించుకొనుచుండిరి. ఒక్కడైన దగ్గ

లకు వచ్చుటలేదు. ధనలోలుపులగు నిద్దరు ముగ్గురు నౌకరులిది ఎప్పుడు చచ్చునా యెప్పుడు దీని ధనసంపత్తు నంతయు గొల్లకొట్టుకొని పోవుదమా యని ప్రతీక్షించుచుండిరి. ఆమె యచేతనురాలై యుండగా నిరుగు పొరుగువారు చాలవఱకు ధనమును హరించిరి.

ఆమె కంత్యకాల మాసన్న మయ్యెను. త్రిదోషములు చుట్టు ముట్టెను. సూతుఁ డిట్లనెను :- "మునులారా! మృత్యు సమయమున మానవునకుఁ దన పాపములన్నియు జ్ఞప్తికి వచ్చును. సత్యా సత్యములను బలికి సంపాదించిన ధనసంపత్తిని వదలి వెళ్ళునప్పు డత్యంత దుఃఖము కలుగును. పాపస్మృతిచే హృదయము దడదడ కొట్టుకొనును. భయమున రోమములు నిక్కబొడుచును. అట్టి భయభీత దశయందే నల్లని కరాళ ముఖములుగల యమదూతలు భయంకరముగ గోచరించెదరు. వారిని జూడఁగానే పాపులకు మలమూత్రములు వెలువడును. ఆ వేశ్యకుఁగూడ తనపాపము జ్ఞాపకము వచ్చెను. ఆమె పాపమును బ్రత్యక్షముగ బుద్ధిపూర్వకముగ నొనర్చెను; కాని భగవన్నామోచ్చారణ రూపమగు బుణ్యమును నామె వినోద పూర్వకముగ నవ్వుచుఁ దన యానందము కొఱకుఁ జిలుకకుఁ జెప్పుటకుఁ జేసెను. తనవలన మహాపుణ్య కార్యము జరుగుచున్నదనిన గుర్తు ఆమెకులేదు. ఆమెకు తెలియకున్నను నామివలె జైతన్యమైన నామప్రభావము వ్యర్థముకాదు. ఇంతలో నొక వైష్ణవుఁడటు వచ్చెను. వేశ్య బాధచేఁ దన్నుకొనుటను గాంచఁగానే ఆతనికి దయ కలిగెను. ఆతఁడట్లు వెళ్ళుచున్నప్పుడెల్ల వేశ్య చిలుకకు రామనామమును జెప్పుటను గాంచుచునే యుండెను. నేఁడిట్టి దుర్గతిని గాంచఁగానే దయాళుఁడగు నా సాధువునకు హృదయము కరిగెను. ఆతడు పరువిడిపెళ్ళి వేశ్య భవనమునకు బోయి, లి మె నోదాప్చుచు నిట్ల

నెను :- "దేవీ! నీవు చిలుకకేమి నేర్పితివి?" అనుచు నా చిలుక నామె ముందుంచెను. చిలుకను గాంచి వేశ్య యిట్లనెను :- "రామ రామ రామ రామ" యిట్లనగానే చిలుకయు "రామ రామ" యనెను. ఆ నిమిష మననే వేశ్యయొక్కయు, చిలుక యొక్కయు ప్రాణము లెగిరిపోయెను. ఇద్దరును రామనామ ప్రభావముచే దరించిరి. విష్ణుపార్షదు లామెను దివ్య విమానముపైఁ గూర్చుండ బెట్టుకొని వైకుంఠమునకుఁ గొని పోయిరి.

సూతుఁడిట్లనెను :— "మునులారా! అనిచ్ఛా పూర్వకముగ భగవన్నామము పలికినను నది కల్యాణకారియే. ఇట్లు విష్ణుపార్షదులు యమదూతలతో జెప్పిరి, ఈ ప్రసంగము చాల రోచకమైనది, ఇంకను నీ విషయమును గూర్చి చెప్పెదను."

## నామోచ్చారణ ఫల మమోఘము

## 363

శ్లో॥ అజ్ఞానాదథవా జ్ఞానాదుత్తమశ్లోక నామ యత్ ।
సంకీర్తిత మఘం పుంసో దహేదేధో యథానలః॥
యథాగదం వీర్యతమ ముపయుక్తం యదృచ్ఛయా
అజానతోఽప్యాత్మగుణం కుర్యా న్మంత్రోఽప్యుదాహృతః॥

శ్రీ భాగ. ౬ స్కం ౨ అ ౧౮, ౧౯ శ్లో॥

క॥ హరి నెఱుఁగని యా బాలుడు
హరిభక్తులతోడఁగూడి హరియనువాడున్
సరియై దోషము లడఁచును
గరువలితో నగ్ని దృణముఁ గాల్చిన భంగిన్ ॥

ఉ॥ ఆరయ వీర్యవంతమగు నౌషధమెట్లు యదృచ్ఛఁగొన్నఁద
చ్చారు గుణంబు రోగములఁ జయ్యన బాపెడు మాడ్కిఁబుణ్య వి
స్ఫారుని నంబుజోదరునిఁ బామరుఁడజ్ఞుఁ డవజ్ఞ బల్కినన్
వారక తత్ప్రభావము ధ్రువంబుగ నాత్మ గుణంబుఁ జూపదే॥

శ్రీమదాంధ్రభాగవతము,

పొరపాటున బీజము ఉర్వర భూమియందుఁ బడినచో నది మొల కెత్తును. పొరపాటున విషమును దినిన జచ్చెదరు. పొరపాటున కాలులో ముల్లు విరిగినను బాధపెట్టితీరును. పొరపాటున పసివాడగ్నిని ముట్టుకొని నచోఁ గాలును. ఏలననఁగా దేనికే గుణమున్నదో నది చూపితీరును. ఇట్టే విధముగఁ బొరపాటున నంత్యకాలమున భగవన్నామోచ్చారణమొన ర్చినచో నాతడు పరమ పదాధికారి కాఁగలడు. ఇందు సందేహము లేదు."

శుకదేవుఁ డిట్లనెను :— "రాజా ! విష్ణు పార్షదులు యమదూత లకు తెలియకయే అనిచ్ఛచేఁ బొరపాటున స్వభావానుసారముగఁ బూర్వా భ్యాసానుసారముగ నంత్యకాలమున నామోచ్చారణము చేయుటచే సద్గతి కల్గునను సంగతి చెప్పగానే యమదూత లిట్లనిరి :— "స్వాములారా !

నామములో నత్యంత ప్రభావమున్న సంగతియు, తెలిసిగాని తెలియక
గాని నామము పలుకుటచేత నది దానిగుణ మొసంగుననియు మేమంగీక
రించెదము; కాని అజామిళునకు నామములో నింతటి మహిమమున్నదని
తెలియదు. అతడు తన పాపములనే స్మరించుచుండును. అంత్యకాలమున
మానవుఁ డెట్టి భావన యుండునో అట్టి ఫలమే లభించును. ఇతని కింత
వఱకు తన పాపమును గూర్చిన భావనయే కలదు. అట్టియెడ నీతనిని
మమ్మేలఁ గొనిపోనీయరు."

అంత విష్ణుపార్షదు లిట్లనిరి :— "నాయనలారా! మేముభావ
నను గూర్చి పలుకుటలేదు. ఇచ్చట నారాయణ నామ మాహాత్మ్యమును
గుఱించి పలుకుచున్నాము. నోటితో నెట్లైనను నామోచ్చారణ గావించి
తిమా ఘోరాతి ఘోర పాపములనైన దహనము పోఁగొట్టగల శక్తి
భగవన్నామమునకుఁ గలదు. భగవన్నామములో నెంతటి శక్తికలదో
దాని యుచ్చారణమున నెంతటి ఫలము కలదో దానిని వర్ణింప నాదిశేషున
కైన నలవికాదు."

అంత శౌనకుఁ డిట్లనెను :— "సూతా! ఈ ఫలము స్వేచ్ఛా
పరేచ్ఛలచేతను, భావ కుభావముల చేతనైనఁ గలుగునా? లేక నార్తుడై
ప్రేమతో నామమును బలుకుటచే గలుగునా?"

ఇది విని సూతుఁ డిట్లనెను :— "మహాభాగా! నేనిదివఱలో
మాటి మాటికి దీనికి ప్రత్యుత్తర మిచ్చుచునే యున్నాను. ప్రేమపూర్వక
ముగ భక్తి శ్రద్ధలతో నార్తుడై నామోచ్చారణ మొనర్చిన దాని ఫలము
విషయములోఁ జెప్పవలసిన దేమున్నది? స్వామీ! పరేచ్ఛచే, బల
వంతముగ, హతపూర్వకముగ నెట్లైనను సరియే భగవన్నామోచ్చారణము

కావించినచో నది కల్యాణకారియే కాగలదు. ఉచ్చారణమే కాదు; కేవలము విన్నను, నదియును స్వేచ్ఛచేఁగాదు బలవంతముగ విన్నను బ్రహ్మాది దేవతలును వర్ణింపరానంత ఫలముకలదు. ఈ విషయములో నతిప్రాచీన మగు మనోహర గాథ కలదు. దానిని మీరు శ్రద్ధతో విననలయును. దానిని వినుటచే మీకు నామ శ్రవణ మహాత్త్వము తెలియఁగలదు."

ఒకానొక నగరములో నిద్దరన్నదమ్ములు నివసించుచుండిరి. చిన్న వాడు ధర్మాత్ముడు, సాధుసేవ చేయువాడు. మహాత్ములందు శ్రద్ధగల వాడు. పెద్దవాడు భగవన్నామమునకును భగవత్కథలకును విముఖుడు. మహాత్ములను ద్వేషించును. హరికథా పురాణముల కడకును, భగవ న్నామ కీర్తనము కడకును నెన్నటికిని బోడు. ఇంటిలోఁ గథాకీర్తనము జరుగుచుండినఁ దన చెవుల నా వ్యర్థవిషయము పడరాదని మూది దోఁప కొని కొట్టుగదిలో దాగుకొనును. అతని యీ యాచరణమును గాంచి తమ్ముఁ డీతనికే పాపఫలము వలన నిట్టి విముఖత భగవన్నామమందు కలిగినదని చింతించుచుండెడు వాడు. అతడు లోలోన నాతని మేలు కొఱకు భగవంతునిఁ బ్రార్థించుకొను చుండెడివాడు. మునులారా! ఎవని మేలును గూర్చి భక్తులు ప్రార్థించెదరో వారికి మేలు కలుగుటలో నే విధ మగు సందేహముండదు. ఏలననఁగా భక్తుల హృదయములో భగవం తుడు విరాజిల్లుచుండును. వారి సమస్త కోరికలను భగవంతుడు నెఱ వేర్చును. ఎందులకనఁగా నాతడు వాంఛా కల్పతరువు.

దైవికముగ నొక దినమున నొకానొక గొప్పసాధువు ఆ నగరము నకు వచ్చెను. అతడు శారీరకముగ బలవంతుడు, పవిత్ర హృదయుడు, పరమార్థ పథమందు నిష్ఠాతుడు. అతనివెంట పది పదునైదుగురు భగవ

స్వామి కీర్తనము చేయువారుండిరి. నగరమంతటను నాతని ప్రసంగము వ్యాపించెను. సాధుసేవి యగు నా సోదరుడుకూడ సాధు సేవలో జేరెను. అందఱకుఁ జరణ వందనము గావించి ఆ సాధు మహంతు యొక్క గద్దెవద్దఁ గూర్చుండెను, కృపాళుఁడగు నా సాధువు ఆ మాట నీమాటను మర్యాదగా మాటలాడి, అతని సంకోచమును నివారించిన మీఁదట నాతని మనోభిలాష నడిగెను. భక్తుఁ డిట్లనెను :– "స్వామీ! మీ రంతర్యాములు, సర్వజ్ఞులు నా కోరిక సాధుచరణ ధూళి మా యింట సోకుట యును, నా సోదరున కే విధముగనైన నుద్ధారము కలుగుటయునై యున్నది."

సాధు విట్లనెను :— "నీవు నీ సోదరు నిచ్చటికిఁ దీసికొని రమ్ము."

అతడు నిరాశా స్వరముతో నిట్లనెను :— "స్వామీ! అతడు వచ్చువాఁడగు నెడల నేనింతవఱ కేల్లుండును. అతడు సాధువను మాట వినఁగానే క్రోసుల దూరము పారిపోవును. మీరింటికి వచ్చినను నాతడు మేడపైఁ గొట్టులోని కేకాంతముగఁ బోయి దాఁగుకొని యే శబ్దమును వినకుండును."

ఇది విని సాధువు కొంచెము విచలితుఁడయ్యెను. అతఁ డిట్లను కొనెను. రోగి యెదుటకు వచ్చి ఔషధమును సేవించినను, రోగనిదాన మేదో తెలిసికొని దానికి తగినమందేదో యేర్పాటుచేసిన రోగము పోవును గాని వైద్యునకును, విషయునకును దూరముగనుండి, వారి సంపర్కమే లేకున్నచో నిట్టిరోగి రోగమున కేమి చేయవలయును ?" కొంచెముసేపి ట్లాతడు యోచింపసాగెను. చివరకాతని కొక యుక్తి తోఁచగా నా భక్త

నితో నిట్లనెను :- "నీవు వెళ్ళుము, రేపు మీ యింట సాధువు లందఱ కును సంతర్పణ జరుగవలయును. రెండు జాములకుఁ బిలువరావలెను."

ఇదివిని భక్తుడు సంతోషించెను. సాధువులు తనయింట పాదముల నిడి తమ పాదధూళిచే గృహము పవిత్ర మగుననియు, దన జీవితము సఫలమగుననియు భావించుచు రాత్రి యంతయు నిద్రలేకయే గడిపెను. తెల్లవారఁగానే అతడు సమస్త యేర్పాటులను గావించెను. పాలను దెప్పించెను. సమస్త సామగ్రిని బ్రోవుచేసెను. మిక్కిలి శుద్ధముగను, పవిత్రముగను భగవత్ప్రసాదమును తయారు చేయఁబడిన పిదప నాతడు సాధువులను బిలువఁబోయెను. సాధువులందఱును బాగుగా బొట్టు పెట్టుకొని మృదంగ తాళాదులతో నామ సంకీర్తనము చేసికొనుచు వెళ్ళిరి.

భక్తుని యన్నకు నేఁడీ వ్యర్థులు గృహస్థుని నెత్తినబడి పీకుకొని తిను సాధువులు తన యింటి ద్రవ్యము నంతయు వ్యయ మొనర్చుటకు వచ్చుచున్నారను సంగతిని దెలిసికొనెను గాని తమ్మునితో ననలేదు. అతఁ డిట్లనుకొనెను :- "నాకెందులకు ? నాకేమియు నక్కఱలేదని కన్నులు నలచుకొని కూర్చుందును. ఈ వ్యర్థ విషయములకు దూరముగ నుందును." ఇట్లనుకొని యాతఁ డుదాసీనముగ నుండెను. దూరమున నుండి మృదంగ తాళశబ్దములు చెవులఁ బడఁగానే అతడు చెవులలో దూదిని గ్రుక్కుకొని దుప్పటి కప్పుకొని పైనఁ గొట్టుతో పరుండెను.

సాధువులు చాల యార్భాటముగ వచ్చిరి, వారు రాగానే ముందుగా భగవంతునకు నైవేద్యమిడిరి. మంచి యారగింపు పాటను పాడిరి. నామ సంకీర్తనమైన పిదప ప్రసాదమును వడ్డించుచుండిరి. సాధువులందఱును నారాయణ నామకీర్తన మొనర్చుచుండిరి. చాలమంది యిరుగు

పొందుగువారు దర్శనార్థులై గుమికూడిరి. ప్రసాదము వడ్డింపఁ బడఁగానే హరినామ మాగినది. వారిష్టము వచ్చినట్లు కడుపునిండ ప్రసాదమును గైకొనుచుండిరి. భక్తులు మాటి మాటికి బలవంతము చేయుచు వడ్డింప సాగిరి. సాధువులు సింహములవలె భగవన్నామము పలుకుచు వద్దువద్దని గడ్డముల నడ్డముగ నూపుచుండిరి. స్వామీ! కొంచెము పాయసమును త్రాగండని వడ్డించు వారనఁగా వారు విస్తళ్ళపైఁ జేతులనుంచి అక్కఱ లేదని శిరస్సు నడ్డముగ నూపుచు "సీతారామ్ సీతారామ్ సీతారామ్ సీతారామ్" అనుచుండిరి. ఈ విధముగఁ బంక్తి మిక్కిలి ప్రేమతో నిండి యుండెను. భక్తులందఱును హస్త ప్రక్షాళనము గావించుకొనిఁ పాద ప్రక్షాళనము గావించుకొని ముఖశుద్ధి కొఱకు లవంగమును, యాలకులు, సోపు, వక్కలు మొదలగునవి యొసంగఁబడెను. సాధువు లందఱును వాద్యములతో సంకీర్తనము చేసికొనుచు నెట్లువచ్చిరో అట్లే వెళ్ళిపోయిరి కాని యా మండలియొక్క మహంతు వెళ్ళలేదు. అతఁడా భక్తునితో "భగవద్విముఖుడును, సాధు ద్రోహియు నగు నీ సోదరుఁడేడీ?"

"స్వామీ! వాడు పైన మేడమీద దాఁగి నిద్ర బోవుచున్నాడు." అని భక్తుఁడనెను,

ఇది విని కృపాళుఁడగు సాధువు పైకి వెళ్ళి దాఁగుకొనెను. ఈ సాధువులు ఉదరపూజ కావించుకొని హా హా హూ హూ యనుకొనుచు వెళ్ళినారనుకొని అతడు కొట్టునుండి బయటకు వచ్చెను. అతడు వచ్చు టయే తడవుగ సాధువు గట్టిగాఁ జేతినిఁ బట్టుకొనెను; ఇంకేమున్నది? సాధువు గట్టిగాఁ జేయిపట్టుకొనిన నుద్ధారమైనట్లే సాధువును జూడగనే అతడు బెదురుగొడ్డువలె నెగిరిపడెను. జడలను, పెద్ద పెద్ద తిలకములను గాంచఁగనే అతడు మంచిపడిపోయెను. తన బలముసంతను జూపి

చేయి విదిలించుకొని ఆతఁ డిట్లనెను :- "పాషండుడా! వదలవయ్యా వదలు! ముందు నా దగ్గరనుండి తొలఁగిపొమ్ము. నా శరీరమును మరల దాకితివా? జాగ్రత్త! నా చేతిని వదలిపెట్టు."

కాని సాధువునకుఁ బట్టుకొనిన వానిని వదలిపెట్టుట తెలియనే తెలియదు; అతడు దృఢస్వరమున నిట్లనెను :- "ఒకసారి భగవన్నామమును జేయుము."

ఇది వినఁగానే అతడు తన చెవులలోని దూది నింకను నొక్కుకొనెను. ఇప్పుఁడిక సాధువు తన రూపమును జూపించెను. సాధువు అయోధ్యామందిరములలో బాగుగా మల్లవిద్య నభ్యసించిన దిట్ట. అతడు తన బలముకొలఁది యెత్తి క్రిందఁ బడవైచెను. అంత రొమ్మునెక్కి కూర్చుండి, చెవులలోని దూదిని దీసివైచి గట్టిగా "రామ్" అని కేక వేసెను.

కేకవేసి యిట్లనెను :— "ఇదిగో, దీని నిమ్మని యెవరైన నిన్నడిగినచో దీనికి బదులుగ దీనికిఁ దగిన వస్తువుండిన నిమ్మనిన యివ్వవలెను. నాకు దీనివెల తెలియదు."

ఇట్లుచెప్పి సాధువు వెంటనే వెళ్ళిపోయెను. ఈ మాటలనన్నిటిని అతడు వినుచునే విననట్లుగ నట్లు లక్ష్యముంచలేదు. అతడు లక్ష్యముంచకుండినను, సాదువు నోటినుండి వెలువడిన భగవన్నామ మెన్నడును వ్యర్థము కాఁజాలదు; అది దాని ఫలమొసంగి తీరును.

సాధువు వెళ్ళిన కొన్ని దినములకు వానికి మృత్యువాసన్నమయ్యెను. అతని పాపములన్నియు నాతనికి జ్ఞాపకమునకు వచ్చెను. యమదూతలు వచ్చి గర్జన తర్జన భర్జనములు చేయుచు భయపెట్టసాగిరి.

వారు నిర్దయులై వానినిఁ బట్టుకొని యమపాశములచేఁ గట్టి యముని కడకుఁ గొనిపోయి యముని ముందు నిలువఁబెట్టగా నా యముఁడా పాపినిగాంచి యొకదూతతో నిట్లనెను :- "చిత్రగుప్తునిఁ బిలువుడు" అంత దూత చిత్రగుప్తుని బిలువఁగానే, తన ప్రభువుయొక్క యాహ్వానమును విని గబగబ నెడుమునకు గుడ్డ కట్టుకొని, లెక్కల పుస్తకమును జంకను పెట్టుకొని, చెవిలోఁ గంటమును బెట్టుకొనివచ్చి యెదుట నిలువబడెను. యముఁడాతనిని జూడగానే యిట్లనెను :- "చిత్రగుప్తా ! నీ ఖాతాను దీసి యీతఁడేమి పుణ్యపాపము నొనర్చెనో చెప్పుము."

ఇది వినఁగానే చిత్రగుప్తుడు చిట్టాలను విప్పి, గబగబ పుటలను విప్పెను. ఆతఁడా చిత్రగుప్తుని మూర్తిని గాంచి భయపడుచుండెను. ఇంతలోనే నాతని లోహపు గంటమును గూడ దన చేతిలోనికిఁ దీసికొనెను. లోహపు కత్తి కొందఱ గొంతులు కోయుటకే పనికివచ్చునుగాని చిత్రగుప్తుని లేఖినీ విషయమునుగ నక్కఱలేదు. అసలి నామము మీఁదకుఁ బోవునో, ఇఁకఁజాలు గోవిందాయ నమోన్నమః కాఁగలదు. కాగితములు త్రిప్పుచుఁ ద్రిప్పుచు నొక్క స్థానమునఁ జిత్రగుప్తుఁడాగి యిట్లనెను :- "ధర్మావతారా ! ఇతని పుణ్యమైపోయినది. అనుభవించినాడు. జీవితమంతయు నీతడు పొట్టఁబోసుకొనుటకే పాపము చేసినాడు, సాధుద్రోహ మొనర్చినాడు. నాస్తికునివలె యుండిన పాపి యింకెవఁడు కలఁడు ? వీనిని నరకము యొక్క భయంకర కుండములలోఁ బడవేయించుడు. అచ్చట యీతడు తన పాపఫలముల నసంఖ్యాకములుగ ననేక వర్షము లనుభవింగఁ గలడు."

యముఁడిది విని యిట్లనెను :- "మంచిది, వీనిని నరకములకుఁ బంపుడు; కానీ వీఁడేదైనఁ బుణ్యము నొనర్చెనా గ్రహించకు బంపుడు. ఏలననగా జాలపుణ్యము లొనర్చి, యే కొలదియో పాపము

లొనర్చిన, నట్టివానిని ముందు పాప మనుభవింపజేసి, చిరకాలము శాశ్వతముగ బుణ్యమనుభవించు నట్లొనర్చెదము. ఇట్లే చాల పాపములొనర్చియే పొరపాటుననో కొలదిగ బుణ్య మొనర్చిన, వానికి ముందుగ బుణ్యఫలమొసంగి, సుఖ మనుభవించిన తర్వాత కష్టమింకను బాధతో ననుభవించును గావున వానికా బాధను కలిగించుటకు శాశ్వతముగ నరకమునకు బంపెదము."

ఇది విని చిత్రగుప్తుడు తన సూక్ష్మదృష్టి నింకను సూక్ష్మముగావించి చిట్టాను ధ్యాన పూర్వకముగఁ జూచి యిట్లనెను :— "ఇదిగోనండీ ! ధర్మావతారుఁడగు నొక సాధు మహాత్ముని కృపచే నీతని కనిచ్ఛాపూర్వకముగఁ గొంత గొప్ప పుణ్యముకూడ లభించినది. ఈతని కర్ణములలో నొకసారి సాధు ముఖమున భగవన్నామము కూడ వచ్చినది. దీనికి మీరేది ఉచితమని తలంచిన నట్టి సుఖమొసంగు నేర్పాటును జేయుడు.—

ఇది విని యముడు చెవులు నిక్కఁబొడిచి మిక్కిలి ప్రేమతోఁ బాపితో నిట్లనెను :— "నాయనా ! నీ వొక్కసారి అనిచ్ఛా పూర్వకముగ భగవన్నామ శ్రవణము కావించితివి. కావున దీనికి నీవేమి వరము నడిగెదవో అడుగుము."

పెద్దల సుద్దులు విపత్తులందే స్మరణకు వచ్చును. దాని మహత్వమప్పుడే తెలియును. ఆ పాపికా సాధు వాక్యములు స్మరణకు వచ్చెను. అతడు నమ్రతతో నిట్లనెను :— "ధర్మావతారా ! నేను మూర్ఖుడను, ఏమియును దెలియని వాఁడను. నేను స్వేచ్ఛాపూర్వకముగ భగవన్నామమును జేసినవాఁడను గాను. కృపాళుఁడగు సాధువు బలవంతముగ నా తొమ్మపై నెక్కి నామమును వినిపించెను. దీని ఫలమేమియో దానిని మీరు నాకొసంగుడు."

ఇది విని యముడు వానిని బుజ్జగించుచు మిక్కిలి ప్రేమతో నిట్లనెను :— "అబ్బాయీ ! ఇచ్ఛతో విన్నను, అనిచ్ఛతో విన్నను భగవన్నామ శ్రవణ ఫలము కలిగితీరును. పుణ్యము లభించినది. దానికి బదులుగ నీవేమి కోరఁదలచిన దానినిఁ గోరవచ్చును. ఇందు సంకోచమునకుఁ బనిలేదు."

ఒక్కసారిగా యమునిలో నిట్టి పరివర్తనమును గాంచఁగానే ఆ పురుషునకు ఆశ్చర్యమును, సాహసమును, ఆశయును గలిగెను. తా నా విపత్తునుండి త్వరగా బయటఁ బడఁగలనను ధైర్యమును గలిగెను. అతడు సాహసమున నిట్లనెను :— "స్వామీ ! మీరు నన్నేమడుగుచున్నారు ? ధర్మాధర్మ నిర్ణయము చేయఁగలవారు మీరే. పాపపుణ్యములకు ఫలమేమియో మీకంటె నింకఁ దెలిసిన వారెవరు ?"

ఒకవేళ అనిచ్ఛాపూర్వకముగ భగవన్నామ మొనర్చిన దాని ఫలముండినచో నది నాకు లభింపవలయును."

ఇది విని ధర్మరాజు కొంచెము ముందువెనుకలాడి, తన ప్రక్కనే కూర్చుండిన తన మంత్రియగు చిత్రగుప్తునితో నిట్లనెను :- "మంత్రీ ! దీనికేమి ఫలమో చెప్పుము."

మంత్రి తన రెండు చేతుల జూపుచు నిటనెను :— "ధర్మావతారా ! దీని ఫలమును గూర్చి చెప్పుట నా శక్తి కతీతమైన విషయము. అది నా పనియునుగాదు. నేను కేవలము పాప పుణ్యములను వ్రాయుదును. వీఁడీ పాపముచేసినాడు, వీఁడీ పుణ్యమును జేసినాఁడని చెప్పుటయే నా పని. ఆ పాపపుణ్యములకే యే సుఖదుఃఖము లొసంగవలయునో అది శ్రీవారి పని."

ఇది విని వివశతా స్వరమున యముఁడిట్లనెను :— "యథార్థము నకు దీని ఫలము నేను నెఱుఁగను దేవతలకు రాజుకావున స్వర్గాధిపుఁ డగు దేవేంద్రుఁడేమైన నెఱుఁగగలఁడేమో! పదండు, అక్కడనే నిర్ణ యించెదము. నేను వచ్చువఱకీ అర్యముడు నా స్థానమునఁ బనిచేయ గలరు. స్థానాపన్నుఁడగు యముఁడాతడు కాఁగలడు."

నిమిషములో విమానము నెక్కి, ప్రేమపూర్వకముగఁ బ్రతిష్ఠతో నా పాపినిఁగూడ తనదగ్గఱ కూర్చుండఁబెట్టుకొని యముడు స్వర్గమునకుఁ బోయెను. దేవరాజు పేరోలగమున నుండెను. అచ్చట పెద్ద పెద్ద ఋషులు, మహర్షులు, దేవ, యక్ష, కిన్నర, గుహ్యక, తీర్థ, నద నదీ, వృక్షాదుల యొక్క అధిష్ఠాన దేవత లచ్చటఁ గూర్చుండి యుండిరి. యమధర్మరాజు రాఁగానే వారందఱును స్వాగత మొసంగిరి. కూర్చుం డుట కాసన మొసంగిరి. ఇంద్రునితో సమానముగ వారిద్దరును సుందర పీఠములపైఁ గూర్చుండిరి. పూజాసత్కారములు, కుశలప్రశ్నలు జరిగిన తర్వాత యముడు స్వయముగ నిట్లనెను :— "నా ప్రక్కనఁ గూర్చుం డిన యీ పుణ్యాత్ముని విషయములో మాకొక ధర్మసంకటము వచ్చి పడి నది. దాని నిర్ణయము కొఱకు నేను మీ కడకు వచ్చితిని. ఇచ్చట దేవతా గురువగు బృహస్పతియు, గొప్ప గొప్ప ఋషులును, మహర్షు లును, దేవతలు నున్నారు. సాధు ముఖమున నొక్కసారి భగవన్నామ శ్రవణము గావించిన నీతని కేపదము నీయవలయునో, యేలోకమునకుఁ బంపవలయునో నిర్ణయింపుడు."

యముని ప్రశ్న వినఁగానే నల్దిశల గుసగుసలు బయలుదేరెను. అందఱును దలకొక విధముగఁ జెప్పసాగిరి. అంత దేవగురువగు

క॥ శ్రీమన్నారాయణ పద
తామరసధ్యాన సలిల ధౌత మహాఘ
స్తోముండై సద్భక్తికి
ధాముండగుచుండెఁ దెలసి తత్క్షణమాత్రన్

శ్రీమదాంధ్రభాగవతము.

దేహధారులలో నెన్నడును బాపము చేయని వాడుండడు. పాపము సంభవించుట ఆశ్చర్యకరమగు విషయము కాదు. పాపమును జేయకుం డుటయే ఆశ్చర్యము. సాధారణ జీవులకు దేహము పుణ్యపాపములు రెంటివలనను సంభవించును. పుణ్యములందు ప్రవృత్తి గలవారు జీవు లలోఁ జాల తక్కువగ నుందురు. పాపప్రవృత్తి గల వారధికముగ నుందురు. పాపము చేసిన తర్వాత "నయ్యో: ఇట్టి పాపమును నేను చేసితిని గదా ! ఎంత ఘోరపాపమైన"దని చింతించుటకుఁ బశ్చాత్తాపమని పేరు. శుష్కపాపము (తెలియక చేసినది) కానిండు, ఆర్ద్ర పాపము (తెలిసి చేసినది) కానిండు పశ్చాత్తాపము వలన నది భస్మమగును. కావున పాపములకు సర్వోత్కృష్ట ప్రాయశ్చిత్తము పశ్చాత్తాపము. పాపము చేయఁగానే హార్దిక పశ్చాత్తాపము కలిగెనా వాని పాపము లన్నియు భస్మమై పోయినట్లే."

శుకమహర్షి యిట్లనెను :— "రాజా ! అచేతనావస్థలోఁ బడిన అజామిళుడు విష్ణుదూతల యొక్కయు, యమదూతల యొక్కయు సంభాషణమును వినుచుండెను. భగవదనుగ్రహము పార్షదుల రూప మును ధరించి, వానిని యమపాశముల నుండి వదిలించి సదుపదేశమగు నట్లు చేసినది. తెలియకచేసిన భగవన్నామము వలననే యిట్టి మాహాత్మ్య మున్నదని వినఁగానే అజామిళుని హర్షమునకు మేర లేకుండెను.

ఆతడు మిక్కిలి సావధానముగ విష్ణుపార్షదుల ముఖమునుండి వెలువడిన నారాయణ నామ మాహాత్మ్యమును వినుచుండెను. భగవద్దూతల ఆజ్ఞచే యమదూతలు వానిని పాశవిముక్తునిఁ జేసి యమలోకమునకుఁ బోగా అజామిళుడు కృతజ్ఞతా భారమున నవనతుఁడై పార్షదుల పాదపద్మములకుఁ బ్రణమిల్ల నుద్యమించు నంతలోఁ బ్రభుపార్షదు లంతర్ధానమైరి. వారంతర్ధానము కాఁగానే అజామిళునకు పూర్వకృత పాపముల యెడల గొప్ప పశ్చాత్తాపము కలిగెను. ఆతఁ డత్యంత పశ్చాత్తాపమును బ్రకటించుచుఁ దన్నుఁదాను నిందించుకొనుచుండెను :— "అయ్యో ! నేను నీచాతి నీచుఁడను. వేదపాఠకుఁడ నగు బ్రాహ్మణుఁడ నయ్యు నా ఇంద్రియములను నా వశమందుంచుకొనఁ జాలకపోతిని. ఇదెంతటి సిగ్గుచేటు. నా వేదాధ్యయనము, యమ, నియమ, వ్రతాగ్నిశుశ్రూష, గురుసేవాది సమస్త శుభకర్మలు వ్యర్థములై నా మనస్సు నాపజాలకపోయినవి. కులీన బ్రాహ్మణుఁడనగు నేనెక్కడ, వ్యభిచారిణియగు నీవేశ్య యెక్కడ ?

నాకు భార్య లేకపోయినదా ? సుందరియుఁ, బతిప్రాణయు, సతీసాధ్వియు, యువతియుఁ గులవతియునగు ధర్మపత్ని నా యింటిలోఁ గలిగినప్పటికి దాసి గర్భమునఁ బుత్రులనుగని నా బ్రాహ్మణత్వమును బోఁగొట్టుకొంటిని. నేను సత్పురుషుల సమ్ముఖమున నెట్లు ముఖమును జూపఁగలను ? నీచుఁడను, నిందితుఁడను, కులకలంకుఁడను, పాపాత్ముఁడను, ఛీ! ఛీ! ద్విజాధముడను. నాబుద్ధి ఎట్లు బుగ్గయినది? అమృతకుంభమునువీడి విషకలశమునుస్వీకరించితిని. రత్నమాలనువదలి మెఱయుచున్న గవ్వల మాలయందు మనస్సును లగ్నమొనర్చితిని. సుస్వాదు పరమ భగవత్ప్రసాదమును వీడి దుర్గంధిత కుళ్ళు కుక్క మాంసమున కాశించి తిని. అల్పవయస్క పతివ్రతయగు పత్నినిఁ బరిత్యజించి సురాపానము చేయుఁ గులటావేశ్యతో సహవాస మొనర్చితిని.

ఇది వినఁగానే దేవతలందఱైక్య కంఠమున నిట్లనిరి :— "భక్త వత్సల భగవానునకు జయమగుగాక ! భగవానునకు భగవద్భక్తులకును జయమగుగాక !"

సూతుఁ డిట్లనెను :— "మునులారా ? భగవన్నామ శ్రవణమున కిట్టి మహిమ గలదని విని దేవతలందఱును ప్రసన్నులరై తమ తమ లోకములకుఁ దిరిగిపోయిరి."

విష్ణు పార్షదులు యమదూతలతో నిట్లనిరి :— "దూతలారా ! అనిచ్ఛా పూర్వకముగ భగవన్నామ శ్రవణ మొసర్చిననే యింత మహాత్మ్య ముండఁగా నీ యజామిళుఁ డార్త స్వరమున స్పష్టముగ "నారాయణ నామమును బలికినాడు. కావున నీతనిని విడిచిపేయుడు. వీనిని దీసికొని పోకుడు."

శ్రీ శుకమహర్షి యిట్లనెను :- "రాజా ! ఈ విధముగ భగవంతుని ప్రియపార్షదులు విశుద్ధ భాగవత నిర్ణయమును గావించి, నారాయణ నామ మహిమను గూర్చి చెప్పఁగా యమదూతలు భయపడి యా యజామిళునిఁ బాశములనుండి విడిపించిరి. వారంతట పార్షదులకుఁ ప్రణామమును గావించి, సిగ్గుపడి వచ్చిన త్రోవనే రిక్త హస్తములతో యమలోకమునకుఁ బోయిరి.

యమదూతల పాశములనుండి విముక్తుడుకాఁగానే అజామిళునకుఁ జైతన్యము కలిగెను. సమ్ముఖమున నిలుచుండిన దివ్యరూపధారులగు విష్ణు పార్షదులను దర్శించి, తద్దర్శనముచే నిర్భయుండును, సావధానుడునై అజామిళుడు భక్తి ప్రేమలతో నిండిపోయెను. అతడు భక్తి శ్రద్ధలతో లేచి భగవంతుని పార్షదులకు నమస్కరించి, కృతజ్ఞతను ప్రకటిం

చుచు నేదియో చెప్పఁబోవు నప్పటికి స్వప్న దృశ్యము నిద్ర మేలకువ రాఁగానే మాయమగునట్లు పార్షదులందరును మాయమైరి. విష్ణు పార్షదు లెదుట కనఁబడక పోవునప్పటికి అజామిళునకుఁ జాల దుఃఖము కలిగెను. ఆతడు తన పాపములను స్మరించుకొని చాల పశ్చాత్తాపమును జెందెను. రాజా ! యథార్థమగు పశ్చాత్తాపము కంటె మించిన ప్రాయశ్చిత్త మింకొ కటి లేదు. అజామిళున కెట్టి హృదయ స్పర్శమగు పశ్చాత్తాపము కలిగి నదో దానిని ముందు చెప్పెదను."

## అజామిళుని పశ్చాత్తాపము

## 364

శ్లో॥ అజామిళోఽ ప్యథాకర్ణ్య దూతానాం యమకృష్ణయోః
ధర్మం భాగవతం శుద్ధం త్రైవిద్యం చ గుణాశ్రయమ్
భక్తిమాన్భగవత్యాశు మాహాత్మ్య శ్రవణాద్ధరేః ।
అనుతాపో మహానాసీ త్స్మరతోఽ శుభాత్మన ॥

శ్రీ భాగ. ౬ స్కం. ౨. అ. ౨౪. ౨౫ శ్లో॥

క॥ వేదత్రయ సంపాద్యము
మోదంబు గుణాశ్రయంబు మొగి భగవద్ధ
ర్మాదేశం బగు తద్భట
వాదంబు నజామిళుండు వదలక వినుచున్ ॥

బృహస్పతి గంభీరుఁడై యిట్లనెను :- "యథార్థ విషయ మేమనఁగా దీని నిర్ణయమును మన మొనర్పఁజాలము. ఈ మహాపుణ్య కార్యమునకు ఫలమేమి యీయవలయునో మాకుఁ దెలియదు. ఇతఁడేమి యడిగిన దానినీయుడు."

అంత యముఁ డిట్లనెను :— "స్వామీ ! యీతఁడేమైన నడిగి యుండిన చిక్కే లేదు. కాని దానికే ప్రతిఫల మొసంగిన సరి పోవునో దాని నీయుఁడనుచున్నాడు."

అంత దేవేంద్రుఁ డిట్లనెను :— "అయ్యా ! ఈ ధర్మ నిర్ణయము చేయఁదగినవాడు వేద ధర్మ గర్భుఁడగు, తత్ప్రవర్తకుఁడగు లోక పితామహ బ్రహ్మయేగాని ఇంకొకరు లేరు. మనముకూడ ఆ నిర్ణయమును వినఁబోవుదము పదండి."

అంత విమాన పంక్తులు యముని విమానము వెంట బయలుదేరెను బ్రహ్మ లోకమునకుఁ బోయి యందఱును లోక పితామహుని సభను ప్రవేశించిరి. అందఱు నజుని చరణారవిందములకుఁ బ్రణమిల్లిరి. కుశల ప్రశ్నానంతరము యముడు తన యభిప్రాయము నాద్యంతము వినిపించెను. ఒక్కసారి సాధుకృపచే ననిచ్ఛా పూర్వకముగ భగవన్నామమును నీతడు వినినాడు. తానేమియు నడుగుటలేదు సరిగదా దానికి న్యాయముగ నేమి ఫలము లభింపవలయునో దాని నీయమనుచున్నాడు."

అంతయు విని అంభోజ గర్భుడు గంభీరముగ నిట్లనెను :— "నాయనలారా ! యథార్థమునకు నేను ప్రవృత్తిమార్గ పక్షపాతిని. సృష్టి రచనము, ధర్మాధర్మ నిర్ణయము చేయుట నాపని. కాని భగవన్నామ శ్రవణము సమస్త ధర్మముల కతీతమైనది. భగవన్నామము మహత్వము

నాకేమి తెలియును. శివుఁ డెల్లప్పుడును "రామ" "రామ" యనుచుం డును. ఆయనకు దీని మహత్వము కొంచెమో గొప్పయో తెలియును గావున "రామ రామ" యనుచున్నాడు పదండి, నేనుకూడ వచ్చెదను; పోయి ఆయన నడుగుదము."

అందఱును గైలాస పర్వతమునకు వచ్చిరి. శివుఁ డంతయును విని యిట్లనెను :— "నామము యొక్క యథార్థపు మహాత్మ్యము, దాని యుచ్చారణము యొక్క యథార్థపు ఫలము నామియగు నారాయణుడు తప్ప యింకొకఁ డెవ్వఁ డెఱుఁగ గలడు? కావున మన మందఱమును గలిసి వైకుంఠమునకు లక్ష్మీనారాయణుల దగ్గఱకుఁ బోవుదము. అతఁడే దీనిని నిర్ణయింపఁగలడు."

ఇప్పుడు సాగర తరంగములవలె విమానములు వైకుంఠమునకుఁ బోయెను. భగవంతుని సమ్ముఖమునను నీ యభియోగము తేఁబడెను. కాని భగవంతుడు పలుకలేదు. ఆ పురుషునిఁ బిలిచి తన వడిలోఁ గూర్చుండఁ బెట్టుకొని యిట్లనెను :— "దేవతలారా, మీరు మీ మీ లోకములకు సుఖముగఁ బొండు."

అంతఁ జేతులను జోడించి యముఁ డిట్లనెను :— "స్వామీ! మేమే కార్యమునకై వచ్చితిమో ఆ నిర్ణయమేమో తేలలేదు. వీనిని మేమే లోకమునకుఁ గొనిపోవలయును."

ఇది విని నవ్వుచు భగవానుఁ డిట్లనెను :— "ధర్మరాజా! నిర్ణయమైనది. ఇప్పుడు వీని నెచ్చటకు గొనిపోయెదవు? నా ధామము నకు వచ్చువాడు మరలఁ దిరిగిపోడు. నా నామమును బలుకు వానికిని, విను వానికిని నేనీయఁ గలిగినదిలేదు. కేవలము నా వానినిఁగాఁ జేసికొం దును. నా యంకముపైఁ గూర్చుండఁ బెట్టుకొందును."

పృథివి దుఃఖించుచు నిట్లనెను :— "నేనన్ని భారములను మోయఁగలనుగాని కృతఘ్నుని మోయజాలను" నాకంటెఁ గృతఘ్నుఁడీ లోకమున నెవడు కలడు ? నా తల్లి దండ్రులకు నేనొక్కఁడనే ఆశ్రయుడను. వారు సంపూర్ణమగు ప్రేమతో నన్నుఁ బోషించిరి. నా మల మూత్రములను గడిగిరి. తడిగుడ్డలలోఁ బరుండినవానినిఁ బొడిగుడ్డలలోఁ బరుండఁబెట్టిరి. వృద్ధావస్థలో వారిని నేను సేవించెదనని నామీఁద నెంతయో ఆశ పెట్టుకొనియుండిరి. కాని నేను నీచుఁడనై వారి ధనము నంతను నపహరించి, నిర్ధనులఁ గావించి వారిని బరిత్యజించితిని. నా పాపములక్కు లెక్కలేదు. అంతులేదు. ఘోర నరకములు తప్ప నాకే పేరుగతి లేదు. ధర్మఘాతుకులగు పాపులు వివిధ ప్రకారములగు భయంకర యమయాతనల ననుభవింపవలసి యుండును. కాని ఇప్పుడే నేను జూచిన అభూత పూర్వ అద్భుత దివ్యదృశ్యము, నా మనస్సు యొక్క భ్రమయా లేక స్వప్నమా ? నేను నిద్రయా పోలేదు. అంతయు జాగ్రత్తలోనే జరిగినది. కాని నన్ను బంధముల నుండి వదలించిన చతుర్భుజ రూపు లెచ్చటికి పోయిరి ? నన్ను గట్టిగాఁ గట్టివేసిన వారెవరు ? వారు మిక్కిలి భయంకరులుగను, బలవంతులుగ నున్నారు. వారు నన్నెంతో కష్టపెట్టిరి. వెంటనే నల్గురు సిద్ధగణ మిచ్చటికి వచ్చిరి. వారి దర్శనమెంత యపూర్వమైనది ! అట్టి దివ్యదర్శనము నాబోటి పాపికి లభింపదు. మరణకాలములో నిట్టి పుణ్యాత్ముల దర్శనమగుట పూర్వ జన్మములలోని మహత్పుణ్య విశేషము చేతనే. కాకున్న నీ జన్మములో నేను పాపమునే కావించితిని. నా బ్రాహ్మణత్వమును బోఁగొట్టుకొంటిని. వ్యభిచారమున మనస్సును లగ్న మొనర్చితిని. పరధనముల, పర చిత్తములను హరించి నిరపరాధులగు ప్రాణులను బాధించితిని. పూర్వజన

పుణ్యోదయమే నాకు కలుగకుండిన మరణ సమయమున నా జిహ్వ నుండి భగవన్నామము రాదు. కార్యమును బట్టియే కారణము నూహింప వలసి యుండును. అవశుడనై యుండగా నా నోట నంత్యకాలమున భగవన్నామము వెలువడినది. కావున నా కవశ్యము మేలు కలుగఁగలదు. నేనిప్పుడు నరకమునఁ బడి యమ యాతనలు ననుభవింపఁ బనిలేదు.

శుకమహర్షి యిట్లనెను :— "రాజా ! అజామిళుఁ డజ్ఞాని యని మనము శంకింపరాదు. మొదట నాతడు వేదశాస్త్రముల నన్నిటిని జది వెను. నారాయణ నామము శ్రీహరి నామమనియు, మృత్యుకాలమున నారాయణ నామమును బలికిన ముక్తి లభించునవనియు బాగుగఁ దెలియును వాని చే జ్ఞానమంతయు మఱచిపోవు నంతగా నాతడు వేశ్యా మోహమున బడెను. చివరకు వాని మోహమంతయును గనిష్ఠ పుత్రుఁడగు నారాయ ణుని మీఁదకుఁ బోయెను. భగవంతుడు కృపాసాగరుడు కావున నిట్లను కొనెను :— "కొందఱు నా పాషాణమయ మూర్తియందును, గొందరు కాష్ఠ, ధాతు, చిత్రమయ, మనోమయ, మణిమయ మూర్తులందు దమ మనస్సులను లగ్నమొనర్చు చుందురు. ఈతని యాసక్తి మాంసాస్థులతో నేర్పడిన బాలగోపాల నారాయణమూర్తి యందు కలదు. ఆ మిషతో నిరంతరము నా నామ కీర్తనము చేయుచున్నాడు. కావున నారాయణ నామము వాని యశుభముల నన్నిటిని నాశమొనర్చి వానినిఁ బావనము కావించినది."

విష్ణుపార్షదులు యమదూతల సమ్ముఖమున నీ భగవన్నామోచ్చా రణ మహాత్మ్యమును గూర్చి చెప్పఁగా నాతనికిఁ బూర్వస్మృతి కలిగినది. అంత నాతఁ డిట్లనుకొనెను :— "ఎంతటి యాశ్చర్యకరమగు విష యము ! కపటియు, పాపియు, నిర్లజ్జగల బ్రహ్మతేజో విహీనుఁడనగు

నేనెక్కడ? పరమ పావన, జగన్మంగళ సర్వాశుభఘ్నమగు నారాయణ నామమెక్కడ? ఇందులో భగవత్కృపతప్ప యన్యకారణ మేమియును లేదు. నేను నా ప్రయత్నమున నంత్యకాలమున నచేతన స్థితిలో భగవంతుని మంగళమయ నామముల నుచ్చరింపఁ గలిగెడు వాఁడను గాను. మంచిది, నా మీఁద భగవంతున కింతటి కృప యున్నప్పుడు ఇఁకముందు పొరపాటుననైన నేను పాపమొనర్పను. ఇప్పుడింక భగవత్కృపచేఁ పాప పంకమునుండి బయట పడెదను. ఈ నిరయ గర్తమునుండి బయట పడెదను. శ్రేయోమార్గము కొఱకై ప్రయత్న శీలుఁడ నయ్యెదను.

శుకమహర్షి యిట్లనెను :— "రాజా! ఈ విధముగ వివిధ విధములఁ దన్నుఁ దాను దూషించుకొనుచు నజామిళుడు తన పాపములను దలఁచుకొని పశ్చాత్తాపము చెందసాగెను."

## అజామిళునకు భగవత్పార్షద పదప్రాప్తి

## 365

శ్లో॥ హిత్వా కళేబరం తీర్థే గంగాయాం దర్శనాదను
సద్యః స్వరూపం జగృహే భగవత్పార్శ్వ వర్తినామ్ ॥
మ్రియమాణో హరేర్నామ గృణన్ పుత్రోపచారితమ్
అజామిళోఽప్యగాద్ధామ కింపునః శ్రద్ధయా గృణన్ ॥

శ్రీ భాగ. ౬ స్కం. ౨ అ. ౪౩. ౪౯ శ్లో॥

వ॥ — — — భాగీరథీ తీరంబునఁ గళేబరంబు విడిచెం గావునఁ దత్క్షణంబ హరి ప్రార్శ్వవర్తులైన దాసవరుల స్వరూపంబుఁ దాల్చి యా విష్ణు సేవకుల తోడంగూడి దివ్య మణిగణఖచితంబై సువర్ణ మయంబైన యసమాన విమానంబెక్కి సకల మహానంద భోగభాగ్యాను భవాకుంఠితంబైన వైకుంఠ నగరంబునకు శ్రీమన్నారాయణ పదారవింద సేవాచరణ పరిణామ స్థితికిం జనియె.

గీ॥ అరయఁ బుత్రోపచారిత మైన విష్ణు
నామ మవసాన కాలంబునను భజించి
శార్ఙ్గి నిలయంబుఁజేరె నజామిళుండు
నిట్లు సద్భక్తిఁ బలికిన నేమి సెప్ప॥

శ్రీమదాంధ్రభాగవతము.

పూర్వకృత పాపములకుఁ బశ్చాత్తాపము జెందనంతవఱకే జీవి కర్మబంధనములలోఁ బడి సంసారమను ఘోరారణ్యములలో దిరుగుచుండును. తానుజేసిన కృత్యములకుఁ బశ్చాత్తాపము కలిగిన జగత్సంస్మృతి నాశము కాఁగలదు. అట్టివాడు భగవత్కృపా ప్రసాదమును బొంది అతని ప్రియపార్షదుఁ డగును. సంసారమందీ యనిత్య నామరూపము లందుఁబడి జీవుడు విషయ పార్షదుఁడగును. ఈ యనిత్య పదార్థముల మీఁది మోహమును వీడి భగవంతుని నిత్యనామ రూపము లందుఁబడి అతనిపై ననురాగము కల్గిన నాతఁడు ప్రభుపార్షదుఁ డగును. అట్టివాడు తన క్షుద్రత్వమును వీడి మహాత్ముఁడగును.

శుకమహర్షి యిట్లనెను :— "రాజా! అజామిళున కిప్పుడు తన పాపముల మీఁద నత్యధిక దుఃఖము కలిగెను. చాలసేపటి వఱ

కాతడు తన కృత్యములను దలచుకొని యేడ్వసాగెను. ఆతనిలోని కలుష మంతయును కరిగి నేత్రముల ద్వారా బయట పడుచున్నదా యను నట్లుండెను. అధీరుఁడై యాతడు కరుణాక్రందనముఁ జేయుచు విలపించు చుండెను. చివరకాతడు ధైర్యమును ధరించి ఇట్లు నిశ్చయించుకొనెను :— “అయినదేమో అయినది. ఇఁకముందు నేను నా మనః ప్రాణేంద్రియములను వశమందుంచుకొని, ఇఁక నంధతమ నరకములలోఁ బడకుండు ప్రయత్నము నొనరించెదను. ఇప్పుడు నేను అవిధి కామ, కర్మాదులచే నుత్పన్నమైన కర్మ బంధనమును ద్యజించి, సమస్త ప్రాణులందు సౌహార్ద్రమును స్థాపించుచు, నందఱకు మిత్రుఁడను, దయాళుఁడను, శాంతుఁడను, సంయతేంద్రియుఁడనై స్త్రీ రూపమగు భగవన్మాయను దూరమున నుండియే, అంజలి కావించెదను. ఇంతవఱకు కోఁతినిజేసి ఆడించినదియుఁ గొండముచ్చును జేసి త్రిప్పినదియు, పెమ్మెను జేసి యిష్టము వచ్చిన పని చేయించినదియు నదియే. ఇంతవఱకు అసద్బుద్ధిచే నహంకార మమకారములను జెందియుంటిని. ఇప్పుడు సద్బుద్ధిచే భగవన్నామ కీర్తన శ్రవణాదులలో గడిపెదను.”

శుకుఁ డిట్లనెను :— “రాజా! క్షణకాల సత్సంగ ప్రభావమును జూడుడు. ఇప్పు డజామిళుని హృదయమందు తీవ్ర వైరాగ్య ముత్పన్నమయ్యెను. ఆతడు తనది నూతన జన్మగాఁ దలఁచెను. నిజముగా నది నూతన జన్మయే. మొదట ఉత్తమజన్మ బ్రాహ్మణి గర్భమునఁ బుట్టుటయు, ద్విజోచిత సంస్కారములచేఁ బోషింపఁబడుటయు, రెండవజన్మ అధమయుఁ బాపియునగు వేశ్యాసంసర్గమున నవైధ సంతానమును గనుటయు, వివిధ పాపము లొనర్చుటయు, నిప్పుడు మూఁడవజన్మము విష్ణుపార్షదుల నోట భగవన్నామ మాహాత్మ్యమును వినుటయునై యున్నది.

ఇదియే అతని కంతిమజన్మము; ఇఁక నతఁడెన్నటికినిఁ బ్రపంచములో గర్మవశమునఁ బుట్టుటయు, మరణించుటయు నుండదు.”

సావధానుడు కాఁగానే అతడు తన దండ కమండులువుల నెత్తఁగా వేశ్య ‘ఎచ్చటికి వెళ్లెద”వనెను.

అజామిళుడు “నారాయణ నారాయణ” యనెను.

ఆమె యిట్లనెను :— “ఏమండీ ! ఇప్పుడు చాల దుర్బలముగ నున్నారు. అడవికి తర్వాత వెళ్ళవచ్చును. ఇంక నింటిలో సామాను కలదు.”

అజామిళుడు మరల “నారాయణ నారాయణ” యనెను.

వేశ్యయిట్లనుకొనెను :— నేడు ధనుర్బాణములను గైకొనలేదు. నేఁడీతని చేష్టలును విచిత్రముగ నున్నవి. చూడఁగా జ్వరము వేడి తల కెక్కినట్లున్నది. జ్వరోన్మాదమున వాగుచున్నట్లున్నాడు.” అనుకొని యిట్లనెను :— “మీ మనస్సు సరిగాలేదా ? జ్వరము రాలేదు కదా ?”

అజామిళుని కామజ్వరము శాశ్వతముగ దిగిపోయినది. అతని వికృత మస్తిష్కమిప్పుడు బాగుపడినది. అతడు “నారాయణ నారాయణ” యని తప్ప వేఱు ప్రత్యుత్తర మిచ్చుటలేదు. అతడు కన్యాకుబ్జ దేశము నుండి గంగాతీరమునసే గొప్ప గొప్ప చక్రవర్తులు రాజ్యమువీడి, యిఁక తిరిగిరామని సంకల్పించుకొని వెడలు యుత్తర దిక్కుగాఁ బోయెను. కాలినడకను గంగ యొడ్డుననే అతడు పాంచాల, సంసత్తర దేశములను దాఁటి గంగాదేవి తన తండ్రియగు హిమవంతుని పదినుండి నేలపైకి దిగిన చోటునకుఁ జేరెను. దానినే గంగాద్వారమనియు, హరిద్వారమనియు, కుశావర్తక్షేత్రమనియుఁ బిల్తురు. అతడు రాఁగానే ప్రశా

కుండమున స్నానమొనర్చెను. స్నానము చేయఁగానే యాతని యంతః కరణము నిర్మలమయ్యెను. ఒక శాంత ఏకాంత స్థానమందు, గంగ యొడ్డుననే అతఁడొక పూరిపాకను నిర్మించుకొని, అందాసనమును బఱచుకొని కూర్చుండి యోగాభ్యాసము జేయనారంభించెను.

ఈ ప్రకృతి యందు వికృతి కలుగఁగానే ఈ యింద్రియములు, మనస్సు, విషయములు, భూతములు వీనియందు మూలము పరివర్తనము జరుగును. ఇచ్చటనే సమస్త పదార్థములను యోగద్వారముసి బ్రహ్మ మందు లీనమొనర్చినఁ బురుషుడు మాయారహితుడు, విశుద్ధానందఘనుడు చైతన్య స్వరూపుఁ డగును. అజామిళుడును నా ప్రాచీన పరిపాటినే అనుసరించెను. భగవన్నామమును సహాయముగఁ గొని నామ సంకీర్తన మొనర్చుచు నాతఁడీ పాంచభౌతిక శరీరమును విద్యుక్తముగ నాశము జేయఁ దలచెను.

మును ముందుగా నాతడు యమనియమాభ్యాసము కావించుచు నాసనమును దృఢ మొనర్చుకొని ప్రాణాయామాభ్యాసముచేఁ జెదరిన చిత్తవృత్తి నంతర్ముఖము కావించుకొనెను. తన సమస్తేంద్రియములను దత్తదుపభోగ్య వస్తువుల నుండి యుపసంహరించి, మనమందు లీన మొనర్చి, మనస్సును బుద్ధియందు లీనమొనర్చెను. అంత నధ్యాత్మ యోగముద్వారా ఆత్మను శరీరాది దృశ్యవర్గము నుండి వేఱుచేసి, దానిని జ్ఞానమయ భగవత్స్వరూపమందు బ్రహ్మమందు లీనమొనర్చెను. ఈ విధముగ నాతని బుద్ధి భగవత్స్వరూపమందు స్థిరము కాఁగానే బుఱ్ఱని ధ్వని చేయుచు దివ్యవిమాన మొకటి దిగుటను గాంచెను. దానియందు నల్గురు తేజస్వులగు మహాపురుషు లుండిరి. అందఱును జతుర్భుజులే. అందఱ హస్తములలో శంఖ, చక్ర, గదా, పద్మములు శోభిల్లుచుండెను.

అందఱును మోఁకాళ్ళవఱకు వ్రేలాడు వనమాలను ధరించిరి. అందఱును పీతాంబరములను ధరించిరి. వారిని జూడఁగానే అజామిళుడు, తన్ను మృత్యుపాశము నుండి వదలించిన తన గురుదేవులేనని గ్రహించెను. వీరు నా యిష్టదేవుని ప్రియపార్షదులు, భగవత్స్వరూపులు, పరమ పరోపకారులు, మరల నన్నుఁ గృతార్థులఁ గావింప వచ్చినారు." అని భావించి, యాతడు శీఘ్రముగ లేచి, భూమిపైఁబడి, అత్యంత శ్రద్ధా భక్తులతో భగవన్నామమును బలుకుచు సాష్టాంగ నమస్కారము కావించెను. ఆతడు ప్రేమాశ్రు విమోచనము కావించుచు గద్గద కంఠముతో "నమో నారాయణ, నమో నారాయణ" యని మాటి మాటికి పలుకుచుండెను.

భగవత్పార్షదులు మేఘ గంభీర వాక్కులతో నత్యంత స్నేహముతో నిట్లనెను :— "మహాభాగా ! ఇఁక నీవు వైకుంఠమునకు రావలయును. అచ్చట మాయాప్రపంచ గంధము లేశమాత్రమైన నుండఁబోదు."

ఇది విన్నఁగానే అజామిళుడు శీఘ్రముగ లేచి, కుటీరమును వదలి గంగాతటమునకు వచ్చెను. నడుములోతు నీటిలో నిలుచుండి యా పరమ పావన కుశావర్త క్షేత్రమం దాతడు తన యీ పాంచభౌతిక నశ్వర శరీరమును తత్కాలమునఁ త్యజించెను. తత్క్షణమాతనికి దివ్యచతుర్భుజ రూపము వచ్చెను. విష్ణుపార్షదుల కెట్టి రూపము వచ్చినదో యతని కట్టి రూపమే వచ్చినది. ఆతడును విష్ణుపార్షదుఁ డయ్యెను. విష్ణుపార్షదుఁడై అజామిళుఁడా పార్షదులతో దివ్య సువర్ణమండిత విమానమునెక్కి, ఆకాశమార్గమున లక్ష్మీదేవితో శ్రీమన్నారాయణుఁడుండు నిత్య వైకుంఠ

ధామమునకుఁ బోయెను. భగవన్నామ ప్రభావమున నాతడు భగవంతు నకుఁ బ్రియ పార్షదుఁడై నిరంతర మాలోకమున నివసించుచుండెను.

శుకమహర్షి యిట్లనెను :— "రాజా ! ఇంతకుమించి భగవన్నామ మహిమ మింకేమి చెప్పఁగలము ? చూడుము, ఎవడు విశుద్ధ బ్రాహ్మణు డయ్యు సురాపానము, హింస లాచరించుచుఁ, గులగత ధర్మమును వీడి, నిందిత పాపమయ కర్మల కారణమున హీన, భయంకర నరకములలోఁ బడఁబోయిన ద్విజాధముఁడే "నారాయణ" యను భగవన్నామమును బలుకుటచేఁ దత్క్షణము సంసార చక్రము నుండి ముక్తుడయ్యెను. భగవంతునకుఁ బ్రియపార్షదుఁ డయ్యెను. దీనికి మించిన సరళ, సుగమ, సర్వోపయోగమగు చక్కని సన్మార్గ మింకేది కలదో నీవే చెప్పుము. ముముక్షువుల కర్మబంధనముల ద్రెంచు శ్రీహరి నామ సంకీర్తనమునకు మించిన సరళ సాధన మింకేదియును లేదు. విశేషించి కలికాలములో నిదిగాక యింకొక గతియే లేదు. చిత్త మొక్కసారి దీని యందు లగ్నమయ్యెనా మరల సాంసారిక కర్మలందది లగ్నము కానీయనట్టి సాధనమిది. అట్టివాఁడికఁ బాపమును జేయడు. కావున సమస్త పాపములకు భగవన్నామ సంకీర్తనము తప్ప వేఱు ప్రాయశ్చిత్తము సర్వశ్రేష్ఠమైనది లేనేలేదు. ఇది భవరోగము లన్నిటికిని వ్యర్థముకాని అమోఘ, సర్వసుగమమగు నమూల్యౌషధము. ఇతర శరీర శోషణ సంబంధమగుఁ బ్రాయశ్చిత్తము లొనర్చుకొనుటచేఁ జిత్తము, రజోగుణ, తమోగుణ గ్రస్తమై యుండును, గాని యీ ప్రాయశ్చిత్తముచే జీవి గుణాతీతుఁ డగును. కావున రాజా! భగవన్నామ కీర్తనమే సర్వ పాపముల నుండియు, సర్వ నరకముల నుండియు, సమస్త యాతనల నుండియు రక్షింపఁగలదు. నేను నామమాహాత్మ్య ప్రసంగమున నత్యంత

సంక్షేపముగ నజామిళుని పుణ్యమయాఖ్యానమును నీకుఁ జెప్పితిని. ఈ పుణ్యమయాఖ్యానము నంతను నెవ్వఁడు శ్రద్ధా భక్తిపూర్వకముగ వినునో చదువునో వాఁడెన్నఁడును నరకములను జూడవలసిన పనిలేదు. వారికి గూడ క్రమ క్రమముగా భగవన్నామ కీర్తనమందు రుచి పెరుగును. వారును దమ జిహ్వలతో సర్వపాప ప్రశమనమగు నారాయణ మంత్రో చ్చారణమును జేయుదురు. ఇదివఱకెన్ని ఘోరపాపములు చేసినప్పటికిని హరి నామాశ్రయము గావించినచో వైకుంఠమునకుఁ బోయి, అచ్చట విష్ణు పార్షదుల ద్వారా మహా మహిమాన్వితుఁ డగును.

మహారాజా! భగవన్నామము యొక్క సమగ్ర మాహాత్మ్యమును జెప్పుట కెవరికి సమర్థతకలదు? నీవు కైముత్య న్యాయముచే నింతటి పాపియగు బ్రాహ్మణుడు కేవలము మరణ కాలమున వికలుడై పుత్ర మిషచే భగవన్నామమును బలికిననే తరింపఁగా, నింక భక్తిపూర్వకముగ నామకీర్తన మొనర్చినచో వాని ముక్తి విషయమున నింక సందేహము వలదు. ఈ యాఖ్యానముచే స్వేచ్ఛగాఁ బాపము లొనర్చిన భగవన్నా మము సమస్తము నాశము గావించునని భావింపరాదు. పాపప్రాయశ్చిత్త మైన తర్వాత శరీరముచేఁ బాపములు సంభవింపవని కాదు. వెనుకటి పాపములు భస్మముకాఁగా నామసంకీర్తనము చేయుటచే నాతని చిత్తము క్రమ క్రమముగా శుద్ధమై భగవన్నామ కీర్తనమందు రసముత్పన్న మగును. ప్రేమ యుత్పన్నము కాఁగానే యా ప్రేమయే వానిని బ్రహ్మ లోకము వఱకుఁ జేర్చును. రాజా! నే నజామిళుడు వైకుంఠము బొందు వఱకు వర్ణించితిని. ఇప్పుడు నీవేమి వినఁగోరెదవు?"

అంతఁ బరీక్షిన్మహా రాజిట్లనెను :— "స్వామీ! మీరు నా

కత్యంతాద్భుత ఉపాఖ్యానమును చెప్పితిరి. నరకవర్ణనము వినఁగా వినగా నా రోమములు నిక్కబొడుచినవి. నా గుండెలదరినవి. మిక్కిలి భయము వేసినది. ఆ భయ మిప్పుడు భగవన్నామ మాహాత్మ్యమును వినఁగానే పోయినది. మానవుడు తలచుకొనిన నరకముల నుండి సుగమముగ బయట పడఁగలడు. ఏలననగా దీని కేబాహ్యోపకరణము నవసరము లేదు. విలువగల సామగ్రినిఁ బ్రోవుచేయు బాధలేదు. భగవన్నామము సరళమైనది, సుగమమైనది, అందఱెఱిగినదే. నామములైనను ఒక్కటియు, రెండు గాదు. అతని వనంత నామములు. కొన్ని గుణానుసారములు, కొన్ని కర్మానుసారములు. నాల్క మన సొత్తే ఎచ్చటనైనఁ దేవలసిన పనిలేదు. అట్టి భగవన్నామము నుచ్చరింపకుండిన నది వారి పొరపాటే. రోగి మహావ్యాధిచేఁ బీడింపబడుచు, వానికడ నమృతోపమము సర్వార్థమునగు నౌషధిసుండియు, దానినిఁ బానము సేయకయు, నాలుకతో ముట్టకయు నుండిన వాని రోగమెట్లు క్షయమగును. వాఁడట్లే యాతనల ననుభవింపవలెను. స్వామీ ! ఆ యమదూత లేమైరో నేను వినగోరు చున్నాను. విష్ణుపార్షదులు వారిని బాగుగ నలగఁ బొడిచిరి. ధర్మరాజుని యాజ్ఞ యింతవఱకు ఉల్లంఘింపఁబడలేదు. కాలము దుర్నివారమందురు. దూతలు యముని కడకు ఱేరకపోఁగా యముఁడేమనెను ? రాజాజ్ఞోల్లంఘనము కావించుట అశస్త్రవధయని చెప్పఁబడినది. తన యాజ్ఞాపాలనము జరుగకుండిన ధర్మరాజునకు బాధ కలుగుట స్వాభావికమే. అతఁడతని దూతలను గోపపడి యడిగి యుండవచ్చును. అప్పుడు దూతలేమనిరి ? తాము నిర్దోషులమని యెట్లు చెప్పిరి ? ఇదిగాక నా కింకొక సందేహము కలదు. యమధర్మరాజు సర్వజ్ఞుడు కదా, అతని కీతని మృత్యు సమయ మిప్పుడు కాదనియు, నీతడు వైకుంఠమున కధికారియనియుఁ దెలియదా ? ఇంతటి జ్ఞానహీనత యింతటి లోకపాలకునకుఁ గలుగుట సంభవమా ?"

ఇది విని శుకదేవుడు నవ్వి యిట్లనెను :— "రాజా! నీ ప్రశ్న చాల ఉత్తమమైనది. ధర్మసంగతమైనది. దీనికి ప్రత్యుత్తరము నీకు ఉపాఖ్యానముల ద్వారా యొసంగెదను. నీ వీ విషయమును నేకాగ్రచిత్తుడవై శ్రవణము చేయుము. చిత్తము నటు నిటుఁ బోనీయకుము. తెలిసినదా?"

## రిక్తహస్తులగు యమదూతలు యమునకు నివేదించుట

## 366

శ్లో॥ నీయమానం తవాదేశదస్మాభిర్యాతనాగృహాః
వ్యమోచయన్పాతకినం ఛిత్త్వా పాశాన్ప్రసహ్యతే ॥
తాంస్తే వేదితుమిచ్ఛామో యది నో మన్యసే క్షమమ్॥
నారాయణేత్యభిహితే మా భైరిత్యాయయుర్ద్రుతమ్ ॥

శ్రీ భాగ. ౬ స్కం. ౩ అ. ౯ ౧౦ శ్లో॥

సీ॥ ఇట్టి నీదండంబ యీమూడు జగములఁ
దెగువమై నేడు వర్తిల్లుచుండ
మనుజలోకంబున మహితాద్భుతాకార
సిద్ధుల మిగులఁ బ్రసిద్ధులైన

వారు నల్వురు వేగ వచ్చి నిర్దేశంబు
భంగించి మమ్మంత బెంగఁదోలి
నీ శాసనంబున నే మీడ్చికొని వచ్చు
క్రూరచిత్తునిఁ బుచ్చికొని యదల్చి

గీ॥ పాశబంధంబు లీసునఁబట్టి త్రెంచి
బలిమి మిగులంగ మమ్మను బాఱఁదోలి
యిచ్చఁజనినారు వారదా యెచటివార
లాదరమ్మున మాకు నేఁడానతిమ్మ ॥

శ్రీమదాంధ్రభాగవతము.

బావిలోని కప్ప, అంపలి పెద్ద కప్పనే అన్నిటికంటెఁ బెద్దజంతు వనుకొనును. బావిలోని కప్పలన్నియు సముద్రము జూచు భాగ్యమును బొందవు. అక్కడ నవి తిమి తిమింగిలము, తిమింగిలాది పెద్ద జంతువులను జూచిన వాటికిఁ గన్నులు తెరిపిడి పడును. కాని అవి చేపలను, జల్లలు మొదలగు చిన్న జంతువులను దినుచుఁ దమ బలపౌరుషములను జూపించుచుఁ దామే అప్రతిహత జంతువుల మనుకొనుచు అంతకంటెఁ బెద్ద జంతువు వచ్చి వానిని నలుగఁబొడిచిన నప్పుడు తమకంటెఁ బెద్ద జంతు జీవులున్నవను జ్ఞానము వాటికి కలుగును.

శుకమహర్షి యిట్లనెను :— "రాజా! యముడు సర్వజ్ఞుడు కదా, అజామిళున కిట్టి స్థితి కలుగునని యాతనికి తెలియదా? అట్లు తెలిసియుండిన వైకుంఠమునకు వెళ్ళవలసిన వానినిఁ దెమ్మని తన దూతలను దెబ్బలు తినుఁడని పంపెనా? లేనిం దాతనికి తెలియకుండిన్న నాతడు సర్వజ్ఞుడు కాడుగదా!" యని యడిగితివి. ముందుగా నేన్

ప్రశ్నకు సమాధాన మొసంగెదను. అసలు విషయ మేమనఁగా జ్ఞానము నకును సర్వజ్ఞతకును హద్దుకలదు. మూర్ఖునికంటెఁ జదివినవాఁడు సర్వజ్ఞుడు. వానికంటె సిద్ధుడు సర్వజ్ఞుడు. అతనికంటె దేవత, అతనికంటె లోకపాలురు, వీరికంటె బ్రహ్మ సర్వజ్ఞులు. ఆ సర్వజ్ఞుఁడగు బ్రహ్మయే. రాజకుమారుఁడగు ప్రియవ్రతున కుపదేశము చేయుచు స్పష్టముగ నిట్లు చెప్పెను :— "ఆ సర్వాంతర్యామి యగు ప్రభుని చేష్టలను బూర్ణముగఁ దెలియుటకు నేనుగాని, రుద్రుడుగాని, ఇంద్రాది దేవతలుగాని సమర్థులము కాము. సమస్త ప్రాణుల పుణ్య పాపములను దెలియుటకు యముడు సర్వజ్ఞుడు. అందఱి పాపపుణ్యముల ప్రమాణ మాతనివద్ద లిఖింపబడి యుండును. దాని ననుసరించి ప్రాణుల కాతడు సుఖదుఃఖములను, స్వర్గ నరకములను నిచ్చుచుండును. కాని యే కారణముచే నైన నా క్షణమున విశేషకృప కలిగిన దానిని లోకపాలురుకూడ దెలిసికొనఁ జాలరు."

ఇది విని శౌనకుఁ డిట్లనెను :— "సూతా ! భగవత్కృప యందఱియందు సమానముగ నుండును. కాని విశేషకృప విశిష్ట పుణ్యాత్ముల పైననే యుండును. పాపులు తమ పాపముచే భగవత్కృపకుఁ బాత్రులు కారు."

ఇది విని సూతుఁ డిట్లనెను :— "మహాభాగులారా ! భగవంతుడు ధర్మమూర్తి యనియు, ధర్మాత్ము లాతనికిఁ బ్రియులనుట నిజమే కాని అతనికృప కధికారులు ధర్మాత్ములేనను నియమములేదు. అతడెవరిని వరించునో అతఁడే యధికారి. ఇప్పుడు పాపాత్ముడుగా గనఁబడువాడు పూర్వజన్మమునఁ బుణ్యాత్ముడు కావచ్చును. భగవంతుడు గుణములచేతనే ప్రసన్నుఁ డగునను నియమము లేదు. శుద్ధాచరణము వలననే పవిత్రా చరణము వలననే భగవంతుడు ప్రసన్నుఁడగుచో ధర్మవ్యాధుడు

నిత్యముమ మాంసము నమ్ముకొనెడు వాడు కదా! గద్ద (జటాయువు) అత్యంతా పవిత్ర, అత్యంత నిందనీయమగు మాంసాహారి కదా! ఏ యింటిమీఁద గ్రద్ద వ్రాలి దో ఆ యింటిని పునస్సంస్కార మొనర్పవల యునని ధర్మశాస్త్రములు వచించుచున్నవి. భగవత్కృపకు పాత్రులు విద్వాంసులే యగుచో ఋషవానరు లేపాఠశాలలోఁ జదివిరి గజేంద్రుఁ డేమి పరీక్ష నిచ్చినాడు? పై విషయములను బట్టి భగవదనుగ్రహము ఏదైన గుణము ననుసరించిగాని, నియమము ననుసరించిగాని లేదనియు, అది యే క్షణమున, నెవరిమీఁద, నే విధముగ వచ్చునో యమదూతల కేమి తెలియును? యమున కేతెలియదు. మునులారా! అజామిళోపాఖ్యా నము చాల ప్రాచీనమైనది. నేనీ కలియుగమునకు సంబంధించిన అర్వా చీన సత్యేతిహాసమును వినిపించెద వినుడు. దానివలన మీకు భగవంతుఁ డేవిధముగ నకస్మాత్తుగఁ గృపఁజూచునో తెలియఁగలదు.

పంచనద దేశాంతర్గతమగు గులేరమను చిన్న రాజ్యము కలదు. అచ్చట నొక పరమ ధార్మికుడును, పరమ భాగవతుడు నగు నొక రాజు కలడు. అతనికడ నొక నౌకరుండెను. అతనికి ధర్మమందంతగా రుచి లేదు. కానియాతడు స్వామిభక్తుడు. అతనికి రాజాజ్ఞాపాలన మొ[illegible] యందును, అపరాధులను బట్టుకొనుట యందును, రాజాజ్ఞచే దండింపఁ జేయుట యందాతని కానందము. అతఁ దుగ్ర స్వభావము కలవాడు. రాజున కాతనియందు సహజానురాగము. అతడు రాజుయొక్క కృపా పాత్ర సేవకులలో నొక్కఁడుగ నెన్నఁబడుచు [illegible]డు. కొంతకాలమున కాతడు చనిపోయెను.

ఆ నౌకరే ఒక ఛాయామూర్తివలె రాజసమ్ముఖమున నిలువఁబడి యుండుటను రాజు గాంచెను. మొట్టమొదట రాజునకు సందేహము

కలిగినది. మరల సాహసము వహించి అతనినిఁ జేరఁ బిలిచెను. అతడు రాజునకుఁ బ్రణామ మొనరించి ప్రత్యుత్తర మొసంగెను. "నీవు చచ్చితివిగదా యిచ్చటికెట్లు వచ్చితివని" రాజడిగెను.

అతఁ డిట్లనెను :— "మహారాజా! అవశ్యము నేను చచ్చితిని. చచ్చి నేను యమదూతనైతిని. ఇప్పుడిక నేను ఎవరి యాయువు మూడి నదో వారినిఁ బట్టుకొని యమునికడకుఁ గొనిపోయెదను. నావెంట నింక నిద్దరున్నారు. నేను మీ మీఁదగల స్నేహమ్ము దర్శింప వచ్చితిని."

రాజు మిక్కిలి కుతూహలముతో నిట్లనెను :— "ఇచ్చటికి నీవెవరిని బట్టుకొని పోవుటకు వచ్చితివి ?"

అత డిట్లనెను :— "మహారాజా! ఫలాని జమీందారు మిక్కిలి క్రూరుడు, ద్వేషి. అతనినిఁ బట్టుకొని పోయెదము. అతఁడీ రాజు దగ్గ అనే యున్నాడు. నిన్న నతడు స్వస్థముగ నున్నట్లు రాజు చూచెను. అందువలన రాజునకు విశ్వాసము కలుగక యిట్లనెను :— "మంచిది, నీ వాతనినిఁ దీసికొని పోవునపుడు నన్నుఁ గలిసికొని పోవలెను."

అతడు వినీత భావముతో నిట్లనెను :— "మంచిది, మహారాజు నాజ్ఞ ప్రకారమే" అని యతఁ డంతర్ధానమయ్యెను.

కొంచెము సేపైనతర్వాత మరల నాతడు వచ్చెను. రాజిట్లనెను :— "మీరాతనినిఁ దీసికొని పోవుచున్నారా ?"

ఆ దూత యిట్లనెను :— "మహారాజా! అతడు మా చేతికిఁ జిక్కలేదు."

రాజాశ్చర్యముతో నిట్లనెను :— "ఏల ? ఏమైనది ? వానిని మీరేల బట్టుకొనఁ జాలక పోయితిరి ?"

మాత యిట్లనెను :- మహారాజా ! నేఁడే యీతఁడు తన గుఱ్ఱము నెక్కి పొలమునకుఁ బోవుచుండెను. అతనికి మృత్యువాసన్నమగుట నప్పటి కాతఁడు గుఱ్ఱము మీఁదనుండి క్రిందఁబడి ప్రాణములు విడిచెను. దైవికముగ నాతఁడు పడినచోట నేలపొర క్రింద నొక దివ్య శాలగ్రామ మూర్తి కలదు. శాలగ్రామ శిలపైఁ జచ్చి, దానిని దాఁకినవానిని మేమెట్లు స్పర్శింపఁగలము. వెంటనే విష్ణుదూతలు వానినిఁ గొనిపోయిరి. మేము తిరిగి వెళ్ళుచున్నాము.''

ఇది వినఁగానే రాజున కింకను కుతూహలము కలిగి, తన మంత్రులను దీసికొని యా చోటునకుఁ బోయెను. అంతయు నిజమే. అతఁడు గుఱ్ఱముపైఁ బోయి యుండెను. అచ్చటఁ జచ్చిపడి యుండెను. రాజా క్షణముననే భూమిని త్రవ్వించెను. దానిలో నుండి ఒక దివ్యశాలగ్రామమూర్తి వెలువడెను. రాజు దానినిఁ జాల శ్రద్ధతో స్థాపించెను. కులేరు రాజ్యాస్థానమున నిప్పటికిని ఆ శాలగ్రామము కలదు. ఇది కథ కాదు. ప్రత్యక్ష సంఘటనము. కావున నో మునులారా ! ఏ సమయమున నెట్టిది జరుగునో అది భగవంతునికే తెలియవలెను. అజామిళుని మీఁద భగవంతుని కేల యనుగ్రహము కలిగినదో, అతని నోటినుండా భగవన్నామ మేల వెలువడినదో అది భగవత్కృప గాక యింకే మగును !''

శౌనకుఁ డిట్లనెను :- "అవును సూతా ! నీవు సత్యమునే చెప్పుచున్నావు. భగవత్కృపా సంబంధమున నిశ్చయముగ నేమియుఁ జెప్ప జాలము. ఆ విషయము భగవంతునికి తప్ప యింకెవ్వరికిని దెలియదు. ఇఁక దర్వాత వృత్తాంతమును జెప్పుడు." అంత సూతుఁ డిట్లనెను :- "మహాభాగులారా ! వినుడు. నా గురుదేవుడు శుకునెట్లు పరీక్షిత్తుఁడడిగెనో ఆ వృత్తాంతమును గూర్చి మీకు జెప్పెదను."

పరీక్షిన్మహారాజు శుకునితో నిట్లనెను :— "స్వామీ! ప్రపంచ మంతయు ధర్మరాజు ఆధీనములో నున్నది. అట్టియెడ నాతని యాజ్ఞ ఉల్లంఘింపఁబడి, విష్ణు పార్షదులు వారివి బాదఁగా నాతడు తనదూతలతో నేమనెను ? అతడు విష్ణు పార్షదులపై భగవంతుని న్యాయాలయమున మానహానికి శాంతి భంగమునకు నభియోగమును దేలేదా ? స్వామీ! నాకీ ఘటనము వలనఁ జాల యాశ్చర్యము కలుగుచున్నది. ఇంతవఱకు యముని యాజ్ఞ నుల్లంఘించుటను జూడలేదు; విననులేదు. నా ఈ శంకను సరళముగఁజెప్ప సర్వజ్ఞులరు గావున మీరే సమర్థులు."

ఇది విని నవ్వుచు శుకుఁడిట్లనెను :— "రాజా! వినుము. యమదూతలు విష్ణు పార్షదులచే దెబ్బలుతిని, ముఖము వ్రేలాడవైచు కొని దీనభావముతో యమునితో నిట్లనిరి :- "ప్రభూ! ప్రాణుల పుణ్య పాపముల యొక్కయు, మిశ్రితకర్మలన్నిటి యొక్కయు కర్మఫలముల నొసంగు శాసకులు నిశ్చితముగ నెందఱు ?"

తన దూతలనోట నిట్టిప్రశ్న వెలువడఁగానే యముడు చిక్కులో బడి యిట్లనుకొనెను :- "వీరిట్టి విచిత్ర ప్రశ్న నడుగుచున్నారు. ఇట్టి దానిని వీరిదివఱలో నడిగి యుండలేదు."

యము డాశ్చర్యముతో నిట్లనెను :— "మీ యీ ప్రశ్నయొక్క అభిప్రాయమేమి ?"

యమదూతలు నమ్రతతో నిట్లనిరి :— "స్వామీ! అభిప్రాయ మేమందురా ? ఒక్క స్వామి యగుచో న్యాయము సరిగా జరుగును. చాలమంది స్వాములగుచో నొకరు దండించుటకుఁ బట్టుకొనిన వేఱొకడు విడిచివుచ్చును. అట్టియెడ నపరాధ మొనర్చినవారు కూడ దండమునుండి

తప్పించుకొందురు. చాలమంది అపరాధము లేకయే దండింపఁబడెదరు. ఎవరికి సుఖ దుఃఖములు రావలెను ? ఎవరికి అట్లు రానీయఁగూడదో యీ నిర్ణయ మెవరు చేయఁగలరు ?"

యముఁడిట్లనెను :— "పాపపుణ్యములు లొనర్చువారు చాలమంది గలరు. ఒకని వలన న్యాయము జరుగకున్న జాలమంది న్యాయాధీశులను నియుక్త మొనర్చుకొందురు. కావున శాసకుఁ డొకడుండవలెనో చాల మంది యుండవలయునో అను నియమములేదు. ఒకనికంటె నెక్కువ మంది శాసకులుగూడ నుందురు."

యమదూత లిట్లనిరి :— "స్వామీ ! శాసకు లనేకు లుండ వచ్చును. కాని వారికిష్టము వచ్చినట్లు చేయరాదు. వారందఱు నొక్క ప్రధాన శాసకుని యధీనములో నుండవలెను, కావున శాసనవిధానములో స్వతంత్రతలేదు. మాండలి కేశ్వరులనేకు లుందురు. కాని వారందఱకు చక్రవర్తి యొక్కఁడే యుండును. ఈ లోకములో సమస్త శాసకులకుఁ బ్రధాన శాసకులు శుభాశుభ నిర్ణయమొనర్చు దండధరులు మీరొక్కరేనని ఇంతవఱకు అనుకొనుచున్నాము."

నవ్వి ధర్మరాజిట్లనెను :— "ఇంతవఱకు అనుకొనుచున్నా మనుచున్నారు. ఇప్పుడేమను కొనుచున్నారు ?"

యమదూత లిట్లనిరి :— "మహారాజా ! మాకిప్పుడు కొంచెము సందేహము వేయుచున్నది. అందుకనియే నేఁడట్టి ప్రశ్న వేసితిమి. ఇంతకు పూర్వము మేమట్టి సందేహమును జెందలేదు. నేఁడట్టి సంఘటన మొకటి జరిగినది."

యముఁ డిట్లనెను :— "అదియేమి సంఘటనము జరిగినది?"

యమదూత యిట్లనెను :— "మహారాజా ! ఏమి చెప్పుదుము? మీ యాజ్ఞానుసారముగ నొకా నొక పాపిని మేము కట్టి నరకమునకుఁ దెచ్చుచుండ నల్గురు చతుర్భుజములుగల దివ్యపురుషులు శీఘ్రముగవచ్చి బలపూర్వకముగ వానిని విడిచిపుచ్చి, చిన్ననాటి ఉగ్గుపాలను గూడ క్రక్కునట్లు కొట్టిరి. ఇంకొకసారి యిట్టిదెబ్బలు తగిలియుండిన మేము చూర్ణమయ్యెడు వారమే. కావున స్వామీ! మా పట్టమును దీసికొనుడు. మే మీ నౌకరీకి రాజీనామా పెట్టుచున్నాము. స్వీకరించుడు."

యముఁ డిట్లనెను :— "నాయనలారా ! అసలు విషయమును జెప్పుడు. ఏమియును జెప్పకుండిన మిమ్ములను వదలుట కేరికి సాహస ముండును ? అతడు చచ్చునపుడేమైన ననెనా ?"

యమదూత లుపేక్షా స్వరమున నిట్లనిది :— "స్వామీ ? అత డేమి యనఁగలడు మట్టి ! అతనికి చైతన్యము లేదు. తానుజేసిన పాపము లను దలఁచుకొని అతడు భయభీతుఁడై సంజ్ఞా శూన్యుడై యుండెను. కేవలము నారాయణ, నారాయణ యని యఱచుచుండెను. మాంస పిండ మును జూడఁగానే గ్రద్దలు నాల్గు దిక్కుల నుండి మూఁగినట్లు, నల్గు రొక్కసారిగా నుచ్చైస్స్వరముతో "భయపడకుము, భయపడకుము" అనుచు వచ్చిరి. మేము నిర్ఘాంతపడి చూచుచుంటిమి. వారు సున్నము లోనికి ఎముక లేకుండ నలుగఁగొడిచిరి. స్వామీ ! ఆ యద్భుత పురుషు లెవరో, ఎవరి దూతలో, నారాయణ శబ్దము వినఁగానే వారెచ్చటి నుండి వచ్చిరో మాకు చెప్పవలయును. వా రా పాపిని మానుండి బలవంతముగ నేల లాగుకొనిరి ?"

శ్రీ శుకుఁ డిట్లనెను :— "రాజా ? ఇది వినఁగానే యమునకు గన్నులనుండి ప్రేమాశ్రువులు వెలువడెను. నారాయణ నామ శ్రవణ

మాత్రముననే ఆతని శరీరము పులకించెను. ఆతడు భగవచ్చరణ కమలముల ధ్యానించుచుఁ బ్రేమాశ్రువులను దుడుచుకొనుచు దూతల ప్రశ్నలకు ప్రత్యుత్తర మీయ నుద్యమించెను.

## యముఁడు దూతలకుఁ బ్రత్యుత్తర మొసంగుట

## 367

శ్లో॥ పరో మదన్యో జగతస్తస్థుషశ్చ
ఓతం ప్రోతం పటవద్యత్ర విశ్వమ్।
యదంశతోఽస్య స్థితి జన్మ నాశా
నస్యోతవద్యస్య వశేచ లోకః ॥

శ్రీ భాగ. ౬ స్కం. ౩ అ. ౧౨ శ్లో॥

సీ॥ కలడు మద్యనుండు ఘనుఁడొక్కఁడతఁడెందు
వెలకిఁగానఁగరాక విశ్వమెల్ల
నతిలీలమై మహాద్భుత సమగ్రస్ఫూర్తి
నుండును గోకనూలున్న భంగి
దామెనఁ బశువులు దగిలి యుండెడుమాడ్కి
నామసంకీర్తన స్థేమగతుల
విహరించు నెవ్వడు విలసిత మత్ప్రజ
లెవ్వని పదముల నివ్వటిల్లు

ఆ॥ గనుట మనుట చనుట గల్గు నెవ్వని లీల
లందులోక మెవని యందుఁబొందు
నెన్నఁబడుచు బుధమి నెవ్వని నామముల్
గర్మబంధనముల పేర్మి నడఁచు ॥

శ్రీమదాంధ్రభాగవతము

ప్రియతముని గుణగాన మే విధముగఁ జేసినను వాని యెడలఁ ప్రియతముడు ప్రసన్నుఁడై, ప్రేమాస్పదుని విషయమునఁ బ్రేమను వెడలఁ గ్రక్కుచుండును. వినఁదగిన ప్రియకార్యము లన్నిటిలోను బ్రేమాస్పదుని కథలే ప్రియమైనవి. వాని అన్నిటియందు సుఖద, సుంద రములును, అంతఃకరణమును దన్మయ మొనర్చునట్టియు నగుఁ దన యిష్టదేవుని ప్రేమాస్పద గౌరవయుక్తమగు గుణగాధలే యుండును.

శ్రీ శుకుఁ డిట్లనెను :— "రాజా! యమదూతలు క్రొత్త వారుగాఁ గనఁబడుచున్నారు. వారు భగవత్తత్త్వమును దెలియనివారుగాఁ దోఁచుచున్నారు. నేడు వారినోట నారాయణ సంబంధమగు విషయములను విని యముఁ డత్యంత ప్రసన్నుఁడయ్యెను. త్రైలోక్య పావనమగు సుమధుర నారాయణ నామమును వినఁగానే అతని శరీరమంతయును రోమాంచమయ్యెను. ప్రేమావేగమున నాతడు వికలుఁ డయ్యెను. కొంచెము సేపటికి ప్రేమావేగము శాంతించిన మీఁదట యము డిట్లనెను :— "దూతలారా! మీరు నన్నే సర్వస్వము ననుకొనుచున్నారా? అది మీ భ్రమ. నేనీ చరాచర జగత్తునకు స్వామినికాదు. ఈ జగత్తును బ్రహ్మ సృష్టించును. సృష్టికర్త ఆయన. చరాచర జగత్తును బరిపాలిం చునది విష్ణువు. విష్ణువు పాలనకర్త. చివరకు సమస్తమును సంహార

మొనర్చువాడు త్రినేత్రుడగు రుద్రుడు. అతఁడు సంహారేశ్వరుఁడు. వీరు మువ్వురెవరి యంశచే నుత్పన్నులైరో అతఁడు శ్రీమన్నారాయణుఁడు. అతఁడే వారికి స్వామి, అతఁడే అందఱకును గతి. అతఁడే గురువులకు గురువు. అతఁడే శాసకు లందఱకును సామ్రాట్టు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులును తదితరులును అతని యాదేశములను పాలించెదరు. ఘటాదులందు మృత్తువలెను, కుండలమందు సువర్ణము వలెను, వస్త్రమందు సూత్రమువలెను, పంచదార బొమ్మలందు చక్కెరవలెను నాతఁడు విశ్వమందంతటను నోతప్రోతమై యున్నాఁడు. ఆ సర్వేశ్వరుఁడే సమస్త ప్రాణులను త్రిప్పుచున్నాఁడు."

దూత లిట్లనిరి :— "స్వామీ ! అతఁడెట్లు త్రిప్పుచున్నాఁడు ?" వెంటనే యముఁ డిట్లనెను :— "అతఁడెట్లు త్రిప్పుచున్నాఁడనునదియుఁ బ్రశ్నయేనా ? కోఁతుల నాడించువాఁడు కోఁతుల నెట్లాడించుచున్నాఁడు ? ఒంటెలను నడుపువాఁడు దాని ముక్కునకుఁ ద్రాడునువైచి యెచ్చటికైనను త్రిప్పుటలేదా ? రైతు యెద్దులకు ముక్కుదాళ్ళు వైచి యిష్టము వచ్చినట్లు త్రిప్పుటలేదా ? అదేవిధముగ వర్ణాశ్రమ రూపనామములచే వేదరూపమగుఁ ద్రాడునందు గట్టి నారాయణ రూపుఁడగు స్వామి తన యిష్టము వచ్చినట్లు జీవులను త్రిప్పును. వారందఱును వివశులై అతని సైగ ననుసరించి యాడుచున్నారు. అతని యిచ్చకు విరుద్ధముగ నెవ్వరును నొక యూవగింజంతైనను నటునిటుఁ గదలరు."

దూత లాశ్చర్యముతో నిట్లనిరి :— "అయితే మీరాతని యాజ్ఞ చేతనేనా అందఱను బట్టి కట్టితెచ్చుట మీరును స్వతంత్రులు కారా ?"

యముడు గట్టిగా నిట్లనెను :— "నేనేమిటి ? ఇంద్ర, వరుణ, కుబేర, నిరృతి, అగ్ని, శివ, వాయు, చంద్ర, సూర్య, బ్రహ్మ

ద్వాదశాదిత్య, విశ్వేదేవ, వసుగణ, మరుద్గణ, సాధ్యగణ, సిద్ధగణ, రుద్రగణాదులును, వీరుగాక తమోగుణ రహితులగు భృగు మొదలగు మహర్షులును, ప్రజాపతి వైవస్వతాది మనువులును, సత్వ ప్రధానులగు దేవగణములును వీరెవ్వరు నాతని లీలా మర్మముల నెవ్వరును దెలియ లేరు. ఆతడు వీరందఱకును స్వామి."

దూత లిట్లనిరి :— "ప్రభూ! అతఁ డెచ్చట నుండును? ఆతని దర్శన మెట్లగును?"

యముడు నవ్వి యిట్లనెను :— "ఆతనికొక్క స్థానము లేదు; సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు, ఆతడు జీవుని యొక్క అంతఃకరణము లో సాక్షిరూపముననున్నాడు. జీవుఁడాతని నింద్రియ వాఙ్మనః ప్రాణహృదయములలో దేనిద్వారానైనఁ దెలిసికొనఁ జాలడు."

దూత లిట్లడిగిరి :— "బ్రహ్మాండంబును నాతని ప్రకాశముచేఁ బ్రకాశించుచుండ నాతనిని జీవులేలఁ జూడఁజాలరు?"

యముఁ డిట్లనియె :— "అతి సమీపముననుఁ, అతి దూరముననున్న వస్తువులు కనఁబడవు. ప్రయాగలో నున్నవాఁడు కాశిలో నేమి జరుగుచున్నదో చూడఁడు, కన్నులు రెండునున్నప్పటికిని గనఁజాలము ఏ నేత్రములతో నన్నిటినిఁ జూచుచున్నామో ఆ కంటికాటుకను నేత్రము చూడఁజాలదు. ఏ చక్షురింద్రియముతో సర్వమును బ్రత్యక్షముగఁ జూచుచున్నామో, అట్టి ప్రకాశక చక్షురింద్రియముచే రూపవంతములగు పదార్థములను జూడఁజాలకున్నాము అదేవిధముగ నందఱి అంతఃకరణము లందున్నను నాతడు మనోబుద్ధీంద్రియములచేఁ జూడఁబడడు."

దూత లిట్లనిరి :— "అయితే స్వామీ! అతఁ డొక్కఁడా? పలువురా? మా సమ్ముఖమున పరమ మనోహరుడు, అత్యంత రూప

వంతులు, సర్వగుణ సంపన్నులు, సుందర స్వభావము గలవారు నల్గురు మహాపురుషులు ప్రకటమైరి. వారందఱును నారాయణులేనా ? లేక వారిలో నొకఁడేనా ? లేక ఆ నల్గురకు విలక్షణముగ నింకొక నారాయణుడు కలడా ?"

నవ్వి యవ్వివస్వంతుఁ డిట్లనెను :— "ఓరి వెఱ్ఱి పెద్దమ్మలారా ! వారు శ్రీమన్నారాయణుని పార్షదులు. వారును భగవంతునివలెఁ జతుర్భుజములందు శంఖ, చక్ర, గదా, పద్మములను, కంఠమున వనమాలను ధరించెదరు. పీతాంబరమును జుట్టుకొని దివ్య విమానములందు విహార మొనర్చుచుందురు."

దూత లిట్లనిరి :— "స్వామీ ! మేమచ్చటికి వెళ్ళినప్పుడు వారచ్చట లేరు. మేమా పాపినిఁగట్టి తేఁబోఁగా 'నారాయణ' యను నాల్గక్షరములను వినఁగానే వారు గబ గబ నెచ్చటి నుండియో పరువిడి వచ్చిరి."

యముడు నవ్వి యిట్లనెను :— "వారు వచ్చుటేమిటి ? వారు సదా యీ విధముగానే ప్రపంచములోఁ దిరుగుచుందురు."

యమదూత లిట్లనిరి :— "ప్రభూ ! ఈ విధముగ విశ్వమందు భ్రమించుటకుఁ గారణమేమి ?"

యముఁ డిట్లనెను :— విష్ణు భక్తులకు బాధలేమియుఁ గలుగుట లేదుకదా యనియుఁ గనిపెట్టుకొని యుందురు. దేవ వందితులును, దుర్దర్శ స్వరూపులును, బరమాద్భుతులగు విష్ణుదూతలు భగవద్భక్తులగు మానవులను వారి పరపక్షముల నుండియు. నా నుండియు, అగ్ని మొదలగు మారక వస్తువుల నుండియు సర్వత్ర సురక్షితముగఁ గాపాడుచుందురు."

సూతు లిట్లనిరి :- "ఆ భగవంతుని మనము యింద్రియాదుల ద్వారా చూడఁజాలనప్పుడు, అతని గుణకర్మల నెవఁడైన నేఁటివఱకు అన్యసాధనము ద్వారా తెలిసికొన్నాఁడా ?"

అంత యముఁ డిట్లనెను :- "అతని విషయములో నెవడును నిశ్చితరూపమున నేమియుఁ జెప్పఁజాలడు సత్త్వగుణ ప్రధానులగు ఋషులు, దేవతలు, సిద్ధులు సత్త్వగుణ ప్రధానులగు మానవులు అతని విషయమున నిట్టివాఁడని దృఢముగా జెప్పజాలకుండిన నింకఁ దమోగుణ ప్రధానులగు నసురులు, రాక్షసులు, దైత్యులు, దానవులు, గుహ్యకులు, చారణులు, విద్యాధరులు, మానవులు మొదలగు వారేమి చెప్పగలరు ?"

యమదూత లిట్లనిరి :- "అయితే ప్రభూ! ఇంతవఱకు లోకములో నా పరమపావన దురూహ దుర్బోధ భగవద్ధర్మమును దెలిసినవాఁ డెవ్వడును లేడనుకొందుము. అతనినిగూర్చి యెవ్వడు నెఱుఁగనప్పుడు అతని విషయమున నేమిచెప్పవలయును ఎట్లు ప్రయత్నింపవలయును?"

యముడు దృఢముగ నిట్లనెను :- "ఎఱిగిన వారేలలేరు ? పూర్ణముగఁ గాకున్నను నీ ధర్మము నెరిగినవారు కొందఱు కలరు. ఆ ధర్మము నెరిఁగిన పరమభాగవత వైష్ణవులను పంద్రెండుగురను నేనెఱుఁగుదును."

యమదూత లిట్లనిరి :- "మహారాజా! మేము వినుట కధికారుల మగుచో, అది పరమ గోపనీయమైనది కాకున్నచో నా పరమ భాగవత ధర్మజ్ఞాతలెవరో మేము వినఁగోరుచున్నాము. వారి పేర్లను మాకుఁ జెప్పుడు."

యముఁ డిట్లనెను :— "లోకపితామహ భగవాన్ బ్రహ్మయు, వీణాధారి దేవర్షి నారదుడును, అనన్య రామనామోపాసకుడు శివుడును, ఊర్ధ్వరేతస్కుఁడును మాయాప్రపంచ విముక్తుఁడగు సనత్కుమారుడును, జ్ఞానావతారుఁడగుఁ గపిలుడును, ఆదిరాజగు స్వాయంభువ మనువును,

భక్తాగ్రగణ్యుడును అసుర వంశావతంసుఁడగుఁ బ్రహ్లాదుడును, జీవన్ము క్తుఁడగు జనకుడును, బాలబ్రహ్మచారియు, గంగాపుత్రుడును, భరతవంశ కేతువగు భీష్మపితామహుడును, అవధూత శిరోమణి పరమహంసావతం సుఁడగు శ్రీశుకుడును, ఇట్టి పదునొకండుగురు ఈ ధర్మము నెఱిఁగిన వారు. పండ్రెండవ వానిని నన్నుగా దెలియుము."

యమదూతలిట్లనిరి :- "అయితే ప్రభూ! మీరును వైష్ణవులేనా?"

యముఁ డిట్లనెను :- "ఎట్లు చెప్పుదునయ్యా! నేను వైష్ణవుడనే కాని విష్ణుదేవుడు నాకుపాస్య దైవమగుటచే నన్ను వైష్ణవుఁ డందురు."

దూత లిట్లనిరి :- "ప్రభూ! వైష్ణవులెన్నడు నెవరికిని బీడను గలిగింపరుకదా! మీరు రాత్రింబవళ్ళు జీవులను జంపుచుందురు. మీరు వైష్ణవులే యగునెడల మీకు ముక్తియేల రాలేదు? మీరీ హింసలో నేలఁ బడితిరి?"

అంత గంభీరుడై యముఁ డిట్లనెను :- "నాయనలారా! వైష్ణవుడు తన కొఱకేదియును జేయదు, ఏది చేసినను భగవత్సేవా భావముతో జేయును. భగవంతుఁడాతని నేకార్యమున నియమించునో నదియే యాతడు సేవగా భావించి శ్రద్ధతో జేయును. ఇక ముక్తివిషయ మందువా, వైష్ణవుడు బంధనమున బడలేదు. బద్ధుఁడే ముక్తినిఁగోరును. ఈ విశ్వ బ్రహ్మాండము శ్రీమన్నారాయణుని లీలావిలాసము. భగవంతుడు తన భక్తుని నెచ్చట నుంచిన భక్తుఁడచ్చటనే సంతోషముతో నుండును. అతని యాజ్ఞను బాలించుటయే తన పరమ ధర్మముగ భావించును."

యమదూత లిట్లనిరి :- "మహారాజా! మాకును గొంచెముగ యత్కించిద్భగవద్ధర్మమును గూర్చి తెలుపుడు."

అంత యముఁడిట్లనెను :- "అయ్యలారా! ఈ లోకములో భగవన్నామోచ్చారణము ద్వారా చేసిన భక్తియోగమే మానవులకుఁ బ్రధాన ధర్మముగ జెప్పఁబడినది. మీ కధికముగ జెప్పవలనిలేదు. ఎంతో పాపి

యగు నజామిళుడు నామోచ్చారణము వలన మృత్యుపాశ వినర్ముక్తుడై పరమపావనుడును బూజనీయుడునగుట మీరు కన్నులారజూచియేయున్నారు గదా! కావున సమస్త పాపములు సమూలముగ నాశము కావలయునని భగవంతుని గుణకర్మ సంబంధముగు నామములనే కీర్తింపవలయును. ఇదియే తగినసాధనము. దీనికి మించిన ధర్మముగాని, పాపములకు దీనికి మించిన యమోఘ ప్రాయశ్చిత్తముగాని యికలేదు. భగవద్ధర్మ దీక్షితు లగువారు సర్వవిధముల భగవన్నామకీర్తన మొనరింపవలెను. నామకీర్త నమునకు విఘ్నమాపాదించువారెంతటి ప్రియులైనను, వారిని బరిత్యజిం పవలెను భగవన్నామ సంకీర్తనమునకు బాధకలిగించు స్థలమున నెన్ని వసతులున్నను దానిని బరిత్యజింపవలెను. నామసంకీర్తనమునకు సహాయ కులుగాని వారితో సంబంధమును బెట్టుకొనరాదు. నామమే కర్తవ్యము కావలెను. నామమే జీవనాధారము కావలెను. కృష్ణకీర్తనమే ప్రధానమగు నాహారము కావలెను. నామసంకీర్తనమే తన సర్వస్వము కావలెను. భగ వానునికి సంబంధించిన శబ్దముతప్ప వేఱుశబ్దము నుచ్చరింపరాదు. ఇదియే భాగవతధర్మము. భగవన్నామమును గీర్తించుటయు, ఆతనిసరస మధుమయ కథలను నిత్యము నియమముతో శ్రవణమొనర్చుటయుఁ దన సర్వస్వము నాతని కర్పించుటయు, నివియే పరమధర్మము-ఇదియే ప్రతి జీవికిని బ్రధానకర్తవ్యము."

అంత యమదూత లిట్లనిరి :- "స్వామీ! భగవన్నామమున కింతటి మాహాత్మ్యముండఁగా నింతటి గొప్ప గొప్ప ఋషులు, మహర్షు లందరును నామసంకీర్తనమున కింతటి యాదరమీయక గొప్ప గొప్ప యజ్ఞములలో మునిఁగిరేల? అనేకపాపముల కనేక కఠిన ప్రాయశ్చిత్త ములను జెప్పిరేల?"

యముఁ డుదాసీనతతో నిట్లనెను :- "పెద్దలకు బెద్దవిషయములు ఈ విషయములో నేనేమి చెప్పఁగలను? ఆ ప్రాయశ్చిత్త విధానముల

నొనర్చు మహానుభావులబుద్ధి దురూహమగు భగవన్మాయా మోహితమైన దని మాత్రము చెప్పినజాలును. లేక భగవన్నామసంకీర్తనమున నింతటి మహాత్మ్యమున్నదని తెలియకనైన నట్లుండవచ్చును. అందువలననే వారు స్వర్గాధినశ్వర ఫలములను గూర్చి గొప్పగాఁ జెప్పు నాపాత రమణీయ పుష్పస్థానీయమగు వేదవాక్యములందుఁ జిత్తమును ప్రవేశింపఁజేయుటచే భగవన్నామ సంకీర్తనమును వదలి పెద్ద పెద్ద యజ్ఞయాగాది క్లేశములు గల కర్మలలోఁ బడినారు. కావున దూతలారా! భగవన్నామ సంకీర్తన మున దప్ప భగవత్ప్రాప్తి కింతటి సరళసుగమ సాధనము లేదని చెప్పఁ గలను."

భగవన్నామ సంకీర్తనము సమస్త యుగములలోను సమాన మాహాత్మ్యము కలదు. కాని కలియుగ మందిట్టి సర్వోప యోగియగు సాధన మింకొకటి లేనేలేదు. కావున భగవన్నామ సంకీర్తన మొనర్చు వాడు నా శాసనమునకు మించినవాడు. ఆతడు నా ప్రభువునకు సంబం ధించినవాడు. అట్టివానికడకు మీరు పొరపాటుననైన బోవుడు."

యమదూతలు భయపడి యిట్లనిరి :- "స్వామీ! ఇదంతయు గందరగోళముగ నున్నది. ఎవరెవరి కడకు వెళ్ళవలయునో, ఎవరెవరి కడకు వెళ్ళరాదో, ఎవరెవరిని బట్టుకొని రావలయునో. ఎవరెవరికి మార మునుండియే ప్రణామము గావించిరావలెనో ఒక పట్టికను మాకు వ్రాసి యీయవలెను. అట్లు గాకున్న నిత్యము మాకు మర్దన జరుగుచునేయుం డును గదా!"

## యమదూత లెవనికడకు పోవలెను? ఎప్పటికి పోరాదు?

## 368

శ్లో॥ జిహ్వాన వక్తి భగవద్గుణ నామధేయమ్
చేతశ్చనస్మరతి తచ్చరణారవిందమ్ ।

క్రిష్ణాయ నో నమతి యచ్ఛిర ఏకదాపి
తా నానయధ్వమసతోఽకృతవిష్ణుకృత్యాన్ ॥

శ్రీ భాగ. ౬ స్కం. ౩ అ. ౨౯ శ్లో.

సీ॥ ఏకసక్కెమునకైన నిందిరా రమణునిఁ
బలుకంగలేని దుర్భాషితులను
గంగలోనసైన శ్రీకాంతుని సత్పాద
కమలముల్ సూడని కర్మదృశుల
నవ్వుచునైనఁ గృష్ణ ప్రశంసకుఁజెవిఁ
దాప్ప నేరని దుష్కథా ప్రవణుల
యాత్రోత్సవంబులనైన నీశుని గుడి
త్రోవఁద్రొక్కఁగ లేని దుష్పదులను

గీ॥ బరమ భాగవతుల పాదధూళి సమస్త
తీర్థసార మనుచు దెలియలేని
వారి వారి వారి వారిఁ జేరినవారిఁ
దొలుత గట్టి తెండు దూతలార ॥

శ్రీమదాంధ్రభాగవతము.

ప్రకాశము లేని స్థలముననే అంధకార ముండును. ఎంతటి అర్థ రాత్రియైనను, ఎంతటి అంతఃపురమైనను విద్యుత్ప్రకాశము ప్రవేశింపఁ గానే కిళకిళ తళతళలతో వెలుఁగును. చేతిలో దీపమును బెట్టుకొని యింటిలో మూల మూలలు వెదకినను నీకంధకారము దొరకదు. భగవన్నామ మెంతవఱకు ప్రతిధ్వనింపదో అంతవఱకే మానవుని శరీరమందు పాపములుండును. భగవన్నామము కర్ణరంధ్రముల ద్వారా హృదయము

లోనికిఁ బ్రవేశింపఁగనే, జిహ్వాద్వారా ఉచ్చారణ రాఁగానే పాపములు పారిపోవును. నిరంతర నారాయణ నామస్మరణము కడ పాపములు నిలువవు; ఉండుటను టాశ్చర్యకరము. బాగుగా నామము నాశ్రయించిన వానివలనఁ బాపములు సంభవింపనే సంభవింపవు. ఒకవేళ పొరపాటున సంభవించిన నవి తత్కాలమున నామోచ్చారణముచే నశించును."

శ్రీ శుకుఁ డిట్లనెను :– "రాజా ! యమధర్మరాజు తన దూతలకు నారాయణ నామమహాత్మ్యమును జెప్పఁగా నంత యమదూత లిట్లనిరి :– "ప్రభూ ! భగవన్నామమున కింతటి మాహాత్మ్య ముండినచో నందఱు భగవన్నామము నేల ఆశ్రయింపరు ? వారు దుఃఖములనేలఁ బొందెదరు?"

అంత నత్యంత దుఃఖముతో యముఁ డిట్లనెను :– "ఇప్పుడీ విషయమున నేమని చెప్పఁగలను ? అది జీవుల దౌర్భాగ్య మనవలెను, కాకున్న భగవంతుని సరళ నామములు రామ, కృష్ణ, హరి, గోవింద, మధుసూదన, మురారి, మాధవ, మోహన, రఘునందన, యదునందన, శ్యామసుందర మొదలగు నామములు ఒకదానికంటె నొకటి మనోహరములైనవి. నాల్క మనసొత్తు. అందు చేవలసిన పనిలేదు. నామమును బలుకుటకు దేశ, జాతివర్ణ, శుచి, అశుచి, కాల, పాత్రాదినియమములేమియును లేవు. సదా, సర్వదా, సర్వత్ర, సందర్భమును సర్వావస్థలయందును భగవన్నామోచ్చారణము జేయవచ్చును. అట్లయినను జనులు భగవన్నామము ననరు. నరకాగ్నిలోఁబడి తపించుచుందురు. అనంతుని నామము నెవరు పలికెదరో వారు నా దండమున కర్హులు కారు. భగవంతునకు శరణాగతులై సమదర్శులగు సాధుసజ్జనులైనవారి పవిత్ర చరిత్రలను స్వర్గమందు దేవతలుగూడ గానము చేయుదురు. వారి గాథలను స్వర్గాధిపుఁడగు దేవేంద్రుడు మిక్కిలి శ్రద్ధతో వినును. ఇట్టి భక్తులను భగవంతుడు సర్వదా తనగదతో రక్షించుచుండును. వారికేమియును గష్టము కలుగకుండ చూచుటకై భగవంతుని పార్షదులు సదా గుప్త రూపమున

నాకాశ మండలమందు తిరుగుచుందురు. అట్టి భగవద్భక్తుల కడకు మీరు పొరపాటుననైన బోరాదు. అట్టిచోట్లకుఁబోయిన మీ కట్టి తప్పులుతప్పవు"

ఇది వినఁగానే యమదూత లదరిపడి యిట్లనిరి :- "స్వామీ ! ఇప్పుడు మేమాజోలికి పోమని ప్రతిజ్ఞ చేయుచున్నాము. నేనందఱకును స్వామినికానని మీరిప్పుడే చెప్పితిరి. మీరెవరెవరికి స్వామియో మాకు స్పష్టముగఁ జెప్పుడు."

ప్పుఁ డిట్లనెను :- "రాజా ! దూతలు వేలకొలది యపరాధులు దండింపఁబడుటకు గూర్చుండిన నిండుసభలోఁ జుట్టును బరిచారకులు, భృత్యులుండఁగా నిట్టి ప్రశ్నలడుగుట లోకపాలకు నవమాన మొనర్చుట యని యెఱుగని వజ్రమూర్ఖులు. కాని యముదేమి చేయగలడు ? ఆ మూర్ఖు లాలోచింపకయే అడిగిరి. దూతలు తమ చేతులందు పాపులను బట్టుకొనుటకు, పాశములను బట్టుకొని యుండిరి. అతడు చేతితో సైగజేసి దగ్గఱకుఁ బిలిచి వారి చెవులలో మెల్లగా నిట్లు చెప్ప నారంభించెను :— "దూతలారా ! నేనందఱకును స్వామినే కాని భగవద్భక్తులగు వైష్ణవులకు నేను స్వామినిగాను. వారికి నేను దాసాను దాసుఁడను."

ఇది వినఁగానే యమదూత లదరిపడిరి. వారిట్లనిరి :- "మహా రాజా ! ఫలానివారిని దీసికొనిరావచ్చును. ఫలానివారినిఁ దీసికొని రాఁగూడ దను నొకపట్టిక మాకీయుడు."

ఆమాట వినఁగానే యమధర్మరాజు గంభీరుఁడై యిట్లనెను:— "మంచిది, మీరు మీ దినచర్యను, సిరాముంచిన కలమును దీసికొని నేను చెప్పిన ప్రకారము వ్రాసికొనుడు."

ఇదివినఁగానే అందరు దమతమ జేబులనుండి దినచర్యలను దీసి, లేఖినీలను దీసికొని కూర్చుండిరి. వారందరును సావధానులుగను, దత్పరులుగను, వ్రాసికొన నుత్సహించుటను గాంచి ధర్మరాజిట్లనెను :- నేను విస్తారముగ నేమి వ్రాయింపఁగలను ? సంక్షేపముగ సంకేతమాత్రముగ జెప్పెదను. దాని ననుసరించి మీరూహించు కొనవలయును."

చూడుడు, ౧ భగవద్భక్తులును, ౨. భగవన్నామ గుణకీర్తనము జేయువారును, ౩. అతని యనుపమరూపమును జింతించువారును ౪. భగవచ్చరణాగతులై సమస్తమునగు సాధు స్వభావము గలవారగు నిట్టి భగవత్పరాయణులగు వారికడకు మీరు పొరపాటుననైన వెళ్ళరాదు. తెలిసినదా ?"

లేఖినితో గబగబ పూర్తి వాక్యమును వ్రాసికొని వారిలో నొకఁ డిట్లనెను :— "ప్రభూ ! తీసికొని రాగూడని వారినిగూర్చి మేము తెలిసికొంటిమి; కాని పొరపాటుకూడ జరుగుచుండును. ఎవరెవరినిఁ దీసికొని రావలయునో జెప్పుడు."

అంత యముఁ డిట్లనెను:— "మంచిది, వ్రాసికొనుడు—ఈ క్రింద జెప్పఁబడువారిని మీ మీ పాశములతోఁ గట్టి కొట్టి బలవంతముగ నా కడకు దీసికొనిరండు. ౧. ఏ పరమ కోమలారుణ చరణ కమలముల యొక్క మధుమయ మాధురీ ప్రభుప్రేమలో మునిఁగిన సర్వసంగ పరిత్యాగులకు పరమహంస మత్తభ్రమరములకు విముఖులై సమారిని ముందుగానిచ్చుటకు దప్పక తేవలయును. ౨. నరకద్వార రూపములగు గృహాదులందు మోహ మమకారములను బెంచుకొని నిరంతర మాసక్తితో నున్నవారిని, ౩. సుమధుర భగవన్నామములను, త్రైలోక్య పావన గుణములను నెన్నఁడు గానము చేయనివారిని, ౪. చిత్తచోరుని చారు చరణ కమలములను జింతింపనివారిని, ౫. భగవంతుని యొక్క అఖిలలోకాధ్యపిత్రయగు పూజా విగ్రహమునకును, చలరూపములగు భక్తుని రూపములకును నొక్కసారె నను నమస్కరింపనివారిని ౬. భగవంతుని పరిచర్యకుఁ బుష్పములను దెచ్చుటయును, మాలలు గట్టుటయును, నైవేద్యమును సేకరించుటయును మందిరమును జిమ్ముటయు, నలుకుటయు, మెత్తుటయు, భగవత్పార్షదులను గడుగుటయు, పూజా సామగ్రినిఁ బ్రోవుచేయుటయు మొదలగు సేవోపయోగ కార్యములను జేయనివారిని మీరు నిర్భయులై నా కడకుఁ దీసికొని రండు."

ఇది విని యమదూత లిట్లనిరి :— "మేము చాల యపరాధమును జేసితిమి. ఇప్పుడు దాని ప్రాయశ్చిత్తమేమి చేసికొనవలయును ?"

యముఁ డిట్లనెను :- సేవకుల వీరత్వము, పిరికితనము, సజ్జనత్వము, దుష్టత్వము ఇవియన్నియు స్వామిపై నాధారపడి యుండును. కావున మీరు భోజనాదు లొనప్పుడు, నేను మీ కొఱకు భగవత్ప్రార్థన మొనర్చెదను."

తమ స్వామి యాజ్ఞను విని యమదూత లతనికిఁ బ్రణామమును గావించి ప్రసన్న చిత్తములతోఁ దమ తమ స్థానములకుఁ బోయిరి. యమధర్మరాజు నోట భగవన్నామ మహాత్మ్యమును విని వారందఱత్యంత ప్రసన్నులైరి. భగవన్నామమున కింతటి మాహాత్మ్య మున్నదని తెలిసికొని మిక్కిలి యాశ్చర్యమును జెందిరి. ఆ దినమునుండీ వారు హెచ్చరికతో నుండిరి. ఎవరిని దీసికొని రాఁబోయినను వారికి వైష్ణవచిహ్నము లున్నది లేనిది సావధానముగఁ జూచెడువారు. భగవదాశ్రయమున నున్నవాఁడని తెలిసినదో వాని సమీపమునకుఁ బొరపాటుననైనఁ బోయెడువారు కారు అట్టివారికి దూరమున నిలుచుండియే ప్రణామమొనర్చి తిరిగి వచ్చెడువారు."

తన దూతలు వెళ్ళిపోయిన తర్వాత యమధర్మరాజు చేతులు జోడించి గద్గద కంఠముతో భగవంతునిగూర్చి ప్రార్థించెను. తనదూతల యపరాధమును స్మరించి యాతఁ డంజలిని ఘటించి యిట్లనెను :— "హే పురాణపురుషా ! హే నారాయణ ! హే ప్రభూ ! మా భృత్యుల ద్వారా భక్తాపరాధము జరిగినది. మీ దయాళు స్వభావముచే క్షమింపవలయును. హే దీనబంధూ ! మేము మీ భృత్యులము. మీ సేవలో సదా చేతులు కట్టుకొనియున్నాము. మీరు పరమాజ్ఞానులగు ననుచరుల యపరాధములవైపు ధ్యానముంచకుడు. మీ పాదపద్మములకు మాటి మాటికి మా సాష్టాంగ నమస్కారములు."

శ్రీ శుకుఁ డిట్లనెను :— "రాజా ! ఇప్పుడు నీవు బాగుగాఁ దెలిసి యుండవచ్చును. భగవన్నామ మాహాత్మ్య మెంతయో ప్రపంచములో నామసంకీర్తనమునకు మించిన సుందర సుగమ సరళసాధన మింకొకటి లేదు."

## భగవన్నామ మాహాత్మ్యము

## 369

శ్లో॥ శృణ్వతాం గృణతాం వీర్యాణ్యుద్దామాని హరేర్ముహుః
యథా సుజాతయా భక్త్యా శుద్ధ్యేన్నాత్మా వ్రతాదిభిః ॥

శ్రీ భాగ. ౧౧ స్కం. ౬ అ. ౯ శ్లో॥

వ. ఉద్దామంబులగు హరివీర్యంబుల నాకర్ణించు వారల చిత్తంబు లతినిర్మలంబులగు భంగిం దక్కిన వ్రతాదులవలనఁ గానేరవు. శ్రీకృష్ణ పదపద్మంబులు హృత్పద్మంబుల నిలుపు వారలన్యపాప దగ్ధంబులగు విద్యాతపస్సనంబులం బొరయనేరరు."

శ్రీమదాంధ్రభాగవతము.

మన మెఱుఁగని దానియందు మనకు విశ్వాసముండదు. విశ్వాసము లేనప్పుఁ బ్రీతియుండదు. కావుననే మొదటి భక్తి శ్రవణము. భగవన్నామ మాహాత్మ్యమును వినుటచే నామమందు భక్తి కల్గును. పుణ్యవంతులగుఁ గొందఱకు సహజ స్వాభావికమగు భక్తి యుండును. అట్టివారు జన్మజన్మాంతరముల నుండి భక్తులు. కావుననే వినఁగానే నామగుణకీర్తన మందనురాగము కలుగును."

శుకుడు పరీక్షిన్మహారాజుతో నిట్లనెను :— "రాజా ! జీవునకు మాయా గుణములందు గౌరవ బుద్ధి కలిగినపుడు అనిత్య నిత్యముగను, అసత్తు సత్తుగను భావించి పాపమొనర్చును. శ్రీకృష్ణ చరణారవింద రసాస్వాదన మొక్కసారి కలిగినచో నీవాహోత్పాదక మాయిక గుణములు

తఁబ్చాతి వచ్చును లుగఁ దోఁచును. నామప్రేమియగు భగవద్భక్తునికడకు పాపము రానేరాదు. వెనుకటి పాపము నామప్రభావముచే భస్మమగును. భగవన్నామము మీఁద ప్రేమలేని విషయ లోలువులు తమ దోషములను బోఁగొట్టుకొనుటకుఁ బ్రాయశ్చిత్తమునకు సంబంధించిన కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతరూపములనుఁ గర్మలందే ప్రవృత్తులగుదురు. అప్పటికా పాపములు నాశమగును కాని వాసనలుండుటచే మరలఁ బాపములు సంభవించి దోషోత్పత్తి యగును. కావున మరణకాలమున నోట భగవన్నామము వచ్చునట్లు ప్రయత్నము చేయవలయును."

అంత శౌనకుఁ డిట్లనెను :— "సూతా ! మృత్యు సమయముననే భగవన్నామము నోటనుచ్చరించుటయే యభీష్టమగునెడల నిప్పటినుండియే కంఠశోష యేల ? గజ్జలు తాళములను బిగులఁగొట్టి, మృదంగ కరతాళములలోఁ బడుటెందులకు ! మరణకాలమున నొక్కసారి రామనామమును బలికి చచ్చిన సరిపోయెను. సంసారసాగరమును దరింపవచ్చునుగదా !"

అంత సూతుఁ డిట్లనెను :— "స్వామీ : నిజమే, కానిమృత్యువునకు నిశ్చిత సమయ మేదియును లేదు. ప్రతి క్షణమును జరుగు శ్వాసలు మరల తిరిగివచ్చునో రాదో తెలియదు. కావునఁ బ్రతి శ్వాసకు మరణ సందేహము కలదు, మనము బయటకు శ్వాసను విడిచినఁ జచ్చితిమను కొనుడు. మరల లోనికిఁ బీల్చితిమా బ్రతికితి మనుకొనుడు. శ్వాసతోఁ గూడ ప్రాణములు పోవుట ఆశ్చర్యకరమగు విషయముకాదు. శ్వాసతోఁ గూడ ప్రాణములు పోవును. మరల నవి తిరిగివచ్చుట ఆశ్చర్యము. కావునఁ బ్రతిశ్వాసకుఁ జచ్చుచున్నామనుకొని 'రామ రామ' యనిజపింపవలయును.

ఇఁకఁ జచ్చునపుడు భగవన్నామ మందుమా మొదటి నుండియు నభ్యాసము లేకున్నఁ జచ్చునపుడు నామమెట్లు వచ్చును ? బాలిక వివాహితయై అత్తవారింటికి గాపురమునకు వచ్చినపుడు పది, యిరువదిమంది స్త్రీలుకలిసివచ్చి, యీమె వంట యెట్లుచేయునో అత్త ఆడబిడ్డ, మరదలు

తోడికోడండ్రుడు వచ్చిచూచి, యీపిల్ల లక్ష్మీదేవియంచును, వంటనెక్కగా జేసినదని మెచ్చుకొందురు. ఇంత బాగుగాఁ జేయుట అత్తవారింటికి రాగానే నేర్చుకొనలేదు. కూరలెట్లు వండవలయునో, పులుసులలోఁ దినుసులెంతెంత లెట్లో, పిండివంట లెట్లు చేయవలయునో, పకోడీ లెట్లు వండవలయునో ఇవియన్నియు బాల్యకాలమునుండియు నేర్చుకొని, అత్తవారింటికి రాఁగానే బాగుగాఁ జేయఁగానే తన ప్రశంస సఫలమైనట్లు భావించును.

విద్యార్థి ప్రశ్నపత్రము పరీక్షనాఁడే కదా యీ దినమున వ్రాసి యుత్తీర్ణుఁడ నగుచున్నాను గాని, రాత్రింబవళ్ళు పరిశ్రమము చేయవలసిన యావశ్యకత యేమి కలదు? అని యాలోచించు విద్యార్థి యెన్నఁడైనఁ బరీక్షలో నుత్తీర్ణుఁడగునా? ఎన్నటికిని కాఁడు. పరీక్షకుఁ బాఠ్యగ్రంథములు ప్రారంభమగానే అభ్యాస మొనర్పవలయును. అటుచేసినచో పరీక్షా దినమునఁ బరీక్షా ప్రశ్నములకు శుద్ధముగఁ బ్రత్యుత్తర మీయఁగలఁడు. అభ్యాసము లేకున్న నాఁడు దినమున నేమియును వ్రాయఁజాలఁడు. అట్లే చిన్నటి నుండియు నియమముగ భక్తిశ్రద్ధలతో భగవన్నామోచ్చారణము చేయ కుండిన, నంత్యకాలమున భగవన్నామము నోట రాదు."

అంత శౌనకుఁ డిట్లనెను :— "అజామిళుఁ డెట్లు భగవద్ధ్యానము గావించినాడు ?" సూతుఁ డీపని యత్యంత వినీతభావముతో నిట్లనెను:— "మహాభాగా! ఓరట్లనకుడు. అతనికి నూతన పుత్రుఁ డుదయించగనే సాధువుల యొక్క ఆదేశముచే నాతనికి "నారాయణ" యను పేరు పెట్టఁబడెను. అప్పటినుండి నిరంతర మాతడు "నారాయణ నారాయణ" యను నామమునే కీర్తించుచుండెను మా నారాయణుడు, రారా నారాయణ!, తినురా నారాయణ! వెళ్ళురా నారాయణ! నిద్రపోరా నారాయణ! లేరా నారాయణ! చూచ్చెందు నారాయణ! గంతురా నారాయణ! ఎంతని చెప్పఁగలను? ఆతడు రాత్రిందివములు నారాయణ నామమునే పలుకు చుండెను? కావుననే అంత్యకాలమునఁ గూడ నాతని నోట "నారాయణ" యను నామము వెలువడినది."

అంత శౌనకుఁ డిట్లనెను :— "అతడు నారాయణ నామమును బలుకలేదు. అతని పుత్రనిపుత్రుని 'నారాయణ' యని పిలిచినాడు."

అంత కొంత రోషస్వరమున నిట్లనెను :— "మహాభాగా, ఏఁబదిసార్లు నేను దీనికిఁ బ్రత్యుత్తర మొసంగితిని. పుత్రునే పిలిచెనను కొనుడు. అది విష్ణుభగవానుని నారాయణ నామమని అతనికిఁ దెలియదా? అతడు మూర్ఖుడుగాడు. వేదజ్ఞుఁడగు బ్రాహ్మణుడు జ్ఞాని, ధ్యాత, తపస్వి, సాధువులు భగవత్పూజనము చేయుచుండుటను గాంచఁగానే అతనికి భగవ త్ప్రవృత్తి యందాకాంక్ష కలిగెను. మునివరా! ఎటువంటి మానవుఁడైనను వాని మనస్సులో నాత్మ సమర్పణా కాంక్ష యుండును. ఏగియో అవ్యక్తశక్తిని శరణువేఁడుటకై కొందఱాస్తిక భావముతోఁడను, గొందఱు నాస్తిక భావముతోడను భగవంతునిఁ బిలుచుచుందురు. మానవుడు భగవ ద్విషయమునఁ జింతింపక యుండలేడు. ఇది కొందఱి హృదయములలో దీప్రముగ నుండును, కొందఱిలో సాధారణముగ నుండును. కొందఱి హృదయములలో నత్యంత మందముగ నుండును. అజామిళుని మన స్సులోఁగూడ భగవత్ప్రవృత్తి వాసన దాఁగియున్నది. సాధువులను జూడఁగానే నది వ్యక్తమైనది. అతడు సాధువులను శరణు బొందెను. స్వామీ! హృదయ పూర్వకముగ దాను పాపినని తెలిసికొనినవాడు తప్పక ఉద్ధరింపఁ బడఁగలడు. పాపమును జేసియుఁదాను ధర్మాత్ముఁడ ననుకొనుచుఁ దనపాపములను దాఁచుకొనుట కెన్నిపాపములు చేసినప్పటి కిని నొక్కసారి హరినామమును స్మరించిన సమస్త పాపములు శమించు నని పాపములు చేయువాఁ డుద్ధరింపఁబడుట చాల కష్టము. అజామిళుడు తాను పాపినని తెలిసికొనెను. సాధువుల పవిత్రపద్ధతినిగాంచి, తానుజేసిన దొంగతనములు, రంకుతనములు, దోపిడీలు, జూదము, హత్యలు మొద లగు కర్మలను దలఁచుకొని, తాను భగవత్పూజనమున కధికారి కానినియు

